

"తేనెమనసులు" ఈస్ట్మన్ కలర్ చిత్రంలో కొత్తహీరో కృష్ణ.

# గుంటూరు విజయా అండ్ కో



H. M. V. Star Record Playei



Philips Portable Radio:

ఫిలిప్సు రేడియోలు, రేడియో గ్రాములు, ఎలెక్ట్రిక్ సామానులు, అహూజా ఏంప్లిఫైయర్లు, ఎవర్ రెడీ బ్యాటరీలు, హిస్‌మాస్టర్సు వాయిస్ గ్రామఫోన్‌లు, రికార్డు ప్లేయర్లు, టేప్ రికార్డులు, గ్రామఫోన్ రికార్డులు, అనేక రకముల వాచీలు, తదితర సామానులను, నవీనమైన షో రూమ్సులో అమర్చి, చూపరులకు కరంగా ప్రదర్శిస్తున్నారు. కంపెనీలో ఎయిర్ కండిషన్డు ములు ఒక ప్రత్యేకాకర్షణ. రూమ్సు నిర్వాహకులు, సర్వీ స్టేషన్‌లోని యింజనీర్లు ప్రదర్శించే మంచితనము, వినయ సంపన్నత, కష్టమర్లను విజయ అండ్ కంపెనీకి సన్నిహితులను చేయుటకు తోడ్పడుతున్నాయి. అభివృద్ధి కరమైన వ్యాపార నిర్వహణకు అవసరమైన యీ మంచి లక్షణాలే విజయా అండ్ కో వారి దినదినాభివృద్ధికి మూలకారణమూ అనిపిస్తుంది. యిందుకు తోడుగా యజమాని యొక్క వ్యాపార సరళత, ఉదారత, కంపెనీయొక్క పేరు ప్రతిష్ఠల వ్యాప్తికీ, అభివృద్ధికీ యెంతో ఉపయోగపడుతున్నాయి. వ్యాపారం నీతి నిజాయితీలపై ఆధారపడి, క్రమాభివృద్ధి జెందుతుందని వారు నిరూపిస్తున్నారు.

చిన్న వ్యాపారంగా ప్రారంభించబడి, రెండు దశాబ్దములలో విశేషాభివృద్ధిని సాధించిన అదృష్టం, ఖ్యాతి గుంటూరు విజయా అండ్ కో వారికి దక్కడానికి ప్రధాన కారణం. కష్టమర్లపట్ల వారు ప్రదర్శించే ఆదరణేనని వేరుగా జెప్పనవసరం లేదు.

విజయా అండ్ కోను ఒక్కమారు సందర్శించినవారు ఆ కంపెనీని మరచిపోలేరు.

ప్రజల ఆదరాభిమానములే, విజయా అండ్ కో వారిచే విజయవాడలోను, మాచర్లలోను బ్రాంచీలను యేర్పాటు జేయించుటకు ప్రోత్సహించాయి.

## విజయా అండ్ కో వారి

**విజయ యాత్ర యింకా దినదిన ప్రవర్థమాన మవుతూ వర్ధిల్లాలని ఆశిద్దాం.**

—యస్. ఆనందరావు.

ADVT.

బాబూమూవీస్ వారి
అందాల
హరివిల్లు

# తేనెమనసులు

-ఈస్ట్‌మన్ కలర్

దర్శకుడు ఆదుర్తిసుబ్బారావు నిర్మాత సి సుందరం
కోడైరెక్టర్ కె విశ్వనాథ్ సంగీతం మహదేవన్
శ్రీఫిలింస్ విడుదల

అక్కా! అక్కా!
ఎలక తోకల్లాగ రెండు
జడలేసుకుంటే
నువ్వేం బావుండవుట-
మామేష్టారు
చెప్పారు.



NVKR



విశాఖపట్టణం శ్రీ సరస్వతి పిక్చర్ ప్యాలెస్ ప్రొప్రయిటర్ శ్రీ రాజా వాసిరెడ్డి వెంకట సత్య నారాయణప్రసాద్ బహద్దూర్ వారి కుమారుడు చి॥ సీతారామప్రసాద్ కు చి॥ సౌ॥ కుసుమ కుమారి ని యిచ్చి విజయవాడ హనుమంతరాయ గ్రంథాలయములో మార్చి 5 వ తేదీన వైభవంగా వివాహం జరిగింది.





# ఉత్తరాలు

## వ్యాసాలు

'శిష్టర్ గ్రిన్‌స్పాన్' వ్యాసం ఒక్క పేజీలోనే ముగించినా చదివిన విషయాన్ని గురించి సింహావలోకనం చేసే ప్రతిఒక్క మెదడుకూ పని కల్పించేట్లుగావుంది. 'నిజం మాత్రం చెప్పి లాభంలేదు' జ్ఞాను, నిజాన్ని చాలామంది ఆలస్యంగానే గుర్తిస్తారు. అసలు నిజం యొక్క నైజమే అంత. ఈ పరిస్థితిలో, అంటే— అత్యంత ప్రమాద స్థితికి చేరిన నాగరిక ప్రపంచంలో ఈనాడే గనుక గాంధిమహాత్ముడు బ్రతికుంటే, అణుబాంబు ప్రమాదాన్ని గురించి ప్రపంచానికి తన శాంత కంఠంతో చక్కగా బోధించేవాడేమోననిపిస్తుంది. ఏదేమైనా మనంగూడ అణుబాంబును సృష్టించి తద్వారా ప్రమాదాన్నెక్కువ చేయడం వివేకమైన పనిగాదు. ఒకడు—మనకోసమే ననుకుందాం—ఒక గొయ్యి త్రవ్వాడు. తను త్రవ్వకున్న గోతిలో తనే పడవచ్చు! వేచి చూస్తేనేగా నిజంతెలిసేది. అలాగాక మనం గూడా పోటీగా మరొక గొయ్యి త్రవ్వితే? అంతా గోతులమయమై అనుకున్న విధంగా కాక మరో విధంగా జరిగే ప్రమాదం వుంది! 'నిజం మాత్రం చెప్పి లాభంలేదు' రచయితను శ్లాఘించతగిన. . .. స్థోమతగల వాడిని కాకపోయినా సాహసిస్తున్నాను. ప్రస్తుతం ప్రమాద స్థితిలోవున్న ప్రపంచమానవాళిని హెచ్చరించి, యిప్పుడైనా మేల్కొండన్నట్లున్న వ్యాసాన్ని ప్రచురించిన మీకు నా హృదయపూర్వకమైన అభినందనలు తెలియచేస్తున్నాను

బి. ఆర్. చంద్రరావు (తెనాలి)

## కథలు

అరుణగారి "ఆశాజీవి" కథ చాలా బాగున్నది చదివిన వెంటనే ఉత్తరము వ్రాస్తున్నాను కథలోని భావాలు చాలా బాగున్నవి ముక్కకి ఉన్న విశ్వాసములో సగమేనా ఈనాటి మానవునికి లేదు అనిపిస్తుంది. కథ రచించిన అరుణగారికి అనేక అభినందనలు.

బా వా. రమణమ్మ. (సికిందరాబాదు)

*　　*　　*

"ఫేర్ వెల్ టు మై ఫ్రెండ్" కథ బాగున్నది. కాని రచయిత్రి కథకు ఈ పేరు ఏందుకు పెట్టారో అర్థము కావటములేదు. బహుశా వారు విదేశములో ఉండడమా ఎట్లనేమో!

యుద్దనపూడి సురేష్. (నెల్లూరు)

*　　*　　*

ఈవారం (12—3—1965) పత్రికలో పడిన "ఫేర్ వెల్ టు మై ఫ్రెండ్" రచయిత్రి శ్రీమతి జంధ్యాల రుక్మిణీ రామకృష్ణగారు ఆక్స్ ఫర్డులో ఉన్నారని మీరు తెలిపారు ఆ కారణంచేత బహుశా ఆమె కథకు ఇంగ్లీషు పేరు ఎన్నుకుని ఉండవచ్చు కాని 'ఆంధ్ర' సచిత్ర వారపత్రికలో అలాగే ప్రచురించడానికిగల కారణం సెలవిస్తారా?

*ప్రత్యేకంగా కారణమంటూ ఏదీలేదు!

కె. రమేష్. (కాకినాడ)

## సర్వర్ పరిచయం

సర్వరు గురించి వ్రాసిన వ్యాసం గుండెకరిగించేలా వుంది. ఇలాటి వ్యాసాలు కొందరికి విస్సారంగా కనిపించవచ్చు. కొందరికి మాత్రం తరుచు ఇలాటివి ప్రచురిస్తారని ఆశిస్తాను.

రామలక్ష్మి (ఛత్రపూర్)

## ఎవరి ఆదాయం ఎక్కడ

"ఎవరి ఆదాయం ఎక్కువ" అన్న శీర్షికతో లెక్కలు చూపించి, "పై లెక్కలను బట్టి ఆంధ్ర రాష్ట్రం ఎంత వెనుకబడి ఉందో ఊహించవచ్చు" అని వ్రాసారు. అసలిప్పుడు మనరాష్ట్రం విద్య, పరిశ్రమలు, పరిశుభ్రత, పరిపాలన, క్రీడ మొదలయిన విషయాలలో దేనిలో వెనుకబడలేదు? మనరాష్ట్రంలో విద్యాధికులున్నారు, అభివృద్ధి మీద ఇష్టమున్న మంచివారున్నారు, సహజ సంపదలున్నాయి కానీ దేనిలోనూ అసలైన అభివృద్ధి లేదు అందరికీతెలిసి మనరాష్ట్రంలో ఉన్నదల్లా అభివృద్ధిని కృంగదీసే అసహ్యకరమైన రాజకీయాలు.

ఇప్పటి మన ప్రభుత్వపక్ష, ప్రతిపక్ష, పార్లమెంటు సభ్యులకు మనరాష్ట్రంలో పరిశ్రమలు లేవని, మనరాష్ట్ర అభివృద్ధి విషయంలో కేంద్రానికి అభిజాత్యమున్నదనీ, మనపట్టణాలు అశుభ్రంగా ఉన్నాయనీ తెలియదా? మనరాష్ట్ర పి. డబ్ల్యు డి. లోనూ, గ్రామపరిపాలనలోనూ రాజకీయాలూ, రాజబంధువులూ ఉన్నాయనీ ఎవరికీ తెలియదా? అసలు ఇప్పుడు ఆంధ్రులలో అన్నివర్గాలలోనూ (రాజకీయవాదులు, విద్యావేత్తలూ, విద్యార్థులు, ఉద్యోగస్థులు, సామాన్య ప్రజానీకం) ఒకరకమైన వ్యక్తిగత పోకడ ఏర్పడి "ఏది ఎట్లాపోతేనేమి" అన్న ధోరణి ఏర్పడింది.

మద్రాసులో ఇంటెగ్రల్ కోచ్‌ఫాక్టరీ, హెవీ టాంక్స్‌ఫాక్టరీ, లిగ్నైట్ ప్రాజెక్టు, హెవీబాయిలర్ ఫాక్టరీ, సర్జికల్ ఇన్‌స్ట్రుమెంట్స్‌ఫాక్టరీ, పేరాచూట్ అండ్ క్లోతింగ్ ఫాక్టరీ, ఆయిల్‌రిఫైనరీ, ఎన్నూరు థర్మల్‌విద్యుత్ కర్మాగారం, మహాబలిపురం దగ్గర అటామిక్ ట్రాన్స్‌ఫార్మర్, సంకల్పిత మద్రాసు హార్బర్ విస్తరణ, ఇవన్నీకాక కేంద్రవు అనేక సంస్థలూ, విదేశీ కాన్సొలేట్స్ మద్రాసులో ఉన్నాయి. మన ఆంధ్రలో సింథటిక్‌డ్రగ్స్, హెవీఎలక్ట్రికల్స్ డిఫెన్స్ మెటలర్జికల్ రీసర్చి లేబొరేటరీ (2 కోట్లు రూ॥లే), ఎలక్ట్రానిక్స్ ఫాక్టరీ, పంచాయతి రాజ్యాలకు స్త్రీల ఎన్నిక, బ్యాంకుల నిర్మాణం, చౌక దుకాణాల ప్రారంభోత్సవం.

ఇవేకావు, ఇటువంటివి అనేకం (పాంబన్ బ్రిడ్జి, గోదావరి వంతెనలపై కృష్ణమాచారి ధోరణి, విదేశాలలోని వారికి రేడియోలో తెలుగు కార్యక్రమాలూ, రైల్వే సౌకర్యాలూ　)పోల్చిచూసి అభివృద్ధి కోసం పాటుపడేవారెందరు అన్నదే ప్రస్తుతపు ప్రశ్న.

అమెరికా, రష్యా, జపాన్, స్విట్జర్లాండ్ మొదలయిన దేశాలలోని అభివృద్ధి పోకడను చూస్తే తప్పక మనమూ సులభంగా అభివృద్ధిచెందవచ్చు నని నా అభిప్రాయం దీనికి నా రాష్ట్రమూ, దేశమూ అభివృద్ధిచెందాలి అన్న ఉద్రేకం ఉంటే ఎంతో బావుంటుంది

విద్యార్థులలో నాగరికమైన చైతన్యం ఎంతేనా అవసరం.

కాంప్రసాద్ (మద్రాసు)★

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 2—4—'65

విశ్వావసునామ సం॥ చైత్రబహుళ శుద్ధ పాడ్యమి

సంపుటము : 57 సంచిక : 31

స్థాపితము :
1908

*

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీధి, మద్రాసు-1

## చందా వివరాలు

ఇండియా రూ. 15.60. ఇతర దేశాలు ఓడమీద (Sea Mail) రూ. 28.60. విమానం ద్వారా (Air Mail) బ్రిటన్, జర్మనీ, ఇతర యూరోప్, ఆఫ్రికా దేశాలు రూ. 120.00. అమెరికా రూ. 176.80. ఆస్ట్రేలియా రూ. 148.20.

విడిప్రతి 30 పై.
సంవత్సర చందా 15.60 పై.
6 మాసాల చందా 7.80 పై.


## విషయానుక్రమణిక

ముఖచిత్ర రచన : శ్రీ బాపు



## మనలో మాట

ఆంధ్ర సచిత్ర వారపత్రిక పాఠకులందరికీ ఉగాది శుభాకాంక్షలు!

* * *

వనితాలోకం వ్యాసరచన పోటీలో మొదటి మూడు బహుమతులూ పొందిన రచయిత్రుల బొమ్మలు ఈ క్రింద చూడవచ్చు. వారి వ్యాసాలు 16 వ పేజీ మొదలు చదువవచ్చు. ముగ్గురు రచయిత్రులూ తమని గురించి వ్రాసుకున్న వాక్యాలు కొన్ని ఇక్కడ ఇస్తున్నాము.



రాపాక అన్నపూర్ణాదేవి



పవని నిర్మల ప్రభావతి



టి. కృష్ణాబాయి

"తీరిక సమయాల్లో చదువుతూనో, వ్రాస్తూనో ఉండటం అంటే ఇష్టం...ఇక జీవిత చరిత్రకి సంబంధించిన విశేషాలు, చెప్పుకోదగిన ఘన కార్యాలుగా ఏమీ లేనందున..." ఆ సంగతులేవీ వ్రాయలేక పోయామంటున్నారు మొదటి బహుమతిపొందిన శ్రీమతి రాపాక అన్నపూర్ణాదేవి.

నెల్లూరుజిల్లా కనిగిరిలో జన్మించి, ఒంగోలులో విద్యాభ్యాసం చేసిన శ్రీమతి పవని నిర్మలప్రభావతిగారిలా వ్రాస్తున్నారు: "గృహిణిగా గృహ బాధ్యతలను నిర్వర్తించుకొంటూ తీరిక వేళల్లో గ్రామీణ అభివృద్ధి కార్యక్రమాలలో మా శ్రీవారితో బాటు పాల్గొంటూ వుంటాను. ఇద్దరు మగ పిల్లలు, ఒక ఆడపిల్ల వున్నారు..." వీరికి రెండవ బహుమతి వచ్చింది.

మూడవ బహుమతి పొందిన శ్రీమతి టి. కృష్ణాబాయిగారు "గృహిణిగా జీవితం గడుపుతూ, స్నేహాలతను పెంచుకొంటూ, ఏర్పరచుకొన్న ఆదర్శాలను కొంత మేరకైనా చేరుకోవటం జీవితధ్యేయం"గా కలిగి వున్నామన్నారు.

* * *

'సినిమాబాలట్' ఫలితాలకి మధ్య పేజీలు చూడాలి! ఆ పేజీలలో బొమ్మలన్నీ శ్రీ గంగాధర్ వేశారు...

* * *

ఇది ప్రత్యేక సంచిక కాబట్టి కొన్ని మామూలు శీర్షికలు, కొన్ని ప్రత్యేక శీర్షికల కోసం తప్పుకోవలసి వచ్చింది...కొత్త 'బాలసాహితి' శీర్షిక 8వ పేజీలో ప్రారంభం అవుతుంది. దానికి సంబంధించిన వివరాలు అక్కడే ప్రచురించాము...

శ్రీమతి భానుమతీరామకృష్ణవ్యాసానికి బొమ్మలు శ్రీ బాపు వేశారు...

* * *

'జ్యోతిశ్శాస్త్రం' ప్రకారం కొత్త సంవత్సరం ఎలా ఉంటుందో 57 పేజీలో ప్రారంభంఅయే మహేష్ వ్యాసం చదివి తెలుసుకోవచ్చు. చోటుచాలక వారఫలం ఈ సంచికలో వెయ్యలేక పోతున్నాము....



నందా గారి చేపల వేట!
— దాని ఫలితాలు
అవినీతి




ప్రధాని కాగల అవకాశం మరొకళ్ళకి పోయింది?
అయినా ఫరవా లేదు ఆశ వదులుకోను
మొరార్జీ ఆత్మ సంఘర్షణ




రెండు రాజ్యాల చేతుల్లో పాకిస్తాన్
అమెరికా
కమ్యూనిజానికి
ఇంపీరియలిజంపై దాడి
చైనా




కేరళ
ఈ యేనుగను మచ్చిక చేసుకోవడమెట్లా?

## న్యూఢిల్లీ లేఖ

# ఢిల్లీ రాజకీయరంగంలో కల్లోలం
# అవిశ్వాస తీర్మానం పేరిట ఆర్భాటం!

శ్రీ శాస్త్రి ప్రభుత్వంపై ప్రతిపక్షాలు అవిశ్వాసాన్ని వెలిబుచ్చటం ఈ వారం ఢిల్లీలోని ప్రధానాంశం. అసలు లోక్‌సభలో దీన్ని కదిపిన వ్యక్తి భావావేశానికి లోను కాలేదు. కాంగ్రెస్ సంఖ్యాబలం దీన్ని నిష్ప్రయోజనం చేస్తుందని కూడా అతను ముందుగా చెప్పాడు. ప్రతిపక్షాలు ప్రభుత్వాన్ని స్థాపించగల స్థితిలో లేవని తన దృఢ నిశ్చయాన్నికూడా తెలియజేశారు. ఈ పరిస్థితి ఒకందుకు మాత్రం పనికొచ్చిందనవచ్చు — ప్రభుత్వం అవలంబిస్తున్న తటస్థ విధానం, ముఖ్యమైన సమస్యల్ని కూడా అపరిష్కృతంగా ఉంచేయటం దేశాన్ని నాశనం చేసే స్థితికి తీసుకొచ్చాయన్న నిజాన్ని తెలియజేసింది. ఒరిస్సా విషయంలో యస్. ఎన్. ద్వివేది సాధించిందేమీలేదు

ప్రభుత్వ పక్షాన మాట్లాడిన శ్రీ చాగ్లా కూడా ఆలోచనా రహితంగానే ప్రవర్తించారనవచ్చు ఆయన వాదనలో ఎంతమాత్రం బలం లేదు తను మాట్లాడిన విషయాన్ని గురించి చెప్తూ ఓ పాయింట్ గెల్చానని చెప్పారు. అదేమంటే 'శ్రీ కామత్ పోయిన ఒక డాక్యుమెంట్‌ని ఆసరాగా తీసుకొని దానివల్ల ప్రయోజనాన్ని పొందాడు. కానీ నిజాయితీగల మనిషిగా అతను దాన్ని తెచ్చిన వ్యక్తిని పోలీసులకి అప్పగించి ఉండొచ్చు గదా' అన్న విషయం

శ్రీ కామత్ స్పీకర్ చెప్పిందాన్ని ఉదహరిస్తూ కీ. శే ఫిరోజ్ గాంధీ కూడా తను పొందిన డాక్యుమెంట్సు ఆర్థిక మంత్రిత్వ శాఖనుంచి ఎలా లభించాయన్న విషయం తెలియబర్చటానికి నిరాకరించారు. కాంగ్రెస్ పార్టీకి రెండు ప్రమాణాలున్నాయనీ, ఒక ప్రమాణం తనకు సంబంధించిన ఫిరోజ్ గాంధీ లాంటి వ్యక్తులకనీ, ప్రతిపక్షాలకు మరొకటనీ శ్రీ కామత్ బహిరంగంగా చెప్పారు ఫిరోజ్ గాంధి విషయంలో అలాంటి అభ్యంతరం రాకపోవడానికి ఆయన నెహ్రూగారి అల్లుడు కావటమేనా? దీంతో చాగ్లా చిక్కబడ్డారు. తనైతే అలాంటి వ్యక్తిని పోలీసులకి అప్పగించే వాణ్నని చెప్పి తప్పించుకున్నారు.

'కాబినెట్' న్యాయ నిర్ణేతల సంఘం కాదన్నది నిర్వివాదం. అందుకనే ప్రతిపక్షం శ్రీ పట్నాయక్, శ్రీ మిత్రాలపై న్యాయ విచారణ జరపమని అడిగింది పట్నాయక్, మిత్రాలు కాబినెట్ సబ్ కమిటీ అభిప్రాయం ప్రకారం నిర్దోషులయితే అది న్యాయ నిర్ణేతలవద్ద వారు నిర్దోషులని రుజువు చేసుకోవచ్చుగదా? కాబినెట్ వాళ్లపైన అనుమానాన్ని ఇంకా ఎక్కువ చేసింది ఇంకో వాళ్ళు వాళ్ల చేతలతో వ్యక్తిగతంగా లాభం పొందలేదని కూడా చెప్పటం ఎంత చక్కగా ఉంది?

ఇదంతా చూస్తుంటే సర్ అబ్దుర్ రహీమ్ గుర్తుకు వస్తున్నారు. ఆయన స్వతంత్రం రాక ముందు కేంద్ర శాసన సభలో ప్రతిపక్ష నాయకుడుగా ఉండేవాడు. ఒట్టావా ప్రాముఖ్యాన్ని వివరిస్తూ, ప్రభుత్వం 'హౌస్'లో వోట్లను కలిగిఉంటే ఉండొచ్చుకానీ దేశం అంతా తన వైపు ఉన్నదని ఆయన అన్నారు.

ఈ పరిస్థితిలో కూడా కాంగ్రెస్‌పార్టీ సంఘీభావంతోలేదు అవిశ్వాసం వెలిబుచ్చిన ఈసందర్భంలో వివాదాలకి తావీయవద్దని, పార్టీని చీలికలుగాచేసే ఈ వివాదాలు ప్రతిపక్షాలకు బాగా అనుకూలిస్తాయని తన పార్టీవారితో ప్రధాని అన్నారు.

* * *

ప్రధాని ఈ వారంలో కొన్ని ముఖ్యమైన విషయాల్ని చెప్పారు. కాంగ్రెసులోని కార్య నిర్వాహకులైన వారు ప్రభుత్వానికి సలహాలిచ్చే పద్ధతిని మానేయాలని గోరఖ్‌పూర్‌లో మాట్లాడుతూ ప్రధాని అన్నారు ఆ సలహా ఇంకా పాటించకుండా అలాగే ఉన్నది కాంగ్రెస్‌వారు ప్రభుత్వంలో జోక్యం కల్గించుకోగూడదన్న నిర్ణయానికి తీసికెళ్ళిందది' రాష్ట్ర ప్రభుత్వాలు కేంద్రంలానే కేబినెట్లను ఏర్పరుచుకోవాలని కూడా ప్రధాని సూచించారు. ఇతర కూటాల్లోని సభ్యులు, తిరుగుబాటుదార్లూ ఈ కేబినెట్‌లో ఉండకూడదని ఆయన చెప్పారు. రాజ్యాంగ ప్రకారం ఇది సరైనదే కానీ త్రిపాఠీవర్గాన్ని కాబినెట్‌లో ప్రతినిధులుగా చేర్చుకోమని ఉత్తరప్రదేశ్ ముఖ్యమంత్రిని, బలవంతం చేయటం జరిగింది ఇది ఆమె ప్రభుత్వంపై దెబ్బ కొట్టటమే కాకుండా అంతకు ముందు ఉన్న సి బి గుప్తాని కూడా దెబ్బకొట్టినట్లయింది ఈ కేబినెట్ కేంద్రంలో తప్ప రాష్ట్రాలలో ఉండటం అనవసరం. అలా ఉంటే అది అతుకుల బొంతే అవుతుందిగానీ కేబినెట్ కాదు.

తెర వెనుక వివాదాలు దేశాన్ని కలుషితం చేశాయని ఢిల్లీలో మాట్లాడుతూ అన్నారు ప్రధాని. లోక్ సభలో కూడ ఆయన అదే విషయాన్ని తిరిగి ప్రస్తావించారు.

రెండో ప్రపంచ యుద్ధంలో బ్రిటీష్ ప్రభుత్వం ఇండియా పత్రికల్ని ప్రజల్లో క్రమ శిక్షణని పెంపొందింపజేయమని కోరింది. జర్మన్లపై విజయమే ప్రజల్లో క్రమశిక్షణని పటిష్ఠం చేయగలదని దానికి సమాధానం వచ్చింది శాస్త్రి గారు కూడా అలాంటిదే అనుసరిస్తే మంచిది తటస్థ విధానం, సమస్యల్ని అపరిష్కృతంగా ఉంచబట్టే శాస్త్రిగారు విశ్వాసాన్ని పోగొట్టుకున్నారు సమస్యలన్నీ పరిష్కరించి చూపాలి ఆయన. ఇంకా ఆయన పై ప్రజల్లో అభిమానం ఉంది, కానీ ఈ తటస్థ విధానాలవల్ల, వేచిచూద్దామనే ఓదార్పుల వల్ల దాన్ని క్రమక్రమంగా కోల్పోతున్నారు.

వ్యాపారస్తులు తమ లాభాలకి ఒక హద్దు పెట్టుకోవాలని శాస్త్రిగారి చివరి సలహా. కాంగ్రెస్‌వారే వారి ధనాశకి, ఒక హద్దు అంటూ ఎందుకు పెట్టుకోగూడదూ! ఈ విషయాన్ని ఆలోచించాలి—ఏ కాంగ్రెసు వ్యక్తయినా తన కార్యాలయాన్ని వదలి తనంతట తానుగా రిటైరవుతున్నాడా? మరణశయ్య మీద ఉన్నా పదవిని వదలటంలేదు గదా!

అసలు మంత్రివర్యులక్రింద ఎంత ఖర్చవుతుందో ఇంతవరకూ తెలియబరచలేదు 1965—66 కి కేబినెట్‌కి కేటాయించబడ్డ మొత్తం రూ. 2,359,400. అందులో జీతం రూ 1,326,000 ఎలవెన్సులు రూ 108,400. ఇవిగాక ఇంకా 925,000 రూపాయలు పర్యటన ఖర్చులట.

ఉపమంత్రులకి, సెక్రటరీలు, ఇతర ఉద్యోగులూ ఉంటారు. వాళ్ళందరికీ ప్రభుత్వం కార్లని ఇస్తుంది ఆ కార్లు మంత్రుల కుటుంబాలకే గాకుండా చుట్టు పక్కలవాళ్లకు కూడా సినిమాలకు వెళ్ళానికి ఉపయోగిస్తున్నాయి. కేంద్ర మంత్రులు, డిప్యూటీ మంత్రులకూ, రాష్ట్రమంత్రులకూ అందమైన ఇళ్ళు ఇవ్వబడ్డాయి. ఫర్నిచరు, ఎయిర్ కండిషనర్సు, రెఫ్రిజిరేటర్లతో సహా. వర్క్సు మంత్రి విద్యుచ్ఛక్తి నీటివాడకంమీద తాము ఒక నియమాన్ని పెట్టామని చెప్పారు అసలు విషయం—మొత్తం ఖర్చు ఎప్పటికీ తగ్గదు ఇన్ని చేస్తున్నా ఒక మీటర్‌కి మూడు మీటరుపెడితే ఏమవుతుంది ట్రంక్‌కాల్స్ ఉండనే ఉన్నాయి ప్రభుత్వం ఖర్చుపైన (తరచుగా కాకపోవచ్చు). ఇక సేవక బృందం ఉచితం.

స్వాతంత్ర్యానికి పూర్వం కార్య నిర్వాహక సభ్యునికి నెలకి 7,000 రూ ఇచ్చేవాళ్ళు. అదైనా ఇన్‌కమ్ టాక్సు లెక్కకు వచ్చేలాగానే అతడు రెండు ఇళ్లకు అద్దె ఇచ్చుకోవాల్సి ఉంటుంది. ఢిల్లీలోనూ, సిమ్లాలోనూ ఉండే ఆ ఇళ్లల్లో అతను తోటల్ని పెంచాల్సిన భారం కూడా ఉంటుంది. దానికి విత్తనాలూ, ఎరువులూ నీటి సరఫరాలకి అతనే తన జీతంలోనించి ఖర్చు పెట్టాలి వీటన్నింటికీతోడు తనతో సమాన హోదాగల బ్రిటీషు ఉద్యోగులకి వాళ్ల గౌరవానికి తగ్గట్లుగా వినోదం కలిగజేయాలి ఆకాలంలో పని చేసిన సర్ మహమ్మద్ షఫీ తాను రిటరయ్యేసరికి లక్ష రూపాయలు అప్పు చేయాల్సి వచ్చింది. తర్వాత దాన్ని తీర్చటానికి ప్రభుత్వం ఆమొత్తాన్ని అప్పుగా ఇచ్చింది.

కాంగ్రెస్ సత్యా హింసలను ధ్యేయంగా పెట్టుకున్న గాంధీగారి సిద్ధాంతాలకు కట్టుబడిఉంది అటువంటప్పుడు కాంగ్రెసు పాలకులు ఖచ్చితమైన కాబినెట్ వ్యయాన్ని తెలియబరచాలి

—శ్రీ కృష్ణ ★




మౌల్వీ నసీరుద్దీన్ పెరట్లో ఆ ఏడాది దోసపాదులు తెగ కాచేయి. ఆయన చాలా సంతోష పడ్డాడు. ఓ బుట్టెడు కాయలు కోసు కెళ్ళి ఆ వూరు ప్రభువు తైమూర్ కి నజరానా ఇచ్చి బహుమానం తెచ్చుకోవాలనుకొన్నాడు. దొడ్డి అంతా తిరిగి మంచి నదరైన కాయలు ఓ బుట్టెడు కోసేడు. వాటిని గాడిద మీద వేసుకొని బయలుదేరేడు.

సరిగ్గా అదే సమయంలో తైమూరు గుఱ్ఱం ఎక్కి అట్టే షికారు వస్తూ మౌల్వీని పలకరించేడు.

"ఏమిటండీ పట్టుకెళుతున్నారు, మౌల్వీగారూ !"

"మా దొడ్లో కాచిన దోస కాయలు తైమూర్ గారికి నజరానాగా పట్టుకెడుతున్నా" అన్నాడు మౌల్వీ.

వేషం పట్టి మౌల్వీ అనేగాని ఆయన ఎవరో తైమూర్ ఎరగడు. ఆయనే తైమూర్ అని మౌల్వీ ఎరుగడు.

తైమూర్ నవ్వేడు.

"ఎందుకండీ, ఈ అనవసరపు చాకిరీ. ముక్కు మొగం ఎరగని వారికి నజరానా యేమిటి? మీరేమన్నా జ్ఞాతులా? అన్నదమ్ములా?"

మౌల్వీ నవ్వేడు.

"ఈ ప్రపంచంలో ఇంతవరకు నేనొక్కరినే మతిభ్రష్టుడి ననుకొంటున్నా. మీరు నాకు తాతలా వున్నారు."

ఆ మాటకి తైమూర్ కి కష్టం అనిపించింది. కాని పైకేమీ తెలియనీయలేదు.

"బాగుంది. నా తలప తిక్కవదనం మీ కెందులో కనిపించింది."

"నేను మౌల్వీ నసీరుద్దీన్ నని మీరు ఎరిగివున్నట్లు లేదు. నేను తైమూర్ లాంటివానికి చాకిరీ చేస్తానని మీ కెందుకనిపించింది ?"

"చాకిరి కాకపోతే నజరానా పట్టుకెళ్ళడం ఎందుకేమిటి ?"

మౌల్వీ తల వూపేడు.

"పట్టుకెడుతున్నా. ఏమన్నా ఇవ్వక పోతాడా అని."

"ఆతడు మీకు ఏదన్నా ఇస్తాడని ఎల్లా అనుకున్నారు?"

"జాగ్రత్తతో ఎటువంటి గాడిదకైనా జీను వేసెయ్యొచ్చు. తైమూర్ ఇంక ఇచ్చేది ఆయన తాత గారి ముల్లె కనుకనా. లోకం సొమ్ము కాని."

తైమూర్ కు తనను గాడిదతో పోల్చినందుకు కోపం వచ్చింది. కా

సరికొత్త బాలసాహితి శీర్షిక ప్రారంభం!

అక్బర్‌కి బీర్బల్ ఎలాగో తైమూర్‌కి నసీరుద్దీన్ అలాగన్న మాట అజర్బయిజాన్ జానపద కథల్లో! మర్యాద రామన్న, బీర్బల్‌ల వలెనే సందర్భోచితంగా ప్రతిభా విశేషాలను వినియోగిస్తూ నలుగురి దృష్టినీ ఆకర్షించి రష్యాలో ప్రసిద్ధుడయ్యాడు ఈ మౌల్వీ. అవే కథలను తేట తెనుగు పదజాలంలో శ్రీ మహీధర నళినిమోహన్ వ్రాశారు. శ్రీ నళినీమోహన్ రష్యాలో ఫిజిక్స్ డాక్టొరేట్ పుచ్చుకున్నారు. ప్రస్తుతం రాకెట్లకి సంబంధించిన పరిశోధనలు జరపటానికి తోడ్పడుతున్నారు. 'బాలసాహితి' క్రింద నసిరుద్దీన్ కథలు కొన్ని వారాలపాటు వరుసగా ప్రచురిస్తాము. ఇది మొదటి కథ.

అనుకొన్నాడు.

"సరే కాని ఆయనే ఏమిస్తారని మీ వూహా."

మౌల్వీ ఆలోచించేడు.

"చెప్పలేను. అదృష్టం బాగుంటే ఓ నూటపదహార్లేనా ఇవ్వరూ?"

తైమూర్ నవ్వేడు.

"మీకు ఆకలి మహా లావులా వుందే."

"దాని సిగ్గోసిరి. అర్ధనూట పదాహార్లేనా ఇవ్వడంటారా?"

"అది మాత్రం ఏం తక్కువా?"

"పోనీ, ఓ పాతికే చాలనుకుంటా."

"ఏమీ ఇవ్వకపోతే..."

"ఇవ్వరూ?"

"ఇవ్వకపోతే..."

"నా నల్లగాడిద తోక వాడి తాత ముత్తాతల గోరీల మీద పెట్టి లేచొస్తా."

తైమూర్ మాట్లాడకుండా ముందుకు గుర్రాన్ని పోనిచ్చాడు. మౌల్వీ ఎదరకి నడిచేడు.

తైమూర్ అడ్డదారిని పట్నం చేరుకున్నాడు. కాస్సేపటికి మౌల్వీ కూడా పట్నం చేరుకున్నాడు. తైమూర్ వేషం మార్చుకున్నాడు. భటులు మౌల్వీని ఆయన ముందరకు తెచ్చేరు. బుట్టలోని పళ్ళకేసి రాజు ఎగాదిగా చూచేడు.

"సరే, ఏమివ్వమంటావు?"

తాను తెచ్చిన నజరానాను సరుకు బేరంగా రాజు చూస్తున్నాడనిపించింది మౌల్వీకి.

"ప్రభువులు చల్లగా వుండాలి, గాని ... నా చేత చెప్పించాలా? ఓ నూటపదహార్లేనా ..."

"అబ్బో! చాలా ఎక్కువ."

"ఎక్కువనుకొంటే అర్ధనూట పదహార్లు..."

"అది మాత్రం మాటలా?"— అన్నాడు తైమూర్.

"ఇప్పటికి మౌల్వీకి అర్థం అయింది. ఇందాక గుర్రం మీద కనిపించినవారు తైమూరే అని తెలుసుకొన్నాడు. శని తన్ను ఇంకా వదలలేదనుకొన్నాడు. అయితే కంగారు పడలేదు.

"పోనీ ఓ పాతిక ఇప్పించండి."

తైమూర్ వేషం తీసేసేడు. మౌల్వీవేపు ఎగతాళిగా చూస్తూ అన్నాడు.

"ఏగాని ఇవ్వను. ఏం చేస్తావేం?"

"ప్రభూ! ఇందాకనే చెప్పేసేను. నేను మౌల్వీ నసీరుద్దీనుని, నసీరుద్దీన్ మాట తప్పడు. మీరు పాతికా ఇవ్వలేరూ. సరే నా నల్లగాడిదనెత్తిని దానితోక పెట్టకా తప్పదు."

ఇందాకా మౌల్వీ తనను మాత్రమే గాడిదతో పోల్చేడు. ఇప్పుడు తన తాత ముత్తాతల్ని కూడా గాడిదల్ని చేస్తున్నాడని తైమూర్‌కి భయం కలిగింది.

మౌల్వీకి నూటపదార్లూ యిచ్చి పంపించేడు. 





# అత్తగారూ - పనివాళ్ళూ

భానుమతీ రామకృష్ణ

ఆరోజు ద్వాదశి అయినందువల్ల మా అత్తగారి
ోజనం త్వరలోనే అయింది ఆమె భోంచేస్తూనే
ంటవాడు తిరువేంగళాచారి భోంచేశాడు వంటింటి
నక ఉన్న వరండాలో భోజనానికి కూర్చున్నాడు
నిపిల్లవాడు గుండుమణి—

వీధిలో ఎవర్‌సిల్వర్ పాత్రల వాడికేక విని మా
త్తగారు వాణ్ణి పిలిపించారు ఘూర్కావాడి
త—వాడి బుట్టలో ఉన్న పాత్రలన్నీ ఒక్కొక్కటే
సి పక్కన పెట్టుకున్నారు, యిది చారుకీ, ఇది
లుసుకీ, యిది పప్పుకీ, యిది పాయసానికీ అంటూ
—చివరికి గోరంత జరీ కూడా లేని ఎలకలుగొట్టిన
ెం పాత మడి చీర ఒకటీ, నావి రెండు మూడు
ాత జాకెట్లూ తెచ్చి వాడి ముఖాన పడేసి ఆ
్రత సామానంతా కావాలన్నారు—వాడు ఒక్క
మస్కారం చేసి బుట్ట సర్దుకోబోయాడు
మిస్తావో తేల్చి చెప్పిందాకా పాత్ర లివ్వనన్నార్స
ా అత్తగారు .... వాడికి ఒళ్ళుమండి బుట్టంతా
తికి ఒక చిన్న స్పూను తీసి "మీ రిచ్చిన గుడ్డ
కి యిదీ ఒచ్చేది" .... అంటూ అలక్ష్యంగా ఆమె
యిందుకు విసిరేశాడు.. ..

మా అత్తగారికి ఒళ్ళు తెలిని కోపం వచ్చింది ..

"ఛా వెధవా ! .... నువ్వుగాకపోతే నీ తలదన్నినవా
ంకోడొస్తాడు.... అసలు నిన్ను పిలవడం నాదే
ుద్ధితక్కువ .... కొవ్వెక్కిన గాడిద ! ఎంత
ొగ్రా నీకు ! .... పిక్షేపంలాంటి గుడ్డలకి ఒక్క
్పూనిస్తావా ! .... ఆ బోడి స్పూను నువ్వే
ంచుకో...వా తక్కర్లా" .... అంటూ వాడి
పాత్రలు సొట్టలు పడేటట్లు విసురుగా వాడి ముందు
నెట్టిపారేశారు

"ఓ, ఓ, ఓ, పెద్దమ్మగారూ . ఆగుడ్డ
లూరకిచ్చినా మా కొద్దుగానీ, పాత్తర్లు కాస్త మెల్లి
గియ్యండి సొట్టలు పడితే మా యజమానారు
కోప్పు . మీ రయ్యే గుడ్డ లిస్తారని తెలిసుంటే
ఒచ్చేవోణ్ణే కాదు . మీతో బేరం కుదర్దులెండి"



రచయిత్రి

అంటూ వాడు బుట్ట సర్దుకుని వెళ్ళిపోయాడు..అ
దింతో ఆ ఎవర్‌సిల్వర్ పాత్రలవాడు మూడోసారి
వచ్చి బేరం కుదరక వెళ్ళడం .... వాడికి సహస్ర
నామం చదువుతూనే మా అత్తగారు ఆ పాత
గుడ్డలు మూటగట్టారు—యిప్పటికి అవే గుడ్డలు
కనీసం యాభైసార్లయినా మూటకట్టి ఉంటారు..
ఇంతవరకూ ఏ ఎవర్‌సిల్వర్‌వాడూ ఆ గుడ్డలు తీసు
కుని పాత్ర లిచ్చిన పాపాన పోలేదు ....

నాకా గుడ్డలమూటంటే ఒళ్ళుమంట ....

"పోనీ పనిమనిషి చీరల్లేవని బాధపడుతోంది
ఆ గుడ్డలు దానికిస్తే ఒదిలిపోతుందిగా!" అంటూ
ో చిన్న సలహా యిచ్చాను మా అత్తగారికి ....

"ఇంకా నయం ! నిక్షేపంలాంటి నా మడి పట్టు
చీరానూ, దుక్కల్లాంటి నీ జాకెట్లూనూ తీసు
కెళ్ళి పనిదాని కిమ్మంటావా ! .. నీకేమైనా మతి
పోయిందా ?.. "అంటూ మందలించారు నన్ను

"పోనీ ఆ గుడ్డలతోబాటు నా పాత పట్టుచీరలు
బాగా జరీ ఉన్నవి వేసి మనకావలసిన పాత్రలు
తీసుకోగూడదూ !...." అంటూ మరో సలహా
యిచ్చాను

"అమ్మ ! .. బంగారంముద్దలాంటి నీ జల్తారు
చీరలు యీ ముష్టిపాత్రల కిస్తానంటావా ! "
చాల్లే, వూరుకో . ఎవరన్నా వింటే నవ్విపోతారు .
జరీ అంతగా చిరుగు పట్టినప్పుడు జల్తారు
కరిగించి ఏ వెండి గ్లాసులో, చెంబో చేయిస్తాను ..
అంటూ ఆ పాత గుడ్డలమూట 'స్టోర్' రూములో
ఉన్న బీరువాలో భద్రంగా దాచడానికి వెళ్ళారు.

* * *

"పెద్దమ్మగారూ, పెద్దమ్మగారూ" అంటూ
హడావిడిగా పరుగెత్తుకొచ్చాడు వంటవాడు
వెంగళాచారి ..

ఆతని వెనకాలే పనివాడు గుండుమణి విసురుగా
వచ్చాడు ...

"ఓ రూపాయుంటే పారెయ్యండమ్మగారూ ..
హోటల్లోనన్నా తినొస్తాను . రోజూ ఈ ఎదవ
తిండి తిన్లేక చస్తున్నా "అన్నాడు.

"చూశారా ! చూశారా ! వెధవ తిండట ....
అన్నం పరబ్రహ్మ స్వరూపం అన్నారు ... తినే
కంచాన్ని నేలకేసి కొట్టవచ్చా ! . ఎంత అపచారం !
ఎంత అపచారం !.. ." అంటూ వాపోయాడు వంట
వాడు !....

"చాల్లేవయ్యా పెద్దమనిషి మాడిపోయిన
పప్పు తెచ్చి నా మొకాన గొట్టి తినమంటే ఎట్ట
తినేది !.. పైగా మాడు కంపుతోనన్నా తినొచ్చు
గాని, ఆ మాడువాసన రాకుండా ఉంటానికి ఏదొ
సెంటు బోశాడమ్మగారూ . . బాబోయ్ యిం
ఆ కంపు ఏం చెప్పమంటారు . డోకొచ్చిందనుకోం
ఆ సెంటు వాసనకి . అయినా ఒంటి కేసుకునే
సెంటు ఒంటకాల్లో వేసుకుంటారండీ ఎవురన్నా !..'

"హరిహరీ! . అది సెంటుగాదు ! ... పన్నీరు—
పన్నీరు బోశాను లక్షణంగా . "

"ఆ, లక్షణంగానే ఉందా కంపు .."

"అంతే, అంతే .... నీ కది కంపుగానే ఉంటుంది,
వూరికే అన్నారా'.. .'పంది బురద మెచ్చు పన్నీరు
మెచ్చునా'.... అని."

"యిదుగో వంటాయనా ! మాటలు జాగర్తగ



రానీ ఏమన్నావ్ ! నేను పందినా". అంటూ గుండుమణి గుడ్లెర్రజేశాడు . వంటవాడు నిలువునా ఒణికిపోతూ మా అత్తగారి కోసం లోపలికి పరుగెత్తాడు యింట్లో మావారు గానీ, మావాడుగానీ, సాధారణంగా భోంచేయరు. మా అత్తగారి సూపర్ విషన్ లో జరిగే వంట సరిగా ఉండదని మావారు ఆఫీసుకు దగ్గిరగా ఉన్న ఉడ్‌లాండ్స్ హోటల్నుంచి భోజనం తెప్పించుకుంటారు మావాడు పగలు హాస్టల్లో భోంచేస్తుంటాడు రాత్రిళ్లు ఇద్దరూ భోంచేయరు గనుక ఫలహారం గూడా బయట్నే ముగించుకొస్తారు యిక నేను అన్నం తింటే ఒళ్లొస్తుందనే భయంతో గుండుమణి చేసే విజిటబుల్ సూపుతోనూ, చపాతీలతోనూ, కాసిని మజ్జిగ తాగి కాలక్షేపం చేస్తుంటాను— అందువల్ల వంటవాడు కేవలం మా అత్తగారి మడి వంట మాత్రం చేస్తుంటాడు అది పనివాళ్ల పాల బడుతోంది

"ఏమిట్రా మహ నీలుగుతున్నావ్ ! ఏమిటీ నీ ఆగడం! నీ తిండిని గురించి కూడా రాద్ధాంతము చేస్తున్నావా ! మే పెట్టే దది తింటే తిను, లేకపోతే ఫో. " అంటూ మా అత్తగారు వంటవాణ్ణి వెనకేసుకొచ్చారు .

"పోతానమ్మా యీ తిండి దింటూ ఎవరుంటారు !. యీ తిండి కుక్కలు గూడా తినవ్ "

"ఆ ! ఆ ! తలపొగరు వెధవా ! ఏమన్నావ్ !— కుక్కలు కూడా తినవా ! అయితే మేమంతా ఎవరని నీ ఉద్దేశం ! "

"మిమ్మల్ని నే నన్లేదమ్మగారూ మాట వామెతకి జెప్పాను రోజూ తినేయన్ని మాడుస్తూ ఉంటే ఎట్టా తినేది ! "

"నేను తింటంలేదట్రా ! అయినా వాడు రావాలని మాడుస్తున్నాడా ఏమన్నానా ! . ఆపనికీ యీపనికీ అటూ యిటూ తిరగటంలో అడుగంటుకున్నాయి .. ఆమాత్రానికే అన్నం నేలకేసి కొడ్తావా ! "

"అన్నంగాదమ్మా !.. పప్పు పన్నీరు పప్పు "

"ఏంరా ! ఏమైంది పన్నీరు పప్పుకి !.. లక్షణంగా ఘుమఘుమ లాడుతోంది ."

నాకు ఫక్కున నవ్వొచ్చింది ఆపుకున్నా.

"ఆ గమగమే మరి . శెంటు పప్పు గదూ! "

"శెంటుపప్పో, శెనగపప్పో నీకు ధొరికేదది ... తింటే తిను, పోతే ఫో ...." అన్నారు ఖచ్చితంగా మా అత్తగారు

"అట్టాగే నే తిన్లేను. పోతా .... అంటూ గుండుమణి బయల్దేరాడు ....నా గుండెల్లో రాయిపడ్డది... వాడు వెళ్లిపోతే నా తిండి సంగతి అట్లా ఉంచి మావారికీ, మా వాడికీ కోపం వస్తుంది .. .ఇంట్లో ఉన్న కాసేపూ వాళ్లిద్దరి పన్లకూ వాడు ప్రతిక్షణం అవసరమే వాడు లేకపోతే యింట్లో పైపన్లకు యిబ్బందిపడాలి . అందువల్ల నేను కలగజేసుకోక తప్పలేదు—"

"అది కాదత్తా! మాడిన పప్పులో పన్నీర్పొయ్యడమేమిటి ఇది నే నెక్కడా విన్లేదే! ..." అన్నాను.

"అయ్యో ఆ మాడువాసన రాకుండా ఉంటానికేనే ..నేనే జెప్పాను వాడికి కాస్త పన్నీరు పొయ్యమని లేకపోతే వాడి కా తెలివితేటలు గూ ా ఏడ్చాయి నా చిన్నప్పుడు మా ఇంట్లో వీడి అబ్బేగా వంట జేసేవాడు! . . అతనూ ఇంతే . ఒట్టి చాదస్తుడు .. రోజూ అన్నమో పప్పో అడుగంటిస్తుండేవాడు , ఇక ఇట్లాగాదని మా నాయనమ్మ అతనికో ఉపాయం జెప్పింది—అడుగంటిన పప్పులో కాస్త పన్నీరు వెయ్యమని . . ఇక పన్నీరుపప్పంటూ పిల్లలం పప్పంతాతి నేసేవాళ్లం.. ఇంకా అప్పటికీ వెధవ పుట్టలా " అని మా అత్తగారు చెప్తుంటే చేతులు నులుపుకుంటూ వినయంగా తలవంచుకున్నాడు వెంగళాచారి వాళ్ల నాయనమ్మ అడుగుజాడల్లో నడిచే మా అత్తగారు వెంగళాచారి ఏం మాడ్చినా ఎందుకు వెనకేసుకొస్తున్నారో నా కప్పుడర్థమైంది ఒకప్పుడు వెంగళాచారి తండ్రి మా అత్తగారింట్లో వంట జేశాడు . అదీ ఆమె అభిమానానికి ముఖ్యకారణం

మావాడు కాలేజీనుండి వచ్చేశాడు వస్తూనే "నాయనమ్మా" అంటూ పిల్చాడు

"మా నాయనగదరా, నా తండ్రిగదరా . వస్తూనే నన్నే పిలుస్తాడు నా దేవుడు ...." అంటూ మా అత్తగారు సంతోషపడిపోతూ మా అందర్నీమర్చిపోయి మనవడి నడుంచుట్టూ చెయ్యేసి నడిపించుకుంటూ మేడమీది కెళ్లారు ఆమె పైకెళ్లగానే పనివాడు గుండుమణికి ఒక రూపాయిచ్చి హోటల్లో భోంచేసి రమ్మని పంపించాను

మా అత్తగారు సంబరపడిపోతూ కిందికి దిగొచ్చారు

"ఏమేవ్ నా మనవడికి రేపు లీవట ఇంట్లో భోంచేస్తానన్నాడు రేపు వాడికి బాదంకీరు కావాలట "

'ఒరేయ్ వెంగళం అబ్బాయికి రేపు ఘట్టిగా బాదంకీరట చెయ్యి ' అంటూ వంటవాడితో చెప్పారు ఒక క్షణం వంటవాడు అయోమయంగా మా అత్తగారివేపు చూసి,

"చిత్తం చిత్తం ఆలాగే అంతకంటేనా! తప్పకుండా అబ్బాయిగారు ఇంట్లో భోంచేస్తానంటమే ఒక విశేషం" .అంటూ తిరువేంగళం సంతోషపడిపోయాడు ..

బాదంకీరు చెయ్యమన్నాడేగాని మర్నాడు మా వాడు ఎవరిదో ఫ్రెండ్ బర్త్ డే అంటూ భోజనానికి వెళ్లాడు

ప్రొద్దుటే గుడికెళ్లి భోజనాల టైముకు మనవడొస్తాడని ఎంతో ఆత్రుతగా ఇంటికొచ్చి మా అత్తగారు మనవడు ఎవరో ఫ్రెండింట్లో భోజనానికి ఆగిపొయ్యాడని విని కాస్త నిస్పృహ జెందారు.... .

"ఇలాంటి వాడెందు కడగాలి బాదంకీరు చెయ్యమని మహ తినేట్టు! . . .అయినా వాళ్లిద్దరూ ఏనాడు ఇంట్లో భోంచేశారు గనక......పోనీ నువ్వన్నా ఈరోజు ఒక ముద్ద తినవే"......అంటూ నన్ను బలవంతం జేశారు.. విధిలేక ఆమెతోబాటు నేనూ భోజనానికి కూర్చున్నాను.

తిరువెంగళం వడ్డించడం మొదలెట్టాడు. పప్పు బాగానేఉంది బీన్సువేపుడుమాత్రం మాడిపోయి బొగ్గుల్లా కనిపించాయి . ..పులుసులో వేసిన వంకాయ ముక్కలు బాగా అడుగంటాయి... చారు ఏదో ఆయుర్వేదం మందు వాసనొచ్చింది. ఇక పచ్చళ్లు మా అత్తగారు చేసినవే గనక వాటి వాసన చిరపరిచితమే.. ...

చివర్లో సెగలూ, పొగలూ కక్కుతున్న గిన్నె ఒకటితెచ్చి మా ముందు పెట్టి గిన్నె మీధున్న మూత తీశాడు

గుప్పున ఉల్లి, వెల్లుల్లి, ఇంగువ, మసాలా, పన్నీరు వగైరా అన్నీ కలిపిన నానా దివ్య పరిమళ గంధా ు ముక్కులు బద్దలయ్యేటట్లొచ్చింది.




"ఛీ ఛీ అప్రాచ్యుడా—ఏమిట్రా ఈ ఖర్మం! అంటూ మా అత్తగారు ముక్కులు మూసుకుని కంచం దగ్గిర్నుంచి చివాల్న లేచారు . .వంటవాడు ఆపాదమస్తకం వణికిపోయాడు

"తమరు క్రీరు చెయ్యమన్నారు .." ఫక్కున నవ్వేశాను

"క్రీరేమిట్రా!"

"అదే అదే బాదముక్రీరు ..."

మా అత్తగారు కూడా నవ్వాపుకున్నారు

"నీ క్రీరు మండిపోను ఇదేం క్రీరా! . . మసాలా కంపు కొట్టుకుంటూ ఇదట్రా నిన్ను చెయ్యమన్నది! లక్షణంగా తియ్యగా పాయసంలా ఉండాల్సిన బాదంకీర్ను ఈ గతి పట్టించావేంరా! అసలు ఇది నువ్వు జేశావా లేక ఆ మసాలా వెధవ మణి జేశాడా! ".

వంటవాడికి ముచ్చెమటలు పోశాయి

"ఎంతమాట! ఎంతమాట! ..వాడు చెయ్యలేదు . ఎట్లా చేయాలో అడిగి తెలుసుకున్నాను. . అంతే "

"ఓరి ర్రాష్టం! వాడి నడిగి తెలుసుకున్నావా!

49 వ పేజీ చూడండి

# OR WO

# ఆర్ వో
# రోల్ ఫిల్మ్
## కలర్ మరియు బ్లాక్ అండ్ వైట్

సులభమైనది: ఆర వో కలర్ ఫిల్మ్‌తో ఫొటోలు తీయడం బ్లాక్ అండ్ వైట్ వలె చాల సులభమైనది.

40 ఏండ్ల నుండి మీరు వాడుతూ వచ్చిన యీ ఫిల్మ్ ఇప్పుడు 'ఆర్ వో' అను కొత్త పేరుతో విక్రయింపబడుచున్నది.

55 ఏండ్ల అనుభవము గల వేబ్ ఫిల్మ్‌ఫాబ్రిక్ వుల్ ఫన్ వారు తయారుచేసినది.




**VEB FILMFABRIK WOLFEN**
German Democratic Republic

ఆర్ వో ఫిల్మ్స్ ఈస్టర్న్ యూనిట్
మద్రాసు-2 కలకత్తా-13

SGS/3/65

# వేదకాలం నుంచి
# ...యి విధాలుగా మారిన ఉగాది

## ...రుమల రామచంద్ర

...జనవరితోనే కొత్తసంవత్సరం ఎందుకు ప్రారంభం ...వాలి?" అని ప్రశ్నించాడట ...మన్‌కవి ఓవిడ్ జ్యోతి ...వుడైన జానుస్‌ను. "జన... నెలలో సూర్యుడు మకర ...శిలో ప్రవేశిస్తాడు. అంతవరకు ...ంచు ముసుగులో ఉన్న ...కృతి ఆ ముసుగును తొల...ించుకొని తొంగిచూస్తుంది. ...తన జీవితం జనవరినుంచే ...ారంభమౌతుంది. కనుక దాని...నే నూతన సంవత్సర ...ారంభం." అని జానుస్ ...ాబు చెప్పాడట.

జానుస్‌ను ప్రశ్నించినట్టే మన ...వత్సరాది కూడ చైత్రమాసం ...నే ఎందుకు మొదలు కావాలని ...వరైనా ప్రశ్నించే ఉంటారు. ...నికి హేమాద్రి పండితుడు:

"చైత్రే మాసి జగత్ బ్రహ్మ
సనర్జ ప్రథమేహాని,
శుక్లపక్షే సమగ్రంతు
తదా సూర్యోదయే సతి."

"చైత్రశుద్ధ పాడ్యమినాడు ...ార్యోదయ సమయంలో బ్రహ్మ ... జగత్తును సంపూర్ణంగా సృజిం...ాడు" అని సమాధానం చెప్పాడు. ...ానివసంఘు క్రమ వికాసానికి ...ర్కాణాలనదగిన ఉగాది ...ంటి పండుగలను, పర్వాలను ...హ్మసృష్టితో ముడిపెట్టడం ఏమి...ి మనకు శంక కలుగవచ్చు.

హేమాద్రి వసంత ఋతువును దృష్టిలో పెట్టుకొనే ఈ సమాధానం చెప్పి ఉంటాడని మనం గ్రహించాలి.

ఆకసంలో మిల మిలలాడే చందమామ తరుగు పెరుగుదలతో మానవజాతి కాల జ్ఞానం ప్రారంభమయింది. చంద్రుడు నిండుగా ఉన్న పూర్ణిమ నుంచి మరొక పూర్ణిమ వరకు నెల అని కొందరు లెక్కగట్టారు. మరికొందరు చంద్రుడు కించిత్తయినా కనిపించని అమావాస్యనుంచి అమావాస్య వరకు నెల అని లెక్క గట్టారు. ఆ రెండు పద్ధతులూ మన దేశంలో ఆచారంలో ఉండేవి. వింధ్యకు ఇవతలి ప్రాంతంలో శుక్లపక్ష పాడ్యమితోను, అవతలి ప్రాంతంలో కృష్ణపక్ష పాడ్యమితోను నెల ప్రారంభమని వ్యవహరించే వారట. ఈ విషయాన్ని నిర్ణయ సింధుకారుడు విపులంగా చర్చించాడు. చంద్రుని వృద్ధి క్రమాన్నిబట్టి నెల లెక్కగట్టడం సులభం గనుక శుక్లాది మాసమే క్రమంగా అలవాటయిపోయిందని మనం భావించవచ్చును. ఏమైనా ఈ నెల వింగడింపు ప్రపంచమంతటా చంద్రునితోనే జరిగిందని మాసః, మూన్, నెల, తింగళ్ వంటి పదాలు సూచిస్తున్నప్పుడు ఆశ్చర్యం కలుగుతుంది.

చంద్రుని గతిని, చంద్రమార్గంలో సన్నిహితంగాఉండే ప్రధాన నక్షత్రాలను, చంద్రుడు ఆ నక్షత్రాలను సమీపించడంతో ప్రకృతిలో, తన పరిసరాలలో కలుగుతున్న మార్పును మానవుడు పరిశీలించాడు నక్షత్రమండలాలకు ఏవో పేర్లు పెట్టుకొని, ఆ మండలాలలో చంద్రుడు పూర్ణిమనాడు ప్రవేశించినప్పుడు ఆ యా నెలలకు ఆ నక్షత్రాల పేర్లు పెట్టారు. దినాలు లెక్కగట్టి, నెలలు నిర్ణయించుకొన్నట్టే, ప్రకృతి విలాసాన్నిబట్టి ఋతువులు, ఋతు పర్యాయాన్నిబట్టి సంవత్సరాలు లెక్కగట్టుకున్నాడు.

కాని, చంద్రగతికి, సూర్యగతికి పొత్తు కుదరక పోయింది చంద్రునిబట్టి చేసిన మాస పరిగణన పేరుకుమాత్రమే ఉండిపోయి, ఋతువులకు అతకకపోయింది. అప్పుడు విషువత్తునుబట్టి సమన్వయం చేయవలసి వచ్చింది. విషువత్తు అంటే, సమరాత్రిందివ కాలం—పగలు రాత్రి సమానంగా—ఉండేకాలం వసంత ఋతువుతో ప్రకృతిలో నూతన రామణీయకం ఏర్పడుతుంది గనుక అప్పటినుండి నూతన సంవత్సరం అనుకుంటే వసంత విషువత్తు వచ్చిన నెలనుంచి నూతన సంవత్సరమని, విషువత్తు వచ్చిననాడు వర్షాది అని అనుకున్నారు. ఈ విషువత్తు కూడ మారడంవల్ల సంవత్సరాది కూడ మారుతూ, వివిధ ఋతు...లలో వస్తున్నట్టు నిదర్శనాలున్నాయి.

వేదాంగ జ్యోతిష కాలంలో ధనిష్ఠాకార్తె... ప్రారంభమైన శిశిర ఋతువుతో సంవత్సర... ఆరంభమయ్యేది. అంటే మాఘ పూర్ణిమనుం... రెండు నెలలతో మొదటి ఋతువు, సంవత్సరారంభ... కృత్తికా నక్షత్రంతో వసంత విషువత్తు వ... దని ఐతరేయ బ్రాహ్మణంలో ఉంది. కొ... ఋక్కుల కాలంలో పునర్వసు, మృగశీర్షలు మొద... నక్షత్రాలు. తైత్తిరీయ సంహితా బ్రాహ్మ...

## ఉగాదివేళ

### దిట్టకవి శ్రీరంగనాథాచార్యులు

ఉగాదివేళ నా మదిలో
మధురభావన లుప్పొంగెను
కన్నుల పండువుగా ప్రకృతి
నూత్న కాంతుల వెదజల్లెను.

క్రొంజిగురుల సింగారముతో
రంజిల్లెను భూరుహములు
శోభిల్లెను నవవధువు వోలె
పుష్పలతానికుంజములు.

ఋతురాజు వసంతు గాంచి
వనసుందరి పరవశించె
కొసరి కొసరి కోయిలమ్మ
మధురగీతి నాలపించె.

ప్రతి హృదయమ్మొకసుమమై
ఆనందామృతము నిండెను
మధురప్రేమ రాగమిళిత
మై మనమ్ము మత్తిల్లెను.

ఈ వసంత శుభదినమ్ము
నవ వర్షమ్మునకు ఆది
నవజీవన రాగమధువును
వర్షించునదీ ఉగాది!

కాలంలో కృత్తికా రోహిణులు. రామాయణ కాలంలో భరణి. చైత్రం పన్నెండవ నెల.

"తతశ్చ ద్వాదశే మాసే,
చైత్రే నావమికే తిథౌ." (బాల)

పదకొండు నెలలు గడచి పన్నెండవ నెల అయిన చైత్రమాసంలో శుద్ధ నవమినాడు రామజననం. మార్గశిర పుష్య మాసాలున్న హేమంతంతో వత్సరారంభమని కాత్యుని మతం. అమరసింహుడు మార్గశిర పుష్య మాసాలను మొదటి ఋతువని అన్నాడు. మార్గశిర మాసాన్ని ఆగ్రహాయణికః అని అన్నాడు. సంవత్సరమంతా ముందు ఉండేది, సంవత్సరం అగ్రంలో ఉండేది అన్నమాట. భారత కాలంలో చైత్రమాసం మొదటి నెల "మధుశ్చ మాధవశ్చ వాసంత కావృత్" అని వసంత ఋతువుతోనే సంవత్సరారంభమని యజుర్వేద సంహిత ఉద్ఘోషిస్తున్నది. ఈవిధంగా సంవత్సరాది ఆశ్వీజామావాస్య, కార్తీక పూర్ణిమ, మార్గశిర పుష్యమాసాలలో సంక్రాంతి, మాఘ పూర్ణిమ, శివరాత్రి, ఫాల్గుణ పూర్ణిమ, హోలీపండుగ, వసంతపంచమి, చైత్రశుద్ధ పాడ్యమి, వైశాఖి, వైశాఖ పూర్ణిమ ఇలా మారుతూ వచ్చింది.

విషువత్తులు మారుతూ ఉండడం వరాహ మిహిరుడు బృహత్సంహితలో తెలిపాడు.

"ఆశ్లేషార్ధాత్ దక్షిణం
ఉత్తర మయనం తథా ధనిష్ఠాద్యం,
నూనం కదాచి దాసీత్
యేనోక్తం పూర్వ శాస్త్రేషు.
సాంప్రతం అయనం సవితుః
కర్కటకాద్యం మృగాదిత శ్చాన్యత్"

# వేదకాలంనుంచి...

ఈ పద్ధతినిబట్టే వరాహ మిహిరుడు తనకు కొన్ని శతాబ్దాలకు ముందే వసంత విషువత్తు మృగశిరనుంచి అశ్విని ప్రథమ పాదానికి రావడం గుర్తించాడు. అంతకుముందున్న మార్పులను పరిశీలించాడు. తన కాలంలో వసంత విషువత్కాలం అశ్విన్యాదిలో సంభవించడంవల్ల ఆనాటినుంచి దేవమానదినం—ఉత్తరాయణం ప్రారంభం కావడం ప్రాచీన సంప్రదాయం గనుక, అదే వసంతకాల ప్రారంభంగాను, ఆనాడే సంవత్సర ప్రారంభంగాను నిర్ణయించి మాస ఋతు సమన్వయం చేశాడు. శ్రీపత్యాచార్యుడు మేషమాసం — చైత్రమాసం నుంచే దేవతలకు దినం, తులనుంచి రాత్రి కనుక చైత్రంనుంచే నవ వర్షారంభమని అన్నాడు.

"దిన ప్రవృత్తిః మారుతాం అజాదౌ
తులాధరా దౌచ నిశా ప్రవృత్తిః"

కనుక వసంత విషువత్కాలం వచ్చే నెల వసంత ఋతు ప్రారంభం అన్నప్పుడు చైత్రమాసంతో ప్రారంభమన్నమాట. కాని, మనం ధర్మ సింధు కారుడు అన్నట్టు శుక్ల ప్రతిపదాదినుంచి అమావాస్యతో ముగిసే కాలాన్ని నెలగా పరిగణిస్తున్నాము గనుక ఆ పాడ్యమినే సంవత్సరాదిగా పెట్టుకున్నాము. నాటినుంచి నేటివరకు చైత్ర శుద్ధ పాడ్యమే ఉగాది పండుగ అనే ఆచారం ఏర్పడింది.

వరాహ మిహిరుడు వసంత విషువత్తునుబట్టి ఋతు సామరస్యం సాధించెనేమో సాధించాడు గాని అప్పటినుంచి వసంత విషువత్తు 23 డిగ్రీలు వెనక్కువచ్చి నేడు ఉత్తరాభాద్ర రెండవ పాదంలో పడుతున్నది దానివల్ల రెండు నెలలకుముందే మాఘమాసంలోనే వసంత ఋతువు ఆరంభమవుతున్నది శింశుమార చక్రం ఏడాదికి 50¼ వికలల పాటు వెనక్కు తిరుగుతుంది కనుక సూర్య చక్రం 360 డిగ్రీలు తిరగడానికి 50 వికలలు శేషం ఉండగానే వసంత విషువత్కాలం సంభవిస్తున్నది. ఇలా 72 సంవత్సరాలకు ఒక డిగ్రీ ప్రకారం వెనక్కు వచ్చింది గనుక మనం నేడు దానిని సంస్కరించుకోవలసిన అవసరం ఉంది. (ఇది విషయాంతరం)

చాంద్రమాసమే వేదకాలంనుంచి ఆచరణలో ఉన్నట్టు తోస్తుంది సౌరమానం వ్యవహారంలో ఉన్న ప్రాంతాలలోను వైదిక కర్మలకు చాంద్రమానాన్ని అనుసరించడమే దీని ప్రాచీనతకు ప్రమాణం. అగ్ని పూజకులైన పార్సీలు ఎప్పుడో మననుంచి విడిపోయినవారు వారి సంవత్సరాది నౌరోజ్. అది కూడా వసంత మాసంలో మన ఉగాది దరిదాపులలోనే రావడం కూడ చంద్రమానం ప్రాచీనతకు నిదర్శనం.

చాంద్రమానాన్ని అనుసరిస్తున్న తెలుగు కన్నడ మహారాష్ట్ర మాళవాది ప్రాంతాల వారందరూ చైత్ర శుద్ధ ప్రతిపత్తునే సంవత్సరాదిగా పరిగణిస్తారు సౌరమానాన్ని అనుసరిస్తున్న వంగ, పంజాబు, సింధు, అస్సాం, తమిళ, కేరళులు మేష విషువత్తును సంవత్సరాదిగా పరిగణిస్తారు. గుజరాతీ, మార్వాడీ మున్నగు కొందరికి బార్హస్పత్యమానం అనుసరించి దీపావళి అమావాస్య సంవత్సరాది.

సంవత్సరాదికి ఉగాది అనే మాట విడ్డూరంగా ఉంది కదూ! యుగమంటే కాలం. కాల ప్రారంభం యుగాది ఇలాటి యుగాదులు కొన్ని ఉన్నట్టు భారతం "యుగాదయ శ్చ కధ్యంతే తద్వైతా స్సర్వ సూరిభిః" అని కొన్నిటిని పేర్కొంటున్నది. కనుక సంవత్సర కాలారంభాన్ని కూడ మనపెద్దలు యుగాది అన్నారు. మన పొరుగు కన్నడులు నేటికీ సంవత్సరాదిని యుగాది అని యకారాది గానే ఉచ్చరిస్తారు. తెనుగు వారికి యడాగమాది వ్యాకరణ కార్యాలవల్ల అకారేకారాది పదాలను యకార యేకారాది పదాలుగా ఉచ్చరించే సంప్రదాయం ఉన్నా, యుగాది అనే సంస్కృతపదం

## ఉగాది సంరంభం!

ఎటుచూచిన పచ్చ తోరణాలు
ఎల్లెడల ముచ్చటాభరణాలు
ముచ్చట గొలిపే ముగ్గులు
నవ్య వధూ సింగార సిగ్గులు
ఉగాది పచ్చడి రుచిలో
గోచరించె జీవిత సత్యం
సంస్మరణీయం నిత్యం
నైరాశ్యమే తొలగిపోయె
చైతన్యమే నాట్యమాడె
మరపించె బాధలు
వినిపించె బోధలు
నేటి ఉగాది విశిష్టత
భావి జీవితాని కెనలేని పటిష్ఠత
శోభావృత ఉగాది లలామకి
స్వాగతం! ఘనస్వాగతం!!

—డి. ఉదయ భాస్కరరావు.

# ఉగాది పచ్చడి

మల్లెపువ్వులాంటి తెల్లని శుభ్రమైన వేప పువ్వును తెచ్చి పళ్లెంలో పోసి బాగా నలపాలి. అలా చేసినప్పుడు పూవు తొడిమలన్నీ విడిపోయి పూరేకులు విడివడతాయి. చేటలో పోసి ఆ తొడిమలు, రేకులువిడిఅయ్యేలాగా చెరగాలి. గుప్పెడు శుభ్రమైన రేకుల్ని తీసి విడిగా పెట్టుకోవాలి.

శుభ్రంగా ఉన్న కొత్త చింతపండు ఆరు తులాలు తీసుకుని నీళ్లలో నానపెట్టి చిక్కటి గుజ్జు తీయాలి. ఈ గుజ్జులో ఈనెలూ, గింజలూ, రాకుండాచూచుకోవాలి. బెల్లం తొమ్మిదితులాలు (ఇదీ కొత్తగా శుభ్రంగా ఉంటే బాగుంటుంది.) తీసుకొని మెత్తగా పొడి చేసి చింతపండు గుజ్జులో కలపాలి. విడిగా పెట్టుకున్న వేప పువ్వుని దీంట్లో కలపాలి. తరువాత ఓ చిటికెడు ఉప్పును కూడా మెత్తగా నూరి కలపాలి. బాగా, పండిన అరటిపండ్లు రెండూ పచ్చి మామిడికాయ ఒకటి చెక్కు తీసి చిన్నచిన్న ముక్కలుగా కోసి తయారైన పచ్చడిలో వేసి బాగా కలపాలి. ఇది వెంటనే తినకూడదు. ఓ పావుగంట దాన్ని కదలకుండా ఉంచితేగాని అసలు రుచిరాదు. ఆ తర్వాత దాన్ని తింటే ఎంతో రుచిగా ఉంటుంది. ★

# స్త్రీజనోద్ధరణకి శాసనాలు ఎంతవరకు తోడ్పడగలవు?

రాపాక అన్నపూర్ణాదేవి

## మొదటి బహుమతి వ్యాసం

ప్రాచీనకాలంలో స్త్రీలకు సంఘంలో ఎంతో గౌరవనీయమైన స్థానం ఉండేది. గృహిణిగా, మాతగా, గురువుగా శాస్త్రవేత్తగా, సలహాదారుగా బహువిధములైన క్లిష్ట కార్యనిర్వహణా భారాన్ని వహిస్తూ సమాజంలో పురుషులతో బాటు సమాన ప్రతిపత్తిలో ఉండేవారు.

ధర్మశాస్త్రాలలోను, న్యాయ శాస్త్రాలలోను కూడ సముచితంగా స్త్రీల అధికారాలు నిర్వచించబడి వారి వ్యక్తిత్వానికి రక్షణలు కల్పింపబడ్డాయి. వేదవేదాంగాలలోను, మనుస్మృతిలోను ఇందుకు అనుకూలంగా అనేక ఆధారాలున్నాయి. అయితే ఈనాడు స్త్రీలు అసమర్థులుగా, వ్యక్తిత్వ రహితులుగా, జ్ఞానహీనులుగా చూడబడటానికి కారణం ఏమిటి ? ప్రతి రంగంలోనూ వెనకబడి దిగజారి పోవటానికి కారణం ఎవరు ? ఈ ప్రశ్నకు సాధారణంగా పురుషులనుండి వచ్చే జవాబేమిటో తెలుసా ?

"స్త్రీలు అర్భకురాండ్రు, ప్రకృతిలోనే సహజంగా వారు పురుషుని ఛాయలో జీవించాలని నిర్ణయింపబడింది. అందుకు వారి సౌకుమార్యం, అంగసౌష్ఠవం వగైరా వగైరా రుజువు" అని అంటారు. ఇది శుద్ధ అబద్ధమని వారికీ తెలుసు. పురుషులతో సమంగా ఎండనక, వాననక చేలల్లో కాయకష్టం చేసే వనితలు లేరా ? ఓర్పు, విశ్చలత ప్రధానంగా కావలసిన వృత్తులలోను, ఫ్యాక్టరీలల్లోను స్త్రీల ఆవశ్యకత, ఆధిక్యత లేదా ? ఈనాడు ఆఫీసుల్లో పనిచేయగల్గే అమ్మాయిలు ఏవిధంగా అబ్బాయిలకు తీసికట్టు ? ఇక విదేశాలల్లో ట్రక్కు డ్రైవర్ల దగ్గరనుండి అంతరిక్షం అంతు కనుక్కునే సాహసవతుల వరకూ ఉన్నారు కదా. కాబట్టి శారీరకంగా కాని, మానసికంగా కాని స్త్రీలు పనికిరానివారంటే చెల్లుతుందా ? అయితే స్త్రీలకు ఈనాటి దుస్థితి ఎలా వచ్చింది అని ఆలోచిస్తే అనేక కారణాలు కనబడుతాయి. ముఖ్యంగా స్త్రీల స్థానం గృహమే అనే విచిత్రమైన భ్రమ వారికి కల్పించారు. క్రమేపి బయటి సమాజంలోంచి వారిని తొలగించివేశారు. కూపస్థమండూకాల్లాగాను, విద్యావిహీనులుగాను తయారైన స్త్రీలు ప్రజ్ఞావంతులుగా రాణించలేకపోయారు. అదే క్రమేపి వారి పతనానికి, దుస్థితికీ దారితీసింది.

అయితే ఈ పరిస్థితి నుండి స్త్రీలను శాసనాలు ఎంతవరకు విముక్తి కల్గించగలవు అన్నది గట్టి ప్రశ్న. సంఘ క్షేమం దృష్ట్యా మనలో అధిక సంఖ్యాకుల అభిప్రాయానుగుణంగా ప్రతి ఒక్కరు పాటించటానికిగాను ఏర్పరచుకొన్న నిబంధనలే శాసనాలు. శారదా ఆక్టు, వరకట్న నిషేధం బిల్లు మొదలైనవి ఈలాంటివే. ముందు స్త్రీలకు అనుకూలంగా శాసనాలు రావాలంటే వారి భావాలు, కష్టసుఖాలు విపులంగా చెప్పుకోగలిగి ఉండాలి. వాటిపై అధిక సంఖ్యాకుల అభిప్రాయం ఒకటై ఉండాలి. అవన్నీ సేకరించాలి. శాసన సభల్లో వాటిపై చెలరేగే దుమారానికి సమాధానాలు చెప్పగల్గే సమర్థులుండాలి. అప్పుడు అవి శాసనాలు అవటానికి అర్హమైనట్లు అవుతుంది. అంటే ముందు స్త్రీలకు సాంఘిక, రాజకీయ పరిజ్ఞానం అవసరం అన్నమాట. భారతావనిలో ఉన్న షుమారు 22,00,00,000 మంది స్త్రీలలో ఎంతమంది అక్షరాస్యులు ? ఎంతమంది ఇందుకు సమర్థులు ? మన ఆంధ్రదేశంలో షుమారు 1,78,21,776 స్త్రీలు ఉంటే శాసనసభలో వారి ప్రాతినిధ్యం 20 లోపుగా ఉంది. కాని 1,81,61,671 పురుషులుంటే వారి ప్రాతినిధ్యం 350 కి పైగా ఉంది అలాంటప్పుడు స్త్రీల కొరకై ప్రత్యేకంగా శాసనాలు ఎలా తయారౌతాయి ? దేశంలో స్త్రీల సంఖ్య పురుషులకంటె షుమారు 1,00,00,000 తక్కువకాని పార్లమెంటులో స్త్రీల కంటె పురుషులు షుమారు 15 రెట్లు ఎక్కువ. ఇక అక్కడ తయారయ్యే శాసనాలు ఎంతవరకు స్త్రీల అభ్యుదయానికి తోడ్పడగలవో ఆలోచించండి.

మరో విషయ మేమంటే శాసనాలు తయారు చేయగానే కాదు. అవి అక్షరాల అమలు జరగాలి. అమలుజరగేటట్లు ప్రతివారు బాధ్యతగా చూచిన నాడే వాటి సత్ఫలితం దక్కుతుంది. లేకుంటే అవి "కళ్ల నీళ్లు తుడవటానికి" అనిపిస్తుంది ఉదాహరణకు శారదా బిల్లు గాని వరకట్న నిషేధం బిల్లుగాని తీసికోండి. శారదా ఆక్టు వచ్చినా గాని తెలిసి కూడా రహస్యంగా పసిపిల్లల పెండ్లిళ్లు చేసిన ఘరానా పెద్దలు ఎందరు లేరు ? ఈనాడు వరకట్న నిషేధానికి అనుకూలంగా అవకాశం దొరికినప్పుడల్లా వూకదంపుడు ఉపన్యాసాలు చెబుతూ మరోకవైపు లక్షలు కట్నంగా గ్రుమ్మరించుకుంటున్న అవకాశవాదు లెందరో !. కాబట్టి అందరి మనస్సుల్లో మార్పు రావాలి గాని కేవలం శాసనాలు ఏదో చేస్తాయి మన అభ్యుదయానికి అనుకోవటం పొరపాటు.

సంఘంలో వ్యక్తులందరు ఏకగ్రీవంగా మార్పు కాంక్షిస్తే అది వచ్చి తీరుతుంది. ఉదాహరణకు స్వరాజ్య సంపాదన విషయం చూడండి. స్వాతంత్ర్యాభిలాష ప్రతి మనిషిలోనూ ఒక అతీతమైన శక్తిగా పనిచేసింది. దాని అంతరాయానికి ఆంగ్ల ప్రభుత్వం ఎన్ని ఆటంకాల్ని శాసన రూపేణా గాని మరేవిధంగా గాని కల్పించినప్పటికీ వెల్లువలా ఉవ్వెత్తున లేచిన ప్రజావాంఛ నాపలేక పోయింది కదా ! అలాగే సమాజ శ్రేయస్సుకు స్త్రీలు కూడా పురుషులతోబాటు సమాన భాగస్వాములు, వారి సౌభాగ్యమే సమాజ సౌభాగ్యం అని మనం నిరూపించగల్గితే స్త్రీ జనాభ్యుదయానికి ఎవరూ ఎట్టి ఆటంకమూ కలుగజేయలేరు.

అలాగని శాసనాలు పూర్తిగా ప్రయోజనరహితాలనటం కాదు నా ఉద్దేశ్యం శాసనాల ప్రయోజనం పూర్తిగా మనం ఆస్వాదించాలంటే అందుకు మనలో ఇంకా చాల మార్పు అవసరం. ఆ మార్పు వచ్చిననాడు నిజంగా శాసనాలవల్ల మేలు చేకూరే అవకాశం లేకపోలేదు. ముఖ్యంగా మనలో నిరక్షరాస్యత నిర్మూలించబడాలి. దేశ కాల పరిస్థితులు ఏవిధంగా మారుతున్నాయో ప్రతివారు గుర్తించగల్గి ఉండాలి. విద్యా జ్ఞాన సముపార్జనకు స్త్రీలకు కూడ ప్రతి యింట ప్రోత్సాహం లభించాలి. వయోజన విద్యా ప్రణాళికల ద్వారా పెద్దలు కూడ విద్యావంతులు కావాలి. ఇది మొదటి మెట్టు స్త్రీల అభ్యుదయానికి ఆ తరువాత మన సాధక బాధకాలు చర్చించి పరిష్కరించుకొనే తాహత్తు వస్తుంది మన ఆశయాలకు ఒక విలువ ఏర్పడుతుంది. శక్తి, నైపుణ్యము పెరుగుతుంది. నిజమైన సమాజాభ్యుదయము రావాలంటే స్త్రీ జనాభ్యుదయం ముఖ్యమని అప్పుడు నిరూపించవచ్చు. అందువలన ప్రస్తుత పరిస్థితులలో శాసనాలు అంతగా మనకు తోడ్పడవని నా నమ్మకం. ★

మాత్రం ఎప్పుడో, ఎందువల్లనో ఉగాది అని అజాది పదంగానే రూఢమయింది.

ఉగాదినాటి సంబరాలు అందరికీ తెలిసినవే కాబట్టి ప్రత్యేకంగా వ్రాయ నక్కరలేదు కాని, ఆనాటి ఉగాది పచ్చడిని గురించిమాత్రం రెండు మాటలు చెప్పాలి నూతన సంవత్సరం సుఖ దుఃఖ మిశ్రమమని సూచించడానికే ఉగాది పచ్చడి భక్షించే ఆచారమయిందని భావించకూడదు ఆ యా ఋతువులలో పండే పంటను, ఫలాలను తమకు వాటిని అనుగ్రహించిన విశ్వస్రష్టకు నివేదించి, ఇష్ట బంధుమిత్రులతోపాటు ఆరగించడం మన సంప్రదాయం వసంత ఋతువులో పండిన వాటిని కూడా ఈవిధంగానే ఆరగించడం ఆరంభమైౖ, తర్వాత దానికి ఆధ్యాత్మికత కూడా తోడయి, సంప్రదాయమయి ఉంటుంది ధర్మ శాస్త్ర గ్రంథకారులు నింబ కుసుమ భక్షణం మొదలయిన విధులు సంప్రదాయానుసారంగా విధించారు. ★

మనదేశానికి స్వాతంత్ర్యం రాకముందున్న స్త్రీల సమస్యలు వేరు. స్వాతంత్ర్యానంతరం, అంటే ఈనాడున్న స్త్రీసమస్యలు వేరు. ఎలా అయితేనేం స్త్రీ జనోద్ధరణ ఇంకా జరగవలసే వుంది.

"స్త్రీ జనోద్ధరణకు శాసనాలెంత వరకూ ఉపకరిస్తాయి?" అని చర్చించేముందు "శాసనం" అంటేఏమిటి? అనేది తెలుసుకోవాలి. ప్రజల ఇష్టాయిష్టాలతో (సాధారణంగా) నిమిత్తంలేకుండా, ప్రభుత్వం అమలుజరపాలని సూచించే చట్టమే "శాసనం" అంటే ప్రజలహృదయంలో పరివర్తన తెచ్చి, తద్వారా సమస్యా పరిష్కారం చేయాలని చూచే పద్ధతి "సంస్కరణ" అంటారు.

మనదేశ చరిత్ర ఒక్కసారి పునరావృతం చేసుకుంటే గత సంఘటన లెన్నో స్ఫురిస్తాయి బ్రిటిష్ వారు మనదేశాన్ని పరిపాలించే రోజుల్లో సతీసహగమనం, బాల్యవివాహాల్లూ, విపరీతంగా వుండేవి సతీసహగమనాన్ని అరికట్టి, ఆనాటి స్త్రీల ఆ సమస్యను పరిష్కారం చెయ్యాలనే సత్సంకల్పంతో రాజారామమోహనరాయ్ ఎంతగానో కృషిచేశాడు. కానీ అతడి వుపన్యాసాలద్వారా ప్రజలలో కించిత్తు మార్పు రాలేదు! అదే సమయంలో మనదేశానికి గవర్నరుగావున్న బెంటింగ్ ప్రభువు, సతీసహగమన దురాచారాన్ని చట్టం ద్వారా అరికట్టగలిగాడు. శాసనోల్లంఘన చేస్తే శిక్షింప బడగలరనే భయంతో మాత్రమే మొదటా దురాచారం కొంత రూపు మాసింది. ఆ తర్వాత మెల్లిగా ప్రజలలోనే కొంత పరివర్తన కలిగింది.

బాల్యవివాహాల విషయంలో అట్లాకాదు. కందుకూరి వీరేశలింగంపంతులు మొదలైనవారి బోధలు, ప్రహసనాలూ, ఉపన్యాసాల ద్వారా ప్రజలలో చైతన్యం వచ్చింది అందుకు "శారదా బిల్లు" జోడు కావటంతో బాల్యవివాహాల సమస్య అంతమయింది. నేటి స్త్రీ సమస్యలే వేరు అందులో మొదటిది వరకట్న సమస్య దీనిని పరిష్కరించటానికి ప్రభుత్వం శాసనం కూడా చేసింది మద్యనిషేధచట్టంలానే ఇదికూడా లోపాయికారీ వ్యవహారంగా మాత్రమే తయారయ్యింది. కానీ, ఆశించిన ఫలితాలు కలుగలేదు కట్నాలిచ్చుకునేవారూ, పుచ్చుకునే వారూ కూడా కొల్లలుగా వున్నారు అలాటి వివాహాలకు వెళ్లొస్తున్న పెద్దలుకూడా "మనకెందుకొచ్చినగొడవ!" అనుకొని, ప్రభుత్వశాసనం వుందని తెలిసీకూడా, రిపోర్టు ఇవ్వక, ఎవరిమానాన వారు వెళ్తున్నారు. ఈ సమస్యవిషయంలో ప్రభుత్వ శాసనం ఏలాటి మార్పును తేలేదు రాదుకూడాను యువతీ యువకులలో నైతిక విలువలు పెంపొందిననాడు కానీ ఈసమస్యను పరిష్కారం జరుగదు.

ఈనాడు స్త్రీ ఎదుర్కొంటున్న మరోసమస్య అధికసంతానం. ఒకవేపు కుటుంబ నియంత్రణం అమలు జరపవలసిందిగా కోరుతూ, ఆకాశవాణి, పత్రికలు, ఎందరోపెద్దలూకూడా అదే పనిగా చెబుతున్నారు. కానీ ఫలితం ఎక్కువగా కన్పించటం లేదు. నిజానికి అధికసంతానం వల్ల ఎక్కువగా బాధలు పడ్తున్నది స్త్రీలే! నవమాసాలూ మోసి కనటం, ప్రసవసంబంధమైన అనేకబాధలు, ఆ తర్వాత పిల్లల అనారోగ్యాలూ, వాళ్ళపోషణ, ఆర్థిక ఇబ్బందులూ, వగైరాలన్నీ స్త్రీలను క్రుంగదీసినంతగా పురుషులకు పట్టవు. కానీ తమాషా ఏమిటంటే, ఆ స్త్రీలే అలా బాధలు పడటానికైనా అంగీకరిస్తున్నారు కానీ కుటుంబ నియంత్రణం అమలు జరపటానికి ఒప్పుకోవటంలేదు. ఇదికేవలం స్త్రీలసమస్య గానేగాక, దేశానిక్కూడా ముఖ్యమైన సమస్యగా పరిణామం చెందబోతుందికూడా! ఇలాటప్పుడు ఉపన్యాసాలూ, నాటికలూ, ప్రచారం వగైరాల వల్ల ఏమీ లాభంలేదు. ముగ్గురు, లేక నలుగురు బిడ్డలతర్వాత తప్పనిసరిగా గృహస్తో, గృహిణో (ఇద్దరిలో ఎవరోఒకరు)ఆపరేషన్ చేయించుకోవాలని, అలా చెయ్యని వారు శిక్షార్హులనీ, ప్రభుత్వం శాసనం చెయ్యాలి. ఆ శాసనం అమలు జరిగేలా కట్టుదిట్టం చెయ్యాలికూడాను అట్లా శాసనం చేస్తే, షుమారు ఒకదశాబ్దం తర్వాతేనా జనాభాసమస్యేగాక, అధికసంతానపు బాధనుండికూడా స్త్రీలు కొంత విముక్తి పొందుతారు!

ఇక పెద్ద ఫ్యాక్టరీలలోనూ, కర్మాగారాలలోనూ పనిచేస్తున్న స్త్రీలకు అనారోగ్య సమయాలలోనూ ప్రసవ సమయాలలోనూ పూర్తి జీతం అందేలా ప్రభుత్వ శాసనం అంటూ ఒకటి వస్తే, అలాటి స్త్రీల సమస్య కొంత మెరుగు కాగలదు.

ఈనాడు స్త్రీలను వేధిస్తున్న మరో సమస్య పతిత జనోద్ధరణ ! ఏ కారణంచేతనో కాలుజారిన స్త్రీలు ఇక అదే వృత్తిలో, నీచంగా, చీకటిలో బ్రతకవలసి వస్తోంది. అలాటివారికి కేవలం సంఘంలో పురుగులలా కాకుండా మనుష్యులుగా బ్రతకటానికి అవకాశం ప్రభుత్వం కల్పించాలి. ఇందు క్కూడా శాసనం అవసరం.

స్త్రీలకు విద్యా సౌకర్యాలు, విడాకులూ, ఆస్తి హక్కులూ వగైరా ఎన్నో సమస్యలలో ప్రభుత్వ శాసనమే స్త్రీ జనోదరణకు తోడ్పడిందని స్పష్టంగా చెప్పవచ్చు.

మొదట్లో ప్రభుత్వ శాసనాలు కేవలం నిరుపయోగమైనవిగా కన్పించినప్పటికీ, కొన్ని సమస్యల విషయంలో ప్రభుత్వ శాసనాలే పరిష్కార మార్గ మౌతాయి ఆదినుంచీ స్త్రీ జనోద్ధరణకు ప్రభుత్వ శాసనాలే ఉపకరిస్తున్నాయి ఈనాడు అయినా, మరేనాటికయినా, ప్రభుత్వ శాసనమంటూ లేనిది స్త్రీ జనోద్ధరణ జరగదు ★



# మహాదేవ బహుమతి వ్యాసం

టి. కృష్ణాబాయి

**సమాజం సమస్యలమయం. దారిద్ర్యం, నిరుద్యోగం దేశంలో తాండవమాడుతున్నాయి. వీటిని సక్రమంగా పరిష్కరించాలంటే పారిశ్రామికపురోభివృద్ధి సాధించాలి.**

సామ్యవాద తరహా సమాజాన్ని నిర్మించి ఆర్థిక అసమానతను తొలగించడానికి మన ప్రభుత్వం కంకణం కట్టుకుంది. పారిశ్రామిక పురోభివృద్ధిని సాధించి నిరుద్యోగాన్ని నిర్మూలించాలని పంచవర్ష ప్రణాళికను అమలు జరుపుతోంది. ఇలాంటి ఆర్థిక రాజకీయ సమస్యలను శాసనాల ద్వారా ప్రభుత్వం మాత్రమే పరిష్కరించ గలదు. కాని మనను కలవరపెట్టే సాంఘిక సమస్య లెన్నో ఉన్నాయి. ఉదాహరణకు అంటరానితనాన్ని తీసుకుందాం. ఇది ఒక సాంఘిక దురాచారం దీనిని పరిష్కరించడానికి చట్టం ఒకటే చాలదు. ప్రజల తోడ్పాటు గూడ అవసరం. ఆంగ్లేయ ప్రభుత్వం శాసనాల ద్వారా హరిజనులను ఉద్ధరించడానికి తన శాయశక్తులా ప్రయత్నించింది. కాని కృతకృత్యం కాలేకపోయింది కమ్యూనల్ జి ఓ ల లాంటివి హరిజనులకు విద్యా సదుపాయాలు కల్పించాయేగాని అంటరానితనాన్ని నిర్మూలించలేకపోయాయి ఇలాంటి దురన్యాయాలను తొలగించాలంటే ప్రజలలో భావ చైతన్యం కలిగించాలి ఆనాటి ప్రభుత్వం శాసనాల ద్వారా చేయలేని పనిని గాంధిగారు తన హరిజనోద్యమం ద్వారా సాధించారు. ప్రజలలో జాగృతి కలిగించారు.

అలాగే స్త్రీ స్వాతంత్ర్యం, సమానత్వంలాంటి సాంఘిక సమస్యలు సంతృప్తికరంగా పరిష్కారం కావాలంటే ప్రజల దృక్పథంలోనే పూర్తిగా మార్పు రావాలి. సంఘంలో భావ విప్లవం రావాలి శాసనాలు కొంత మేరకు ఉపకరించినా ఇలాంటి సాంఘిక సమస్యా పరిష్కారానికి సామాజిక చైతన్యమే తోడ్పడుతుంది అసలు స్త్రీ స్వాతంత్ర్యం, సమానత్వం అనే సమస్యలు ఏనాటివి? అనాది నుండి ఇలాగే ఉన్నాయా? వాటిని గురించిన మంచి చెడ్డ లేమిటి? జరిగిన మార్పులకు శాసనాలెంతవరకు ఉపకరించాయి? ఈ విషయాలు పరిశీలిద్దాం.

మానవులలో రెండే రెండు జాతులు—స్త్రీలు, పురుషులు. ఆదిమ కాలంలో స్త్రీ ప్రాధాన్యత ఎక్కువగా ఉండి మాతృస్వామిక వ్యవస్థ అమలులో ఉండేది. స్త్రీ నాయకురాలిగాఉండి తన దళాన్ని ముందుకు నడిపేది. తన పరివారానికి రక్షణ కల్పించేది క్రమంగా గణ పరిషత్తులాంటి సమితులు ఏర్పడ్డాయి. వాటి సలహాలను తీసుకుంటూ పరిపాలన సాగించింది స్త్రీ. నిదానంగా పురుష ప్రాబల్యం, సొంత ఆస్తి ఏర్పడ్డాయి. "న స్త్రీ స్వాతంత్ర్య మర్హతి" అనే పాడుకాలం దాపురించింది. "స్త్రీ స్వాతంత్ర్యానికి అనర్హురాలు" అన్న మనువే "స్త్రీలను పూజిస్తేనే దేవతలు మెచ్చుతార"ని కూడా అన్నాడు ఈ రెంటికీ ఎక్కడ పొందిక? తన కుటుంబానికి, పరివారానికి తానే రాణి అయిన స్త్రీ సంఘానికి ఎలా బానిసయిందో తల్చుకుంటేనే ఆశ్చర్యంగా ఉంటుంది.

మధ్య యుగాలనుంచి స్త్రీ అధోగతి మొదలయింది. సొంత ఆస్తితోపాటు స్త్రీని అధీనం చేసుకున్నారు. ఆస్తి హక్కులు లేకుండా చేసి 'అబల' అని ముద్ర వేశారు. పుట్టిన దగ్గర నుండి పెండ్లయేవరకు తండ్రి అధీనంలోనూ, తరువాత భర్త కనుసన్నలలోనూ, ముసలితనంలో కుమారుని పోషణలోనూ ఉండాలని శాసించారు. ఇలాగ దశల వారీగా స్త్రీని బంధించేశారు. స్త్రీకి ప్రత్యేక నిబంధనలు, సూత్రాలు తయారు చేశారు. పతియే ప్రత్యక్ష దైవంగా భావించుకుని అణకువగా ఉండాలని పాతివ్రత్య ధర్మాలు బోధించారు. మగవాని అంతులేని దురాచారాలను అరికట్టే ప్రయత్నాలయినా చేయలేదు. పైగా స్త్రీలోని అందాన్ని, మార్దవాన్ని ఆసరాగా తీసుకుని ఆట బొమ్మలుగా తయారు చేశారు. ప్రకృతి ధర్మం పేరిట స్త్రీని ఎందుకూ పనికి రాకుండాచేసి, విలాస వస్తువుగా వాడుకున్నారు. కాంతా కనకాలను ఒకే మూసలో పోశారు. కనకంలాగే కాంత కూడా జడ పదార్థమేనని భావించారంటే స్త్రీకి ఎంత విలువ ఇచ్చారో బోధపడుతుంది అందుకే

"స్త్రీ వంట ఇంటికై చేతనంబైనదో
స్త్రీ దాస్య వృత్తికై సృష్టించబడినదో
స్త్రీ విలాసమునకై సృష్టించబడినదో
చెప్పవే మాయమ్మ చెప్పవే తల్లీ!"

అని ప్రబోధించవలసిన అవసరం ఏర్పడింది. వరాహ మిహిరుడులాంటి పండితుడు "స్త్రీ విషయంలో ఆచరించని దోషమేదైనా ఉన్నదా?" అని ప్రశ్నించాడు.

నవీన యుగంలో అంటే 19 వ శతాబ్దం నుంచి స్త్రీని గురించిన ఆలోచనలో, దృక్పథంలో మార్పు వచ్చింది. ఒక రకమైన చైతన్యం అవతరించి, అంధయుగం అంతరించింది.

సహగమనమనే సాంఘిక దురాచారాన్ని తల్చుకుంటేనే ఒళ్ళు జలదరిస్తుంది. భర్త చనిపోగానే భార్యనుకూడా శ్మశానానికి తీసుకువెళ్ళి శవంతో పాటు మంటల్లోకి తోసేసేవారు. సజీవంగా అగ్నికి ఆహుతి కావడం నాటి స్త్రీల దౌర్భాగ్యం, దేశ అనాగరికతకు చిహ్నం. రాజారామమోహనరాయ్ లాంటి మహనీయులు ప్రజలను చైతన్యవంతం చేయడానికి పూనుకున్నారు. కాని ఒక్క ఏడాదిలో 600 సహగమనాలు జరిగాయి. లార్డ్ బెంటింగ్ 1829 లో సహగమన నిషేధ శాసనం చేసిన తరువాతనే ఆ దురాచారం రూపు మాసింది

కాని వితంతు వివాహంలాంటి సంస్కరణలకు శాసనాలు ఎక్కువగా ఉపకరించవు. ప్రజల ఆలోచనలో మార్పు రావాలి. 1856 లో హిందూ వితంతు వివాహాల శాసనం ప్రకటించబడింది కాని 1860 నాటికి రెండుకోట్ల యాభై నాలుగులక్షల తొంభైఆరువేల వయసు మీరని వితంతువులు దేశంలో మిగిలి ఉన్నారంటే తరతరాలుగా వస్తూన్న ఆచారాలను, శాసనాలు మాన్పలేవనిపిస్తుంది ఆదర్శనీయమైన వ్యక్తులు, సంస్కర్తలు అవిరళ కృషి చేస్తేనేగాని ఈ రకమైన దురాచారా లడుగంటవు.

ఆనాటి స్త్రీల దురవస్థలను గురజాడ తన రచనల్లో కళ్ళకు కట్టినట్టు చూపించారు. 'కన్యాశుల్కం'కథాకాలంనాటికి విజయనగరం ప్రాంతాల్లోని బాల్య వివాహాల పట్టిక చూడండి

| | | | | | |
|---|---|---|---|---|---|
| 5 | సంllలవయసులో | పెండ్లయిన | బాలికలు | 99 | మంది |
| 4 | ,, | ,, | ,, | 44 | ,, |
| 3 | ,, | ,, | ,, | 36 | ,, |
| 2 | ,, | ,, | ,, | 6 | ,, |
| 1 | ,, | ,, | ,, | ముగ్గురు | |

అంతటి దారుణమైన పరిస్థితుల్లో 'శారదా బిల్లు' పాసయింది. బాల్య వివాహాలు ఆ శాసనం ద్వారా నిషేధించబడ్డాయి. శాసనం ముందుగా వచ్చింది కాని ప్రజలలో చైతన్యంలేని కారణంగా ఆచరణలో చాలాకాలంవరకు శాసనోల్లంఘన జరుగుతూనే ఉండేది ప్రభుత్వానికి తెలిస్తే శిక్షిస్తుందనే భయంతో దాపులోనేవున్న ఫ్రెంచి వలస ప్రాంతాలకువెళ్ళి ఈడేరని ఆడపిల్లలకు పెళ్ళిళ్ళు చేస్తుండేవారు 1873 లో శారదా బిల్లు పాసయితే, 1935 వరకు గూడ చెదురు మదురుగా బాల్య వివాహాలు జరుగుతూనే ఉండేవి. కందుకూరి వీరేశలింగంలాంటి మహా పురుషులు సంస్థల వలె కట్టుదిట్టంగా కృషిచేసి, శాసనం పూర్తిగా సాధించలేని దానిని, ప్రజలలో జాగృతి కలిగించడం ద్వారా సాధించారు. ఆ తరువాత కాంగ్రెస్, కమ్యూనిస్ట్ సంస్థలు, కొందరు మహనీయ వ్యక్తులు వితంతు వివాహాలు చేయించి స్త్రీలకు జరుగుతూన్న అన్యాయాలను కొంతవరకు అరికట్టారు.

ఈవిధంగా కొన్ని సాంఘిక దురాచారాలకు శాసనం గొడ్డలి పెట్టుగా ఉపకరిస్తే, మరికొన్నిటిని సమూలంగా పెరికి వేయడానికి వ్యక్తులు, సంస్థలు, ఉద్యమాలు తోడ్పడటం జరిగింది.

కాని సాంఘిక చైతన్యమూ, సిరిసంపదలు ఉండి కూడా కొన్ని నిర్దిష్టమైన విషయాలలో



SHB7/NG8-82 TEL.

# నిజమైన స్నేహితునివలె... నేషనల్ అండ్ గ్రిండ్లేస్ బ్యాంక్‌లో సేవింగ్స్ అక్కౌంట్

సేవింగ్స్ బ్యాంక్ అక్కౌంట్ ప్రారంభించుకొనే విషయమై మీరు దిగులుపడుతున్నారా? మీరు దాచుకొనే డబ్బు చాలా చిన్న మొత్తాలని, వాటిని అంగీకరించరని బాధ పడుతున్నారా?

నేషనల్ అండ్ గ్రిండ్లేస్ మీకు సముచిత సలహానిచ్చి, సకల సహాయం చేయగలదని మీకే రూఢి కాగలదు. ఖాతా ప్రారంభించడానికి మీకు కావలసిందల్లా రు. 5/-లు మాత్రమే.

కనుక ఇప్పుడే మీ సమీపంలోగల బ్యాంకి బ్రాంచికి వెళ్లండి. మా బ్యాంకిలో మీరు సేవింగ్స్ అక్కౌంట్ ప్రారంభించుకుంటే అది నిజమైన స్నేహితునివలె మీకెలా అక్కరకు రాగలదో చూడండి.

మీరు కట్టే డిపాజిట్ ఎంత చిన్న మొత్తమైనాసరే, నేషనల్ & గ్రిండ్లేస్ మిమ్ము పెద్దతహారగా చూస్తుంది.



## నేషనల్ అండ్ గ్రిండ్లేస్ బ్యాంక్ లిమిటెడ్

(యునైటెడ్ కింగ్‌డమ్‌లో ఇన్‌కార్పొరేట్ చేయబడింది. మెంబర్ల బాధ్యత పరిమితం)

బ్రాంచిలు: మద్రాసు: 3, నార్త్ బీచ్ రోడ్: 378, నేతాజీ సుభాష్ చంద్రబోస్ రోడ్డు, (లాయిడ్స్ బ్రాంచి); 6, అర్మీనియన్ స్ట్రీట్: 158, మౌంట్ రోడ్డు. హైదరాబాద్. అబీద్ రోడ్.

అసోసియేటెడ్ బ్యాంకులు: లాయిడ్స్ బ్యాంక్ లిమిటెడ్ • నేషనల్ ప్రావిన్షియల్ బ్యాంక్ లిమిటెడ్.

వెనుకబడి ఉంటాయి కొన్ని దేశాలు. ఆర్థికంగాను, వైజ్ఞానికంగాను, పారిశ్రామికంగాను ఎంతో అభివృద్ధి గాంచిన పాశ్చాత్య దేశాలలో వాటికి తగినంతగా స్త్రీల పురోభివృద్ధి జరగలేదు. వాస్తవాన్ని గమనిస్తే తప్ప ఈ వాదాన్ని నమ్మలేకపోవచ్చు. స్విట్జర్లాండు ఆదర్శ ప్రజాస్వామిక దేశంగా ప్రపంచంలో పేరెన్నిక గన్నది. కాని అక్కడ ఈనాటికి కూడా స్త్రీకి వోటు హక్కు లేదంటే చాలా వింతగా ఉంటుంది ఆ రకంగాచూస్తే మన దేశం చాలా ముందడుగు వేసిందనే చెప్పాలి. అన్ని విధాలా మెరుగుగావున్న స్విట్జర్లాండులో ఆ ఒక్క సమస్య గురించి పట్టించుకున్నవారు లేరా? లేక నవనాగరిక సమాజంలో కూడ స్త్రీని చిన్నచూపే చూస్తారా?' చైతన్యవంతమైన దేశంలో కూడ ఆ ప్రత్యేకమైన వోటు హక్కు సమస్యపట్ల ప్రజల్లో చైతన్యం కలిగించి శాసనం ప్రవేశ పెట్టేలా చేయాలి. ప్రజా స్వామికంగా, పారిశ్రామికంగా కూడ మనకన్న ముందున్న బ్రిటన్‌కంటె మనమే స్త్రీల విషయంలో చైతన్యవంతులమై ఉన్నాం. రెండువందల ఏళ్ళనాడు అమెరికా స్వాతంత్ర్య సమరంలో ప్రముఖ పాత్ర వహించిన స్త్రీలకు వోటు హక్కు వచ్చినది అరవై ఏళ్ళనాడు మాత్రమేనంటే నమ్మగలమా? కాని రష్యాలో స్త్రీల విషయంలో సమగ్రమైన మార్పులొచ్చాయనీ, జీవితరంగంలో పురుషునితోపాటు స్త్రీ సర్వ సమానత్వం అనుభవిస్తోందనీ, దేశ పురోభివృద్ధికి పురుషునితోపాటు అన్ని రంగాలలోనూ స్త్రీ పాల్గొంటుందనీ, చూసి వచ్చిన వారు చెబుతున్నారు. కాబట్టి శాసనాలేగాక కొన్ని ప్రత్యేక సమస్యలపట్ల ప్రజా దృక్పథంలో మార్పు రావాలి.

ప్రస్తుతం ప్రతి మధ్య తరగతి కుటుంబాన్ని తీవ్రంగా కలతపెట్టేది ఆడపిల్లల పెళ్ళి సమస్య. సాహసించి చదువు చెప్పించినా, కట్నం లేనిదే పెళ్ళికాదు. అటు చదువుకీ, ఇటు కట్నానికి కూడ ఖర్చు పెట్టగల తాహతులేని వారేమి చేయాలి? కట్నాల తాకిడికి తట్టుకోలేక ఎన్నో కుటుంబాలు చితికిపోతున్నాయి. ఈ దురాచారాన్ని మాన్పించాలని సంస్కర్తలు నడుంకట్టారు యువకులు కొందరు మార్గదర్శకు లయారు. ఇటీవలనే వరకట్న నిషేధం బిల్లు పాసయింది. కాని విద్యావంతులైన

# వనితాలోకం
# పోటీవ్యాసం

యువకుల్లో గూడ "ఎంత ఎక్కువ కట్నం పుచ్చుకుంటే అంత గొప్ప" అనే భావం మాసిపోనంతవరకు ఈ అరిష్టం తొలగదు. వరకట్నం వద్దని, వ్యక్తికి గౌరవమిచ్చి, వివాహమాడగల సంస్కారం యువతరంలో ప్రబలాలి. యువతులు కూడా తమ కాళ్ళమీద నిలబడగలిగి, దురాశకు పోకుండా తగిన వరుని ఎన్నుకునేపాటి ధైర్యం కలిగి ఉండాలి. అప్పుడే వరకట్న నిషేధ శాసనం ఆచరణలో అమలులోకి వస్తుంది. కూతురికి మూడు ముళ్ళు పడితే చాలు ననుకునే తండ్రి కట్నం తీసుకున్నాడని అల్లుడిని పట్టివ్వలేడు సరిగదా, అడ్వాన్సుగానే కట్నం జేబులో వేసుకునే వియ్యంకుడికి అధిక మర్యాదలు చేసి మరీ పంపుతాడు.

ఆడపిల్ల ఒంటరిగా వెళుతూంటే అబ్బాయిలు అల్లరి పెడతారు. తమతోపాటే స్త్రీ ఒక వ్యక్తి అని గుర్తించకుండా గోలచేసి బేజారెత్తిస్తారు హైద్రాబాద్‌లాంటి నగరాలలో కూడ రోడ్‌సైడ్ రోమియోలను నిరోధించే ఏర్పాట్లు చేయవలసి వచ్చింది. కాని ఇలాంటి అసభ్యకర ప్రవర్తనలను ఏ చట్టం నిరోధించగలదు? తల్లిగా స్త్రీ చిన్నప్పటినుండి బిడ్డలను మంచి శిక్షణతో పెంచి, స్త్రీత్వంపట్ల గౌరవం పెంపొందించాలి. అలా పసితనంనుండి కూడ జాగ్రత్త వహిస్తే కొన్ని తరాల్లో తప్పక మార్పు వస్తుంది యువజన సమితుల్లాంటివి ఏర్పడి యువతులలో సంస్కారం, చైతన్యం కలిగించాలి తమ తోబుట్టువు తమతో పాటే అన్ని జీవిత రంగాలలోను పాల్గొనేందుకు అవకాశం కల్పించాలని యువకులలో ప్రబోధించాలి. ఈ విషయంలో యువకులను మాత్రమే తప్పు పట్టడంలేదు యువతులు కూడా తాము పురుషులతోపాటు అన్ని రంగాలలో కృషి చేయగలమనీ, భర్తకు భారం గాకుండా నిజమైన జీవిత భాగస్వామిని కాగలమనీ ఆత్మ విశ్వాసంతో ప్రవర్తించాలి ఆవిధమైన సంస్కారంలో మహిళాలోకం జాగృతమయి ముందడుగు వేస్తేనే మనకు ముక్తి, విముక్తి.

భిన్న మనస్తత్వాలు ఎంతకాలానికి కలియక పోవటం వలననో, శాశ్వతమైన అనారోగ్య కారణాల వలననో భార్యా భర్తలు కలిసి కాపురం చేయలేకపోవచ్చు. అందువలన అలాంటివారు విడిపోయేందుకు విడాకుల చట్టం రూపొందింది. కాని అది సంతృప్తికరంగాలేదు. మూడు సంవత్సరాలు ఆ భార్యా భర్తలు వేరుగాఉండి అప్పుడు విడాకులకు కోర్టు ద్వారా ప్రయత్నించాలి అంతకాల పరిమితి ఉంచడం అన్యాయంగాఉంది చిన్న ఉదాహరణ చూదాం. 30 'సం. వయసుగల ఉద్యోగస్థురాలొకామె ఒక విధురుని పెండ్లాడింది. పెండ్లయిన కొంతకాలానికి తెలిసింది—అతను, తల్లి కలిపి పెట్టిన రంపకోత భరించలేక మొదటి భార్య ఆత్మహత్య చేసుకుందని వాళ్ళు ఈమెని కూడ చాల బాధలు పెట్టారు. సహనశీలి అయిన ఈమె కూడ భరించలేక విడాకులు కోరింది అప్పటికి ఆమెకు 32 సం. వయసొచ్చింది. మరో మూడేళ్ళాగి అర్జీ పెట్టుకుని ఆ విడాకులు వచ్చేసరికి ఆమె జీవితంలో సగ భాగం అయిపోయింది గదా? ఇంక మరెవరినయినా పెండ్లి చేసుకుందామన్నా వయసు మీరిపోతుంది. కాల వ్యవధి తగ్గించనిదే చట్టం పూర్తిగా ఉపయోగపడదు మరీ తేలిగ్గా విడాకులు దొరికితే చీటికి మాటికి కోర్టు కెక్కుతారనవచ్చు కాని అదేమీ సరదా అయిన పనికాదుగదా? జీవిత సమస్యను అంత తేలికగా చూడరెవరూను. జీవితంలోని నరక యాతన భరించలేక ఏ అఘాయిత్యానికో తలపడతారు మనుష్యుల వివేకంపైన ఆమాత్రం నమ్మకం లేకపోతే ఎలా? పాశ్చాత్య దేశాలలో గూడ చట్టం వచ్చిన వెంటనే విడాకుల సంఖ్య బాగా పెరిగిందట. సంధియుగంలో ఏదయినా అతిగానే ఉంటుంది క్రమంగా ఆలోచన పెరిగి మార్పు వస్తుంది సక్రమమైన శాసనాలు కొన్ని విధాలుగా స్త్రీ జనాభ్యుదయానికి తోడ్పడితే మరికొన్నిచోట్ల సమాజంలోని చైతన్యం ఉపకరిస్తుంది.

అన్నిటికన్నా ముఖ్యంగా స్త్రీకి ఆస్తి హక్కులు రావాలి. 1955 లో వారసత్వపు బిల్లు పాసయింది గాని అది సమగ్రం కాకుండానే మిగిలిపోయింది. ఈ శాసనం పటిష్టంగాఉంటే స్త్రీ ఆర్థికస్థితి, సమాజంలో గౌరవం కొంతవరకు మెరుగవుతాయి. ఇలాంటి ఆర్థిక హక్కులు పొందాలంటే శాసన మొక్కటే శరణ్యం.

కొద్దిమంది స్త్రీలు విద్యావతులై ఉద్యోగాలు చేసుకోవడంచూసి 'ఇదే మహిళాభ్యుదయం!' అని భుజా లెగరేయడం సరికాదు సమాజంలో సగం వంతు జనాభాగల స్త్రీలు పురుషులతోపాటు పురోగమించగలుగుతున్నామా అనేది ఆలోచించాలి. మనమూ వాళ్ళతోపాటు అన్ని రంగాలలో పాల్గొనాలి

శాసనం శస్త్ర చికిత్సలాంటిది ఒక దురాచారం పుట్టకురుపులా సమాజాన్ని పట్టి పల్లారుస్తున్నపుడు శాసనం మాత్రమే దానిని రూపుమాప గలుగుతుంది కాని కొన్ని సంప్రదాయాలు సంఘాన్ని పురుగులా దొలుస్తూంటాయి. అలాంటప్పుడు ఆయుర్వేద వైద్యుడు ఆ జబ్బుయొక్క పుట్టు పూర్వోత్తరాలను పరిశోధించి, రోగ నిదానం చేసినట్లు, సంఘ సంస్కర్త ఆ దురాచారపు పుట్టు కీళ్ళను కదిర్చి ప్రజలను చైతన్యవంతులనుచేసి దురాచారాన్ని మాన్ప గలుగుతాడు. 





ఈ యేడు మీ మామిడి పంటను

# మెలథియాన్‌తో

కాపాడండి




మెలథియాన్ 40 రకాల పళ్ల, 50 రకాల కాయగూరల పంటలను ధ్వంసం చేసే 75 రకాలకు పైగా కీటకాలను చంపుతుంది. మామిడి, సపోటా పంటలను ఎక్కువగా నాశనం చేసే "మేంగో హాపర్స్"ను అదుపులో పెట్టుట లోను, నివారించుటలోను మెలథియాన్ చాలా ఉపయోగకర మైనది. అత్యంత గుణకరము, భద్రత, హానికర పదార్థాలు లేక పోవుట—వీటి వల్లనే పండ్లు, కాయగూరల పంటలను ధ్వంసం చేసే కీటకాలను అదుపులో పెట్టుటలో మెలథియాన్ ఆదర్శ క్రిమి సంహారి. మనిషికి, జంతువులకు మెలథియాన్ హానికరము కాదు

సూచించిన మోతాదు :—

మెలథియాన్ 50% సాంద్రీకరంగా పోర్చబడే క్రిమిసంహారి. నీళ్లలో 1 ఫ్లూయిడ్ ఔన్సు కలపండి ఆకుల మీద బాగా విరివిగా చల్లండి. అవసరమైనప్పుడు తిరిగి చల్లండి.

సయానమిడ్ ఇండియా లిమిటెడ్
పోస్టు బాక్సు 1994, బొంబాయి-1.

వివరాలకు విచారించండి:
ఎస్సో స్టాండర్డ్ ఈస్టర్న్ ఇన్‌కా.
(మద్రాసు, విశాఖపట్టణం, విజయవాడ, సికింద్రాబాదు, కడప)



ష్టమా. అలా దిగులుగా ఉండకమ్మా. క్రొత్త ళ్లికూతురివి కళకళలాడుతూ ఉండాలి. జీవి ంలో మరెప్పుడూ తిరిగిరావీ ఘడియలు."

శూన్యంలోకి దృష్టి బరిపి, దీర్ఘాలోచనలో న్న వాసంతి ఉలిక్కిపడింది. ఎదురుగా ఉన్న క్కయ్యని చూసి బలవంతంగా నవ్వింది.

ఎవరో పిలవటంతో హడావుడిగా వెళ్లిపోతున్న క్కయ్యని అలాగే రెండు క్షణాలు చూస్తుండి యింది,

"మరెప్పుడూ తిరిగిరాని ఘడియలు!" బాధగా నవ్వుకుంది వాసంతి 'అక్క ఎందు కలా అన్నది? బహుశా, సాధారణంగా జరిగేదాన్ని మనస్సులో పెట్టుకుని అని ఉంటుంది కానీ తన విషయంలో—?"

మునుసిగ్గు దొంతరలలో చిరుదరహాస్యాలని దాచుకుంటూ అందమైన అనుభూతులని వూహించుకుంటూ, బంగారు కలలో తేలిపోతూ, ఏవో తెలియని భావాలతో సతమతమవుతూ, కోటి ఆశలు నిండుకున్న మనసుతో—కొత్త పెళ్లి, కూతురిలా—కళకళలాడుతూ లేదు తను!

—అయినా తను 'క్రొత్త' పెళ్లికూతురే!

జాలిగా తనలో తాను నవ్వుకుంటూ కిటికీలో నుండి బయటికి చూసింది వాసంతి. పక్షులు కిలకిలారావాలతో మేలుకొలుపు గీతాలు ఆల పిస్తున్నాయి ఇంకా మత్తు వదలని ప్రకృతి, నీలి ఆకాశంమీద అరుణ వర్ణాన్ని చూసి బాలభానుడి

బంగారు కిరణాలకి స్వాగతమీయాలని అందంగా అలంకరించుకుంటోంది

చెట్టు పుట్టలతో, ఎత్తు పల్లాలతో మనసు వాకట్టే ఆ ప్రశాంత ప్రకృతి సౌందర్యం కాన రావటంలేదు వాసంతికి. ఎక్కడో శూన్యంలోకి ఏదో వెదుక్కుంటున్నట్టున్నా యామె చూపులు. వదలలేని నేస్తంలా ఆలోచనలు వెంటాడా యామెని

కోరుకున్నవి నెరవేరక, కోరనివి అనుభవించడమే నేమో జీవితమంటే ! యిరవై రెండేళ్లయినా నిండని తను రెండుసార్లు విధితో పోరాడాలని ప్రయత్నించి ఓటమి పొందింది. తన జీవితబాట మరో మలుపు తిరగటానికి ఇంకా కొద్ది గంటల వ్యవధి మాత్రమే ఉంది—ఈసారి ఏమవుతుందో !

అందరిలానే పుట్టింది అందరికంటే మిన్నగా అపురూపంగా పెరిగింది. తనంటే ప్రాణాలిచ్చే అప్తులున్నారు కానీ వారి ప్రేమాదరణలు తనని అదృష్టవంతురాలిని చేయలేవు తన అదృష్ట రేఖ రెండుసార్లు వక్రించింది అందినట్టే అంది, ఆశపెట్టి అందకుండా పోయాయి తన అదృష్ట ఫలాలు నిర్లిప్తంగా గడిచిపోతున్న తన జీవితంలో యింకా ఏవో ఆశలు కల్పిస్తున్నాడు భగవంతుడు. తిరిగి అవి చెదిరిపోతే ?

పొడుగ్గా, బలంగా, ఠీవిగా ఉండే మధుకి కూడా వాళ్ల గతే పడితే . ఛీ, ఏమిటీ ఆలోచనలు ? అన్నయ్య అన్నట్టు తనెందుకు మంచిగా ఆలోచించలేకపోతుంది ? శుభ ఘడియలు సమీపిస్తూ తనెందుకీ పాడు ఆలోచనలు వదలలేక పోతోంది ? మనసెందు కింతగా శంకిస్తోంది తనకి 'శుభం' జరుగుతుందని ఎందుకని విశ్వసించలేక పోతుంది ?

కాని ఎలా ? విషాదపూరితమైన గత స్మృతులు మనసులో మెదలుతూ ఉండగా తను శాంతంగా సంతోషంగా ఎలా ఉండగలదు ?

బాధగా కళ్లు మూసుకుంది వాసంతి. సదా చిరునవ్వులు చిందిస్తూ, చిలిపిగా చూసే ఆనంద్ ముఖం ఎదుట ప్రత్యక్షమయ్యింది.

అమాయికమైన కన్నె మనసుతో ఆనంద్‌ని ప్రేమించింది అతడితోడిదే జీవిత మనుకుంది. తన మనసెరిగిన రఘు అన్నయ్య పెద్దలతో సంప్రదించి ముహూర్తం పెట్టించాడు అవధుల్లేని ఆనందంతో అందమైన భవిష్యత్తుని తలుచుకుని తన ఆశలు, కోరికలు నెరవేరబోతున్నాయన్న సంతోషంతో, బంగారు కలలు కంది. ప్రేమించిన యువకుణ్ణి ఎంతమంది కన్నెలు పొందగలుగుతున్నారన్న ఆనందంతో, గర్వంతో పొంగిపోయింది

ఆనాడు—తనకి బాగా గుర్తు ఆనంద్‌ని చూసి సిగ్గుపడి పారిపోయింది తన కౌగిలిలో బంధించి 'యిప్పు డెలా వెళతావు' అన్నాడు చిలిపిగా ఆనంద్. 'ఇంకా పదిహేను రోజులు' మెరిసే కళ్లతో తీయగా చూస్తూ అన్నాడు.

'మీ వళ్లింత వేడిగా ఉందే' ఆందోళనగా అడిగింది తను. 'ప్రేయసి చెంత ఉంటే ఈమాత్రం వేడెక్కదా ?' చిలిపిగా నవ్వుతున్న ఆనంద్‌ని తప్పించుకుని పారిపోయింది తీయని కలలో తేలితూ, నిదానంగా గడుస్తున్న క్షణాలని యుగాల్లా గడిపింది.

'ఆనంద్‌కి టైఫాయిడ్' అన్న వార్త తనని నిలువునా క్రుంగదీసింది. పెళ్లి ప్రయత్నాలు ఎక్కడివక్కడ ఆగిపోయాయి డాక్టర్లమీద డాక్టర్లు మారారు. చేయకలిగినవన్నీ చేసారు. అయినా ఆనంద్ దక్కలేదు.

నలుగురూ నాలుగు విధాల వ్యాఖ్యానించారు నిర్లిప్తంగా సాగిపోతున్నాయి రోజులు సంవత్సరం తిరగకుండానే తిరిగి తనకి పెళ్లి ప్రయత్నాలు ప్రారంభమయ్యాయి వద్దంటున్న తన గోడు ఎవరూ పట్టించుకోలేదు.

ఆనాడు—అవును తనెలా మరచిపోగలదు ? దేదీప్యమానంగా వెలిగిపోతున్న విద్యుద్దీపాల తోరణాల క్రింద, అందంగా అలంకరించిన మంటపాన్ని నిండు అలంకరణతో వంచిన తల ఎత్తలేక, దడ దడలాడే గుండెలతో అడుగులో అడుగు వేసుకుంటూ సమీపించింది తనకి ప్రక్కనున్న అక్కయ్య సాయంతో, సిగ్గుల బరువుతో తల ఎత్తకుండానే నెమ్మదిగా పెళ్లిపీటలమీద కూర్చుంది అందమైన తెర యిద్దరికీ మధ్య అడ్డంగా ఉంది. పురోహితులు గొంతెత్తి మంత్రోచ్చారణ గావిస్తున్నారు

అంతలోనే ఏదో కల్లోలం బయలుదేరింది అడ్డుగా పెట్టిన తెర పడిపోయింది. తను ఆశ్చర్యపోతూ తల ఎత్తింది పెళ్లికొడుకు బాధతో మెలికలు తిరిగిపోతున్నాడు నలుగురు అతన్ని బలంగా పట్టుకున్నారు ఎవరో డాక్టరుకోసం పరుగెత్తారు మరెవరో క్రింద పడుకోబెట్టమంటున్నారు. అంతలోనే ప్రభాకర్ చలనరహితంగా పడిపోయాడు. తెల్లబోయి ఏదో తెలియని స్థితిలో అర్థం గానట్టు అలాగే చూస్తుండిపోయింది తను

"ఇది అడుగుబెట్టింది నా బిడ్డ ప్రాణాలు తీసింది శని . .. యిప్పటిదాకా బంగారంలా ఉన్నాడు నా బాబు" శోకాలు పెట్టూ తనని తోసేస్తూ వచ్చిందొకావిడ చూస్తుండగానే అంతవరకూ కళకళలాడుతున్న పెళ్లిపందిరి శోకావేశాలతో గగ్గోలుమంది. అక్కయ్యా, వదిన వచ్చి కళ్లు తుడుచుకుంటూ చలనరహితంగా నిలబడిపోయిన తనని గబగబా లోపలికి లాక్కెళ్లారు.

జరగకూడనివి ఎన్ని జరిగినా, కాలచక్రం యథావిధిగా పరిభ్రమిస్తూనే ఉంటుంది. రోజులు, వారాలు, నెలలు, సంవత్సరాలు గడచిపోతున్నాయి.

రెండు సంవత్సరాలు తిరగకుండానే తిరిగి తన పెళ్లి ప్రయత్నాలు ప్రారంభించారు. తన కంట్లో నీళ్లు నిలిస్తే చూడలేని అమ్మా, నాన్న, అన్నయ్యా—కన్నీరు మున్నీరుగా విలపించినా తన గోడు పట్టించుకోలేదు వాళ్లకి తన సుఖ సంతోషాలు కావాలి తను పచ్చగా కాపురం చేస్తోంటే చూడాలని వారి కోరిక. అందుకే, ఇంత జరిగినా— జరిగింది దాచిపెట్టి మధుసూధన్‌తో తన వివాహ ప్రయత్నాలు ప్రారంభించారు పెళ్లి యింటి దగ్గర జరిగితే, ఏదో విధంగా జరిగిపోయింది వాళ్లకి తెలిసిపోతుందేమోనన్న భయంతో తిరుపతి కొండమీద వివాహానికి వాళ్లని వప్పించారు

తన సౌఖ్యమే వాళ్లు కోరేది కానీ, తన మనోవేదన ఎవరూ అర్థం చేసుకోరేం ?

"అమ్మా, నా కింకా పెళ్లి ఎందుకు ? జరిగింది చాలదూ ?" ఆవేదనగా అమ్మని అర్థించింది, బ్రతిమాలింది. కానీ, ఆవిడ వినలేదు. కన్నీళ్లు పెట్టుకుంటూ 'అవేం మాటలని' మందలించింది

"అన్నయ్యా నాకీ పెళ్లి వద్దు. నీకు దండం పెడతా నన్నయ్యా ఈ పెళ్లి ఆపించవు" కన్నీళ్లతో జాలిగా, దీనంగా రఘు అన్నయ్యని వేడుకుంది.

అన్నయ్య బాధపడ్డాడు తన మాటలు విని. ప్రేమగా తల నిమురుతూ నెమ్మదిగా నచ్చచెపాలని ప్రయత్నించాడు. "అదేమిటమ్మా ? మధుసూధన్ పెద్ద ఇంజనీరు' అందచందాలలోనూ, గుణగణాలలోనూ అన్నివిధాల నీకు తగినవాడు. ఈడూ జోడూ బావుంటుంది "

"ఇదివరకు ఆ యిద్దరూ ఈడూ జోడూ కాలేదా అన్నయ్యా నా సుఖం కోరి అనవసరంగా ఇంకో ప్రాణాన్ని బలిపెడతారా ? వద్దన్నయ్యా. వద్దు. నాకు పెళ్లి వద్దు. నన్నిలా బ్రతకనీయండి నేనంత బరువైతే ఏ ఉద్యోగమో చూసుకుంటాను ఎలాగయినా ఈ పెళ్లి ఆపు నాకు యింకా ఏ కోరికా, ఆశా లేదు నే నిప్పుడో జీవచ్ఛవాన్ని నా కింకా పెళ్లి ఎందుకు ? నాకు తెలుసు నా జాతకం మంచిదికాదు నన్నెవరు చేసుకోబోయినా, చేసుకున్నా వాళ్ల గతే పడుతుంది . ." వెక్కివెక్కి ఏడుస్తూ అన్నయ్య వళ్లో తల దాచుకుంది

ఆవేశంతో ఆవేదనతో మూర్తీభవించిన శోకదేవతలా ఉన్న తనని చూసి అన్నయ్య నిర్విణ్ణుడై పోయాడు. కొంతసేపటికి తేరుకుని తన కళ్ల నీళ్లు తుడుస్తూ ఓదార్చాడు

"జీవచ్ఛంలా ఉన్న నీ జీవితం తిరిగి పు'
నువ్వు సుఖపడాలనేనమ్మా మా కోరిక.
తలుచుకుంటూ బాధపడటం అవివేకమ
కున్నదానివి నీకు నేను వేరే చెప్పాలా
మైన ఆలోచనలతో మనసు పాడుచేసు
ఎవరో ఏదో అన్నారని మూఢనమ్మకా
కోకు. మేమేం చేసినా నీ మేలు కోరే
విప్పిచెప్పినా అన్నయ్య తనని అర్థంచేసుకో

పెళ్లి వద్దని గట్టిగా పట్టుబట్టింది
కన్నీళ్లు పెట్టుకుంది బ్రతిమాలింది
చెప్పకపోయినా లోలోపల బాధతో క్రుంగిపోయా నాన్న. ఎన్నోవిధాల నచ్చజెప్పాలని, ఒప్పించాలని ప్రయత్నించాడన్నయ్య. సంసారంలోని సుఖసంతోషాలని వివరిస్తూ అక్కయ్య లెటర్ల ద్వారా ఒత్తిడి చేసింది. ఈ కాలంలో కూడా మూఢ నమ్మకాలు పెట్టుకోవడ మేమిటని, అమ్మలక్కల మాటలు విని మనసు పాడుచేసుకోవద్దనీ మందలిస్తూ బావ వ్రాసారు వదిన కూడా తనని వప్పించాలని ఎన్నోవిధాల ప్రయత్నించింది. చిన్నప్పటినుండీ పువ్వుల్లో పెట్టి పెంచిన కన్నవాళ్లకోసం—తన బెంగతో కుమిలిపోతున్న వృద్ధ తల్లి తండ్రుల కోసం—వప్పుకోక తప్పలేదు—కానీ ఏమవుతుందో ?

అమ్మా, వదిన హడావుడిగా రావటంతో ఆలోచనల నుండి తేరుకుని భయంగా వారివైపు చూసింది వాసంతి—ఏమి వినాల్సి వస్తుందోనని !

"లేమ్మా ఇంకా అలా కూర్చున్నా వేమిటి ? స్నానం చేద్దువుగాని పద గౌరీపూజ చేయాలి. ముహూర్తం దగ్గర పడుతుంది" జానకమ్మగారి

## వాసంతి

మాటలు విని తేలికగా నిట్టూరుస్తూ లేచింది వాసంతి.

* * *

సన్నగా కంపిస్తున్న శరీరంతో, వేగంగా కొట్టుకుంటున్న గుండెలతో తడబడుతూ వివాహ మంటపాన్ని సమీపించింది వాసంతి ఎంత వద్దనుకుంటున్నా ఆనాటి ఆ సంఘటనే పదేపదే గుర్తుకు వస్తూ, అదే దృశ్యం కళ్ళముందు నిలబడిపోయి భయవిహ్వాలని చేస్తున్నాయి.

ఇద్దరిమధ్యా ఉన్న అందమైన తెర—భయంకరంగా కనిపించింది వాసంతికి నెమ్మదిగా, వంచిన తల కొద్దిగా ఎత్తింది. అదే దృశ్యం మనసులో మెదులుతుండగా ఏమి చూడాల్సి వస్తుందోనని భయపడింది.

"అబ్బో ! వదిన చూడన్నయ్యా అప్పుడే నిన్ను చూడాలని ఎలా తల ఎత్తి చూసేస్తోందో ! పాపం ! ఈ తెర ఒకటి మధ్యన" పకాపకా నవ్వుతున్న పదహారేళ్లమ్మాయి మాటలకి సిగ్గుపడి చప్పున తల దించేసుకుంది వాసంతి.

ప్రేమగా, ఆప్యాయంగా తననే చూస్తున్న మధు అందమైన కన్నులు తన కళ్ళతో కలవగానే మరింత సిగ్గుపడి పూర్తిగా తల వంచేసుకుంది వాసంతి కొద్దిగా తేలికపడ్డ మనసుతో.

మాంగల్యాలు పట్టుకుని లేచాడు మధు. ముక్కోటి దేవుళ్లని పేరు పేరునా ప్రార్థించింది వాసంతి తన మెడలో క్రొత్తగా నిలుస్తున్న పవిత్రమైన మాంగల్యాన్ని కాపాడమని

వివాహానంతరం దైవదర్శనానికి బయలుదేరారు. దివ్యమంగళ స్వరూపంతో, నుదుట ధవళనామంతో, ఆపాదమస్తకం వజ్రకవచంతో, అలివేలు మంగ పద్మావతులని వక్షస్థలాన అలంకరింపజేసి, అభయ హస్తంతో—భక్తుల హృదయాన్ని భక్తి పారవశ్యంతో పరవశింపజేస్తున్న ఆ శ్రీనివాసుడిని దర్శిస్తూనే తనని తాను మరచిపోయింది వాసంతి. హృదయంలోని మూగబాధని కళ్ళతోనే ఆ స్వామికి నివేదించుకుంది.

శ్రద్ధాభక్తులతో అంజలి ఘటించిన ప్రియ భార్యని ప్రేమగా చూసి తనూ తలవంచి భక్తిగా నమస్కరించాడు మధు.

తిరుపతి పుణ్యక్షేత్రమే కాక, ప్రకృతి సౌందర్యానికి ఆలవాలము మనుషులకి దూరంగా ప్రశాంత ప్రకృతి ఒడిలో వెలిసిన శ్రీ వేంకటేశ్వర స్వామి దివ్య సన్నిధినుండి భగవంతుడి సాన్నిధ్యంలో తృప్తిచెందిన మనసులతో తిరిగివస్తున్న భక్తులని ఆ ఏడుకొండలూ ప్రకృతిబాల నగ్న సౌందర్యంతో ముగ్ధులని చేస్తాయి

కారులో నుండి అందంగా కన్పడుతున్న ఆ ప్రకృతి సౌందర్యాన్ని, ఎత్తుగా ఉన్న బాట మీద నుండి కన్పడుతున్న క్రింద రోడ్డు, వంపు సొంపులని చూస్తూ పరవశవవుతోంది వాసంతి

"కొద్దిగా స్పీడు తగ్గించవయ్యా. ఈ మలుపుల దగ్గర జాగ్రత్తగా ఉండాలి" అక్కయ్య అగగానికి నవ్వుకుంటూ వెనక్కి తిరిగి చూసింది

సాఫీగా ఉన్న రోడ్డు మీద కారు మృదువుగా సాగి పోతోంది. తమ కారు వెనుకఉన్న జీపు ముందుకి వెళ్ళటానికి ప్రయత్నిస్తోంది. ఎదురుగుండా వేగంగా వస్తున్న జీపుని చూసి, కొద్దిగా స్పీడు తగ్గించాడు డ్రైవరు వెనుక ఉన్న జీపు వేగంగా ముందుకి దూసుకుపోయింది. ఉత్సాహంగా చూస్తున్న వాసంతికి సన్నగా ఆర్తనాదం వినపడింది. కారు వెంటనే ఆగిపోయింది. ఏం జరిగిందా అని ఆశ్చర్యంగా తల తిప్పి చూసింది వాసంతి.

కారు డోరు తెరుచుకుని ఉంది రోడ్డుమీద బోర్లా పడున్నాడు మధు. అతని తల రక్తసిక్తమయి ఉంది ఎదురుగా వేగంగా వచ్చేస్తోంది జీప్ జరగబోయే దేమిటో గ్రహించిన వాసంతి కెవ్వున కేకవేసి ప్రక్కకి ఒరిగిపోయింది

* * *

నెమ్మదిగా కళ్ళు తెరవబోయింది వాసంతి ఏవో తెరలు మసక మసకగా కన్పడ్డాయి. తిరిగి కళ్ళు మూసుకుంది.

"తెలిసిందమ్మా వసూ" అక్కయ్య గొంతు అస్పష్టంగా వినపడింది

"చూడు తల్లీ ఒక్కసారి కళ్ళు తెరచి చూడు" నాన్న ఆవేదనగా పిలుస్తున్నారు.

నీరసంగా కళ్ళు తెరిచింది వాసంతి "నా తల్లీ తెలిసిందమ్మా" ఏడుస్తూ తల్లి పలకరించింది.

"డాక్టరుని పిలుచుకుని వస్తాను" రఘు అన్నయ్య బయటికి పరుగెత్తాడు

"ఇంక ఫర్వాలే దత్తయ్యా నేను చెప్ప లేదూ. షాక్ తగిలిం దంతే" వదిన ధైర్యం చెప్తోంది అమ్మకి.

అంతా ఉన్నారు కానీ . కా . నీ

"వసూ ఎలా ఉందమ్మా" తన మీదికి వంగి ప్రేమగా ముంగురులు సవరిస్తూ అడుగుతున్న అక్కయ్యని ఆందోళనగా చూసింది "అక్కా .... ఆయన . .. ?" ఎలాగో అడగగలిగింది.

చెల్లెలి నా స్థితిలో చూచి నందుకు ఆవిడ కళ్ళు తుడుచుకుంది. "బాగానే ఉన్నాడమ్మా. యిప్పుడే బయటికి వెళ్ళాడు"

నమ్మలేనట్టు చూసింది వాసంతి.

"అయ్యో నా తల్లీ రెండు రోజుల నుండి స్పృహ తెలియకుండా పడిఉన్నావమ్మా నీకోసం ఎంత తల్లడిల్లిపోయాం" తల్లి ఏడుపు వింది

నీళ్ళు నిండిన కళ్ళతో జాలిగా చూస్తున్న వదినని చూసింది మనసంతా ఆక్రమించిన అనుమానం వికటాట్టహాసం చేసింది

"అతను బాగానే ఉన్నాడమ్మా" అక్కయ్య తనని నమ్మించాలనీ ప్రయత్నిస్తోంది

'ఉన్న శక్తి అంతా కూడదీసుకొని 'అబద్ధం' అని అరవాలనుకుంది కానీ, నీరసంగా "వారు వా రు" అంటుండగానే తిరిగి స్పృహ తప్పిపోయింది వాసంతికి

"వసూ చూడమ్మా" ఎవరిదో పరిచితమైన కంఠం అస్పష్టంగా వినపడింది నీరసంగా కళ్ళు తెరవబోయింది. చుట్టూ పల్చని తెరలు ఆవరించి నట్టున్నాయి

"అమ్మా వసూ చూడు బావ ఇక్కడే ఉన్నారమ్మా" అన్నయ్య గొంతు ఈసారి కొద్దిగా స్పష్టంగా వినపడింది.

నెమ్మదిగా కళ్ళు తెరిచింది. ఆందోళనగా చూస్తున్న అన్నయ్య, ఆ ప్రక్కనే మధు కన్పడ్డారు.

తనేదో కల కంటోందని నిరాశగా తిరిగి కళ్ళు మూసేసుకుంది వాసంతి.

"మరేమీ ఫర్వాలేదు. పూర్తి విశ్రాంతి కావాలి" ఎవరిదో కొత్త కంఠం వినపడింది. తన శరీరంలో నుండి సూదిలాటి దేదో లాగినట్టనిపించింది. వాసంతికి.

"అమ్మా, మీరు బయటికి పదండి" అన్నయ్య గొంతు.

"వసూ . వసూ . చూడు నేను మధుని" కొద్దిగా పరిచితమైన కంఠం దగ్గరగా వినపడింది

మత్తు వదుల్చుకుని నీరసంగా కళ్ళు తెరిచింది. వాసంతి. "ఎలా ఉంది వసూ ?" ప్రేమాందోళనలతో అడుగుతున్న మధుని చూసి, ఇంకా నమ్మలేక 'ఏ .... వ .... రూ ?' అని అడిగింది వణకుతున్న స్వరంతో.

"నేను వసూ. చూడు. నీ మధుని బాగా తెలిసిందా ?"

నీరసంగా వడలినట్టున్న వాసంతి వదనంలో చిరుదరహాసం వెల్లి విరిసింది. "మీకేనా" అంది సంభ్రమాశ్చర్యాలతో

"నేనే వసూ. నీ కెలా ఉంది ? అంతలా భయపడిపోయా వేమిటి ?" మృదువుగా చెంపలు నిమురుతూ అడిగాడు మధు అతని తలకున్న కట్టు మీదకి మరలాయామె చూపులు బాధగా అంది.

"నా మూలానే కదూ—మీకీ దెబ్బలు తగిలింది."

"అదేమిటి ?" ఆశ్చర్యపోయాడు మధు.

"అవును. నన్ను చేసుకున్న వెంటనే, మీకీ..."

"పిచ్చి వసూ" ప్రేమగా చూస్తూ నవ్వాడు మధు "నిన్ను చేసుకున్నాను కాబట్టే నాకీ గండం తప్పింది" ఆశ్చర్యంగా చూస్తున్న వాసంతి సుకుమార హస్తాన్ని తన చేతిలోకి తీసుకుంటూ చెప్పాడు మధు.

"నాకు పెళ్లయిన వెంటనే ఒక గండం ఉందని చెప్పాడు జ్యోతిష్యుడు అప్పుడు నేను నమ్మలేదు. అంతగా పట్టించుకోలేదు. కానీ యిప్పుడు నమ్ముతున్నాను. నీవే నా పాలిట అదృష్టదేవతవి. లేకపోతే ఏమయిపోయేవాడినో ! అసలు ప్రాణాలు దక్కవలసింది కాదు నీ మూలానే ఇంత సులువుగా తప్పించుకున్నాను" భర్త చేతిని గుండెలకి హత్తుకుంటూ తృప్తిగా కళ్ళు మూసుకుంది వాసంతి. ★




"ఒహవేళ .... హిందీ వచ్చినవాళ్ళే మంత్రిపదవికి పనికివస్తారని అంటే ... మనపనేం గానూ ?..."

# లైడెన్ జాడీ కథ




## వైజ్ఞానిక గాథాశతి- 12

...ణులూ నీలములూ వస్త్రముతో రుద్దితే ...గడ్డి ముక్కలూ రవ్వలూ వంటి తేలిక ... ఆకర్షిస్తాయని పూర్వులకు చిరకాలం ...లుసును "మణి గమన మదృష్టకారితమ్" కణాదుడు వైశేషిక దర్శనములో. లక్క ...ంటి పదార్థాలు కూడా వస్త్రాల వంటి రుద్దితే అవీ తేలిక పదార్థాల్ని ఆకర్షి... క్రీ. పూ. 300 లో థియోఫ్రేస్టస్ తరువాత క్రీ శ. 1600 వరకూ ...ర్షణనూ గురించిన పరిశోధన ఏదీ జరగ... ఎలిజబెత్ రాణి వైద్యుడు గిల్బర్టు, గాజూ ...కమూ, లక్కా, వజ్రమూ, రత్నాలూ కూడా ...ద్యుదావేశితాలు కాగలవని నిరూపించాడు. గాలిలో తేమ లేకుంటే విద్యుత్ప్రభావాలు చాలాసేపు నిలుస్తాయని కూడా అన్నాడు అతనే అయస్కాంతాల గుణాలూ శోధించాడు అయస్కాంతాలలో సజాతీయధ్రువాలు వికర్షించుకుంటాయీ విజాతీయాలు ఆకర్షించుకుంటాయి. విద్యుదావేశిత వస్తువులు ఆకర్షణనే కాని వికర్షణని చూపవనుకున్నాడుగిల్బర్ట్.

ఫాన్ గెరిక్కు పట్టుతో రుద్దినప్పటి గాజు కడ్డీ విద్యు దావేశమూ, ఫ్లానల్‌తో రుద్దిన లక్క కడ్డీ విద్యుదావేశమూ రెండూ వేరు రకాలనీ, అవి వాటిలో అవి వికర్షించుకున్నా, దాన్ని ఇదీ దీన్ని అదీ ఆకర్షించుకుంటాయనీ చెప్పాడు. గంధకపు గోళాన్ని దాని కేంద్రంలోంచి దూర్చిన కడ్డీని తిప్పడమువల్ల తిప్పుతూ, పొడి చేతులతో ఆ గోళాన్ని పట్టినట్లయితే ఆ గోళము విద్యుదావేశిత మౌతుందని కనుక్కున్నాడు గెరిక్కు. అలా విద్యుదావేశితమైన గోళము చేరువకు వ్రేలి కణుపు వెనుక కొసని తీసుకువెళ్లితే సూది గుచ్చినట్లు మెరుపు తగులుతుందని కూడా కనుక్కున్నాడు గెరిక్కు. వ్రేలినికాక మేకుని పట్టి ఆ కొసని విద్యుదావేశిత గోళము దగ్గిరకి తీసుకువెళితే 'చిట్' మనే చప్పుడుతో మెరుపు వస్తుందని చూచాడు చీకటి గదిలో ఈ మెరుపు చక్కగా కానవస్తుంది

రాబర్టు బోయిల్ "ఆకర్షించే వస్తువుల్ని (విద్యుదావేశము నిచ్చి) వ్రేలాడగట్టితే అవి మామూలు వస్తువులవల్ల ఆకర్షించబడతాయి" అని చూచి 'ఆకర్షణ పరస్పరము' అన్నాడు

వాల్ (1680 లో) విద్యుత్ చెణుకులను మేఘాలలోని మెరుపులతోనూ 'చిట్' మన్న చప్పుడు ఉరుముతోనూ పోల్చాడు

న్యూటను, పట్టుతో రుద్దిన గాజు కడ్డీ రుద్దిన చోటనే కాక రెండో ప్రక్క కూడా ఆకర్షణ కనపరుస్తుందన్నాడు ప్రతీ వస్తువులోనూ (గాజుని ఆవేశించే) ధన విద్యుత్తూ (పట్టుగుడ్డని ఆవేశించే) ఋణ విద్యుత్తూ సమపాళ్లలో ఉంటాయి పట్టుగుడ్డ కొంత ఋణ విద్యుత్తును గ్రహించడముతో గాజు కడ్డీకి—రుద్దినంత మేరలో —ధనవిద్యు దావేశము మిగులుతుంది ఇది గాజు కడ్డీలోని ధన విద్యు దావేశాన్ని వికర్షించి రెండో వైపుకి తోస్తుంది దీని ఆకర్షణ శక్తిని న్యూటన్ చూచినది

1728 లో స్టీఫెన్ గ్రే, ష్లీలర్‌లు విద్యుదావేశమును దారాల ద్వారా నూరు అడుగుల దూరానికి కూడా తీసుకుపోవచ్చునని కనుక్కున్నారు (గాజు, లక్క, పట్టు, ఫ్లానల్, విద్యుద్వాహకములు కావు వాటిమీది విద్యుదావేశము ఒక ప్రదేశములోనే నిలిచి ఉంటుందిగాని ఆ వస్తు వైశాల్య మంతటినీ ఆవరించదు. లోహపుకడ్డీని పట్టులో రుద్దితే విద్యుదావేశము కలిగినా, కడ్డీ అంతటా వ్యాపించి, మన చేతి ద్వారా భూమిలోనికి వెళ్లిపోతుంది. లోహాలూ, శరీరమూ విద్యుద్వాహకాలు ) లోహపు తీగెలమీద విద్యుత్తు వ్యాపిస్తుంది అయితే తీగెలు సన్నవైన కొద్దీ ఈ వాహకత్వము తగ్గినదట (సన్నని తీగలకు విద్యున్నిరోధము జాస్తి) తడిగా ఉంటే దారాలు కూడా విద్యుద్వాహకములే నన్నారు స్టీఫెన్ గ్రే ష్లీలర్లు.

1740 లో గార్డన్ గాజుస్థూపకాన్ని— తరిమెణ తిప్పినట్లు— గిర్రున తిప్పుతూ రుద్దితే విద్యుత్తును కూర్చవచ్చునని కనుక్కున్నాడూ, వింక్లరు పట్టుదిమ్మతో రుద్దించడము నయమన్నాడు విద్యుత్ చెణుకులు కొట్టితే ఎలుకల్లాంటి చిన్న జంతువులు చచ్చిపోతాయని కనుక్కున్నారు.

హాక్స్‌బీ గుల్లగా ఉన్న గాజు గోళమును— ఫ్లాస్కులాంటి దాన్ని—గిర్రున తిప్పి రుద్దుతూ విద్యుత్తు కూర్చడములో, గోళములో ఇసుక నింపితే విద్యుదావేశము ఎక్కువగా చేరుతుందని కనుక్కున్నాడు. కండెన్సరు ప్రాథమిక దశ ఇది

క్లీస్టు మందు గళాసులో జొప్పించిన మేకుకి విద్యుదావేశ మిచ్చి, గళాసు ఒక చేతిలో పెట్టుకొని రెండో చేతితో ఆ మేకుని తాకితే పెద్ద షాక్ కొట్టిందన్నాడు నెదర్లాండ్సు పరిశోధకులు విద్యుదావేశమును నష్టము కాకుండా చూచుటకని గాజు సీసాలో నీరుపోసి దానిలో ముంచి ఉంచిన లోహపు తీగె ద్వారా నీటికి విద్యుదావేశము ఇచ్చారు సీసాను ఒక చేతిలో పట్టుకుని ఇంకొక చేతిలో నీటిని తాకితే షాక్ తగిలిందన్నారు గాజు సీసాకు లోపలి వైపు ఒక తగరపురేకూ పైభాగంలో ఒక తగరపు రేకూ అతికించి, లోపలిరేకుకి విద్యుదావేశము నిచ్చిన సాధనమే "లైడెన్ సీసా" "విద్యుత్తు ఈ సాధనంలో అధికాధికంగా కూడుతుంది పై రేకూ, లోపలి రేకూ కలపబోతే చెణుకు బలంగా వస్తుంది" అని వాట్సన్ బెవిన్‌లు 1746 లో కనిపెట్టారు

ఇదే అత్యుపయోగకరమైన లైడెన్ సీసా. (Leiden Jar) విద్యుద్ఘటము (Electric Battery) తయారుకాని రోజులలో విద్యుత్తును నిలవ ఉంచడానికి లైడెన్ సీసానే వాడేవారు. గాజు సీసా తిరుగుతూంటే పట్టుదిమ్మతో రుద్దించి కూర్చిన విద్యుత్తును ఎక్కడ నిలవచెయ్యడమూ ? తిరిగే సీసా పొడవుకి కొంచెం దూరంగా లోహపు దువ్వెనను అమర్చితే, ఘర్షణవల్ల జనించిన విద్యుత్తును ఆ దువ్వెన ముళ్లు 'సేకరించి దువ్వెన వెన్నెముకకు కలిపిన తీగ ద్వారా 'గో' అనే లైడెన్ సీసా లోహ గోళానికి తద్వారా 'గా' అన్న గొలుసుకీ, దానినుంచి రే2 అన్న తగరపు రేకుకీ అందిస్తాయి రే1 అన్నది సీసాకు బయటి తగరపు రేకు రెండు రేకుల నడుమనున్న గాజు పొర నొక్కిన రబ్బరు పొరలాగ పీడితమై ఉంటుంది. విద్యుత్తు చిరకాలము నిలవ ఉంటుంది ఈ సీసాలో 'మూ' అన్నది రబ్బరు మూత

ఆ రోజులలో విద్యుత్తును ఈ సీసాలలో పట్టి ఉంచి ప్రయోగాలు చేసేటప్పుడు పై పొరనీ లోపలి పొరనీ ప్రయోగ వస్తువుద్వారా కలిపేవారు. బేటరీ వచ్చిన తరువాత దీని ఉపయోగము తగ్గిపోయింది విద్యుత్పరిశోధన తొలి దశలో ఇదే సర్వత్రా ఉపయోగమైనది.

—డాక్టర్ ★



ఆమె, తల్లి లాగే—నాజూకైన అపురూప సౌందర్యవతి!

తల్లి, కూతురు అచ్చుమచ్చు ఒక లాగే వుంటారు—ప్రజలు వారు అక్కా చెల్లెళ్ళని భ్రమ చెందుతారు. ఆ అమ్మాయి కలలుకంటూ, ఊహిస్తూ...సౌందర్యరక్షణకు తల్లి సలహాను పాటిస్తుంది. సంవత్సరాలు దొర్లుతాయి. అయినప్పటికి, ఆమె, తల్లి లాగే ఆకర్షణీయమైన అందముతో వుంటుంది. ఆమె తల్లి ఇచ్చిన సలహాలలో ముఖ్యమైనది—నిరంతరము 'హేజలైన్' స్నో వాడుట. దానంతట అది లేక దాని మీద పాడర్ అద్దినగాని, 'హేజలైన్' స్నో మీ రూపమును కాపాడి అందాన్ని పెంపొందిస్తుంది.

**'హెజలైన్' స్నో** సౌందర్యమును నిలబెట్టును.

'హేజలైన్' కోల్డ్ క్రీమ మరియు 'హేజలైన్' టాల్కమ్ పౌడర్ కూడ దొరుకును.

బర్రోస్ వెల్కం & కంపెనీ (ఇండియా) లిమిటెడ్,
పి. ఓ. బాక్స 290, బొంబాయి-1.




[BI-SW-20 TEL]

# సంపెంగలూ సన్నజాజులూ



అవసరాల రామకృష్ణారావు

### జ రి గి న క థ

మంజుల వివాహం కోసం కట్నం తీసుకొని కొడుకు పెళ్ళి చేస్తాడు తండ్రి తర్వాత మంజుల వివాహం అవుతుంది. సహృదయం గల అన్న చెల్లెల్ని చదువుకోమని సలహా యిస్తాడు ఆరేళ్ళు గడిచేప్పటికి బి. య్యే పట్టాతో బాటు నాలు గేళ్ళ మధురిమను కూడా పొందుతుంది మంజు ఎం ఏ పరీక్షకు బలవంతంచేసి భర్తని ఒప్పిస్తుంది. కానీ ఆమె పాసవుతుంది, భర్త ఫెయిలవుతాడు తనకు చదువు మీద శ్రద్ధ లేదని చెప్తాడు ఫైనల్‌కి వెళ్ళాలనుకొన్న మంజుకు మొదట ఆశాభంగం కలిగినా తర్వాత ఉద్యోగం చేయననే ఆమె షరతుకు వొప్పుకుని అంగీకరిస్తాడు భర్త. మంజు అన్నయ్య సంసారం కుంటువడుతుంది న్యాయం పేరుతో ఉద్యోగాన్ని వదులుకునే స్థితికి వస్తాడు ప్రసాదరావు భర్తకు తెలీకుండా తన నగను అమ్మి అన్నయ్య అప్పును తీరుస్తుంది. ఇంటికి తిరిగి వచ్చిన మంజు, భర్త ఎక్కువ డబ్బు ఖర్చు చేస్తున్నట్టు, అప్పులు చేసినట్టు తెల్సుకుంటుంది అన్నయ్య సంసారం ...చి, ఆరోగ్యం గురించి విధమైన సమాచారం ...కపోవడంవల్ల ఆందోళన పడుతుంది మంజు.

## 15

...తాలు చూశాను అది మధుర నుండి. అది ...రాంటే ఉన్న మతి కూడా పూడిపోయిందా ...ఎంది. అదొక పది పేజీల గ్రంథం. ప్రణయ ...ంథం.

ప్రియ మంజులా,

జరిగిన విషయాలు ప్రత్యక్షరం మీకు చెప్పకోకపోతే నే నెలా బతక గలను ? నేను యిక్కడకు వచ్చిన వారం రోజులు దాటకుండా ఉత్తర దేశం నుంచి ఉత్తర కుమారుని ఉత్తరం కొట్టుకొచ్చింది. రవికల గుడ్డలా మడిచిన చిన్న నీలం రంగు కాగితం అది. అందులోని అందమైన అక్షరాలతో ఆయన అడుగుతున్న అంతరాంతరాలు కదిలించే ప్రశ్న ఒకటే ఒకటి.

సుస్మధురా,

సునిర్మలం చెయ్యీ చెయ్యీ కలుపుకుని గంగా యమునా కలిసే పవిత్ర నదీగర్భంతో ప్రతిబింబాలు చూసుకుని ఉవ్విళ్ళూరుదా మనుకుంటే నో కనుక రాసి పారేసి రైలెక్కిపోతావా, ఎక్కడున్నా నా హృదయం నీ కోసం పరిగెత్తుకొచ్చి కుట్టుకోగలదని నీకు తెలీదా ?

నన్నూరా !

మే మందరం భోజనాలు చేస్తుండగా ఆ కవరు వచ్చింది మా తమ్ముడు గబగబా మజ్జిగన్నం తినేసి వెళ్ళి ఆ కవరు అందుకున్నాడు ఆ కవరు చింపేసి నే నెంత వద్దంటున్నా వినకుండా పెద్ద గొంతుకతో చదివేశాడు. మా అన్నయ్య వాణ్ణి నాలుగు వడ్డించా డనుకోండి. ఏమైతేనేం కేశవరావుగారి విషయం మా యింట్లో అందరికీ తెలిసిపోయింది

'వయసుతో ఉన్న పిల్లకి సంబంధం చూసి పెళ్ళి చెయ్యండీ అంటే చదువులో పెట్టేరు ఉద్యోగం చేయిస్తున్నారు అదీ చాలక పై చదువుల కని పై వూళ్లకి వద్దు మొర్రో అంటే వినకుండా పంపించారు అది చేసుకువచ్చిన నిర్వాకం చూశారా?' అని మా అమ్మ మొదలెట్టింది. ఆ రెండవ చివర మా మామ్మ అందుకుంది

'నే నప్పుడే చెప్పేను, ఇలాంటి అఘాయిత్యం ఏదో ఒకటి జరుగుతే గాని ఈ యింట్లో మనుషులకి బుద్ధిరాదని అయినా పెద్దవాళ్ళు చెప్పడం పిల్లలు వినడం పోయి అట్నించిటు తిరుగబడిం దమ్మా మాయదారి కాలం !'

'నీకేం బుద్ధుందా, లేదే ? ఎవడే ఈ కేశవా ? మాటాడవేమే సిగ్గులేకా ?' అని ఎప్పుడూ ఏమీ అనని నాన్నగారు అంటూంటే మాత్రం నా కళ్ళమ్మట గిర్రున నీళ్ళు తిరిగి తింటున్న కంచంలో పడ్డాయి. చెయ్యి కడుక్కు లేచిపోయాను. అన్నయ్య నా వెనకే వచ్చాడు ఇంట్లో తింటూ తిరుగు తున్నదాన్ని అందరి ఎదుటా పెరిగి పెద్దదానను ఐనదాన్ని నే నెలాంటిదాన్నో యీ ఇంట్లో ఒక్కరూ ఎరగరా ? నామీద ఒక్కరికి నమ్మకం లేదా ? ఎన్ని చేసినా ఏం చదివినా ఆడదాని బతుకు అంట్లగిన్నెల బతుకేనా ? నా మొహంమీద చేతుల్ని అన్నయ్య బలవంతంగా తీశాడు.

'నువ్విలా ఏడుస్తూ కూచుంటే మరేం అనుకుంటాం ? అసలు జరిగిందేమిటో, వా డెవడో నీకు తెలీదా? చెప్పు, డొక్కచీల్చి డోలు కట్టేస్తాను నిజంగా చనువిచ్చి మనసిచ్చినవాడేనా చెప్పు, మక్కెలిరగదన్ని పుస్తె కట్టేస్తాను'

దుఃఖమంతా పోయి పక్కున నవ్వొచ్చింది నాకు

"ఒహోహో, ఏం నవ్వు, ఏం నవ్వూ—ఏం సంతోషం, ఏం సంతోషమూ కేశవా, నారాయణా, మాధవా, గోవిందా ... తర్వాత ఏమిట్రా అన్నయ్యా ?" అంటూ కిటికీ దగ్గర కొచ్చిన మా చెల్లెల్ని 'నువ్వు పోతావా పోవా' అని అన్నయ్య ఒక్క కేకేసేసరికి అదక్క డుండకుండా పరిగెత్తింది. తమ్ముడూ, చెల్లెలూ బడికి వెళ్ళిపోయాక, అన్నయ్యను కూచోబెట్టి సంగతులన్నీ—మీరు బలవంతాన రైలెక్కించడంతో సహా—అన్నీ చెప్పేను. ఆ సంగతులన్నీ అన్నయ్య అమ్మనూ, నాన్ననూ కూచోబెట్టి వివరంగా చెప్పేడు.

'ఎందు కనవసరంగా తొందరపడి దాని మనసు నొప్పిస్తారు ? అతడు బి హెచ్. యు లో రిసెర్చి చేస్తున్నాడట వాళ్ళ ప్రొఫెసరుకి అతనంటే ఎంతో యిష్టంట. ఫారెన్ వెళ్ళే అవకాశం కూడా ఉందిట ఈ ఒక్క ఏడాదీ అయిపోగానే పిహెచ్ డి. అయిపోతుంది గనక పెళ్లికి ఏమాత్రం ఆటంకము ఉండదు. ఈలోగా యిది ఎం. ఏ కూడా అయిపోతుంది.

'ఏమో బాబూ ఏం చదువులో ఏ పెళ్ళిళ్ళో.. పెళ్లికాక పాడైపోయిన ఆడపిల్లల్ని గురించి వింటూంటే మాత్రం నా గుండె బద్దలవుతూంటుంది అతడికి తల్లీ దండ్రీ లేరంటున్నావ్, కానీ కట్నం లేదంటున్నావ్, ఏం లోపముందో ఏమిటో.'

అని అమ్మ అనబోతూంటే అన్నయ్య ఖస్సున లేచాడు

'హృదయమున్న మగాడు కాళ్ళ దగ్గరికి వస్తే అలాగే అంటుంది లోకం మరి ఇలా అంచనాలు వేస్తారు కాబట్టే మంచివాళ్ళు కూడా ముందుకి రారు. మతులు లేకపోతే సరి' ఈసారి మామ్మ అందుకుంది.

'ఎందుకురా, అలా దానిమీద ఒంటికాలున లేస్తావ్ ? పెళ్ళి చేసుకునే ముందు కాస్త, మంచీ చెడ్డా, ముందూ వెనకా చూసుకోమూ ? పిల్లాడి కుల మేమిటో గోత్ర మేమిటో.'

'అలాగలాగే మీ రిలాగే మీన మేషాలు లెక్కెడుతూ కూచోండి ఇందుకే ఒళ్ళు మండుతుంది. మీరేమో సంబంధాలు తేలేరు అదేమో దానిమటుకది వెతుక్కుంటే ఒప్పుకోరు భలే'

ఇంక మా నాన్న మౌనంగా ఉండలేకపోయారు.

'ఎందుకర్రా అక్కర్లేని తర్జన భర్జనలు ! పెద్దబ్బాయ్, నువ్వోసారి నరసాపురం వెళ్ళి ఆ అబ్బాయి మంచి చెడ్డ లేవో కనుక్కురా. ఏమాత్రం మనకి నచ్చినా కానిచ్చేద్దాము'

గంగా సైకతాలమీది గాలి తరంగాలలా పరవశించి పోయింది నా మనసు అన్నయ్య ఆ మర్నాడు బస్సులోనే వెళ్ళిపోయాడు ఆ రాత్రికే వస్తాడని ఎంతగానో చూశాను ఇల్లంతా నిద్రలో మునిగినా నే నొక్కర్తినే అలా కిటికీ దగ్గర కూచుని కనపడే దీపం అల్లా రిక్షాగానూ, రిక్షాలో కనపడిన ప్రతి మనిషినీ మా అన్నయ్యగానే వూహించుకుంటూ అలాగే కూచున్నాను. నిద్ర వస్తే అక్కడే పడుకున్నట్టున్నాను కూడాను అమ్మా, మామ్మా, అదే విషయం, అదే పనిగా మాట్లాడ్డం, తమ్ముడూ చెల్లెలూ వాళ్ళ వయసుకి మించిన శృంగార ప్రసం

గాలు చెయ్యడం, అన్నయ్య వింతకీ రాకపోవడం నా ప్రాణం చాలా విసుగెత్తించింది.

వచ్చాడు. వాడి మొహంలో ఎక్కడా కళా కాంతీ లేదు ఆ మొహం చూస్తే విపరీతమైన భయం వేసింది వస్తూనే వాడు అన్నమాట ఏమిటో తెలుసా ?

'నువ్వు చదువుకున్నావు, ఆ మంజులా చదువు కుంది. కాని, ఎంత తేడా ! అది ఆమె సహజ స్వభావమో, సహజన్మ ప్రభావమో—నీ సర్వస్వాన్నీ కాపాడింది ముందామెకు కృతజ్ఞతా సహస్రాలు తెలియజెయ్యి '

'ఏమిట్రా యిదీ ? నువ్వెళ్లినపని ఏమయిందీ ?' అమ్మ మామ్మా, ఒక్కసారే అడిగారు

'అలాగే చెబుతాను మీరు లోపలికి వెళ్లండి ముందు దీనితో మాట్లాడే పనుంది ' అన్నాడు అన్నయ్య వాళ్లు అయిష్టంగా లోపలికి వెళ్లిపోయారు, 'బాగుంది సంబడం' అంటూ.

'ఇంతమందిమి ఉండి ఏమీ చెయ్యలేకపోయాం మనకి సాధారణ పరిచయమున్న ఒక వ్యక్తి నిన్ను రక్షించింది, ఎంత చిత్రం ! దైవసహాయం అంటే యిదే కాబోలు' అన్నాడు.

నేను యింక ఆగలేకపోయాను

'అసలు ఏం జరిగిందిరా ?'

'లోకంలో ఎంతలేసి దుర్మార్గులేనా ఉంటారు. డబ్బు యిస్తే లభించే వేశ్య లుండగా అయినింటి పడుచును నాశనంచేస్తే వాళ్లకేం వొస్తుందో ! వీడికి ఎలా బుద్ధి చెప్పడమో నాకు అర్థం కావడం లేదు '

'ఎవరికిరా ?'

'ఇంకెవరికి ? ఆ కేశవరావుగాడికి ! వాడికి ఎనిమిదేళ్లయి పెళ్లయింది. రెండేళ్ల కొడుకు కూడాను!'

నాచుట్టూ భూమి గిరగిర తిరిగిన ట్లనిపించింది. ఆగిపోయేటంత వేగంతో నా గుండె కొట్టుకోడం ప్రారంభించింది. నా శరీరంలోని రక్తమంతా ఒక్కసారి తలలోకి ప్రవహించి నట్లయింది. అవమానంతో, కోపంతో నా హృదయం భగ్నమయింది

'నువ్వు సరిగ్గా కనుక్కున్నావా ? నీకు తెలిసింది రుజువు చేసుకున్నావా ?'

'వాళ్ల సవతి తల్లినే కలుసుకున్నాను. ఆవిడే చెప్పింది. కోడలూ, మనుమడూ కూడా ఆవిడ దగ్గిరే ఉన్నారు. అతను రాసిన ఉత్తరం ఒకటి వాళ్లింట్లో కనిపించింది నిన్న యిక్కడ చూసిన రైటింగే, సందేహంలేదు ! ఇరుగూ పొరుగూ కూడా బాగా వాకబు చేశాను. తెలిసిన విషయాలన్నీ యదార్థమే నేను ఫలానా కారణంచేత వచ్చానని వాళ్లకింకా చెప్పలేదు, తాలేత్తుకోలేకపోయాను'

నా మనసక్కడ లేదు

అందాలరాశి ఆ వారణాశి అందిన జాబిల్లి ఆ గంగమ్మతల్లి, అరుదైన చెంగల్వ అలనా ఆ పడవ. అంతా వృథా ! దగా !!

రెండు మూడు రోజులు భోంచెయ్యలేదు నాలుగైదు రోజులు నిద్రపోలేదు ఇప్పుడన్నీ యథావిధిగా జరుగుతూనే ఉన్నాయి మామూలుగా స్కూలు వర్కు చేసుకుంటూనే ఉన్నాను అన్నయ్య ఉండబట్టలేక తల వాచేటట్లు చివాట్లు పెడుతూ ఆయనకి ఉత్తరం రాశాడు. దానికి జవాబు రాయడానికి కూడా ఎంత సిగ్గులేకపోయింది చూడండి.

మధురా,

మీ అన్నగారి ఉత్తరం యిప్పుడే అందింది నేను మీ రనుకున్నంత దుర్మార్గుణ్ణి మాత్రం కాదు

పదిహేడేళ్లప్పుడు, నాలో ఏ భావమూ వికసించ నప్పుడు నాకు పెళ్లిచేస్తే అది భార్య అవుతుందా నువ్వే చెప్పు. నాలో ప్రేమ అనేది కలిగించ అంటే అది నిన్ను చూసినప్పుడే వివాహమై వాడు ప్రేమకు అనర్హుడని ఏ శాస్త్రంలో ఉంద నాకు తెలీదు. ఇప్పటికీ, ఇంకా నువ్వు కాదన్న నీకే నిన్ను ప్రేమిస్తూనే ఉంటాను. ఇంతకీ మ



న్యాయశాస్త్రం ఒప్పుకోనంత మాత్రాన మన వివాహం ఆగిపోతుందా, చెల్లకపోతుందా ?

ప్రేమకి మతాలూ, దూరాలూ లేవు అని మన యిద్దరం అనుకోగలిగితే సమ్మతమైన మరో మతం పుచ్చుకుని మరుక్షణం మనం పెళ్ళాడవచ్చు లేక పోతే మరోమార్గముంది నాకు ఫారెన్ స్కాలరు షిప్పు ఎలాగా వస్తుంది. ఎం. ఏ అయిపోయే నీకూ అదేమంత కష్టంకాదు దేశం పొలిమేరలు దాటిన తరువాత మనం ఏ విమానంలో వివాహం ఆడినా అడిగేవాడు లేడు

మధురా, ఒక్కటి మాత్రం గుర్తుంచుకో. ఒక్కొక్కరికి మనకి తెలిసినంతవరకు—ఒక్కొక్కటే జన్మ ప్రేమానందానుభవం లేని బ్రతుకు వృధా

నీ మనసెరిగి నిద్రపోయిన—కేశవ

గాయపడిన హృదయాన్ని మరింత కెలికినట్టున్న ఈ ఉత్తరాన్ని చదవగానే నాకు మరింత రోషం పెరిగింది అది పట్టుకెళ్ళి అన్నయ్యకు చూపించాను 'నేను జవాబు చెప్తాను రాయి' అన్నాడు మండుతున్న హృదయంతో నేను అన్నయ్య చెప్పినట్టు రాశాను

కేశవం,

నీకు తగిన జవాబు రాయకుండా ఎలా ఉండగలను ?

ఒక్కొక్క మనిషికి ఒక్కొక్కటే జన్మ అని జ్ఞాపకం చేసిన ఓ కేశవం ! నిన్ను కట్టుకున్న నీ భార్యది కూడా ఒక్క జన్మే అని మరచి పోయావా? కొంచెమైనా 'లా' తెలియక న్యాయశాస్త్రంమీద అదోలా విసుర్లు విసిరిన ఓ కేశవం !

పదిహేడేళ్లప్పుడు ఏ భావం వికసించనప్పుడు పెళ్ళిచేసుకున్న ఓ ఓ ఓ కేశం ! ఆ భావంతోనే కొడుకుని కన్నావా ?

మనుషుల్ని మరికొంచెం జాగ్రత్తగా ??చవా?య్యి

నీ తెలివినీ, ప్రేమనీ సమీపంలోనే ఉన్న గంగా ప్రవేశం చెయ్యి

నీ కపట మెరిగి మేల్కొనిన—మధుర

మంజులగారూ ! మీ దగ్గిర దాచలేదు, దాచ లేను కూడా అన్నీ జరిగినవి జరిగినట్టు మీకు రాసుకుంటే గాని నాకు తోచలేదు 'ఇంట్లో మందు మరచి పోయావు రైల్లో ఫ్లాస్కు మరచి పోయావు. అంతకన్నా ముఖ్యమైన దేదీ నెళ్లేలోగా యిక్కడ పారేసుకోవుగా ?' అన్న మీ మాటలు మరచి పోలేను ఆనాడు అలహాబాదు వెళ్ళంటే ఆ నమ్మకద్రోహి వలన అంత అపకారమూ జరిగి ఉండేది

మా నాన్నగారు నాకు సంబంధాలు వెతుకుతున్నారు. ఈసారి నేను అడ్డు చెప్పడంలేదు !

మళ్లీ మళ్లీ కృతజ్ఞతా సహస్రాలతో,

మధుర స్నేహ.

ఇంతకీ నేనేం చేశాను ! పాపం సహృదయుడైన ఆ కృష్ణమూర్తి చేసిందిదంతా. ఆ ఉత్తరం అతనికి పంపిస్తే ఎంత సంతోషించునో ! ఎంత వెతికినా అతని ఎడ్రసు మాత్రం దొరకలేదు తమ్ముడూ, కృష్ణమూర్తీ, నువ్వెక్కడున్నావు ? నీ చెల్లెలు చెడిపోయినా లోకంలోని నీ తక్కిన చెల్లెళ్ళు చెడిపోతారేమోనని నువ్వు పడిన ఆవేదన ఎలా మరచిపోను ! నీ కెలా తెలుపుకోను !

నిర్మలకి ఉత్తరం రాసి ఎన్నాళ్లో అయింది జవాబు లేదు. ఏరోజు కారోజు ఉత్తరాలకోసం చూడడంతోనే రోజులు వారాలుగా గడిచిపోతు

# సంపెంగలూ సన్నజాజులూ

న్నాయి. అలా డాబా చివర కుర్చీలో కూచునే దాన్ని. పొద్దుట ఎనిమిదిన్నరా తొమ్మిదీ మధ్య ఆ వీధి చివర పోస్టుమేన్ దర్శన మయేది. గుండె వేగంగా కొట్టుకొనేది. ఒక్కొక్క యింటికి వెళ్లి పోస్టుమేన్ ఏ మనియార్డరో రిజిష్టరు లెటరో పట్టుకువెళ్లి యివతలికి రావడానికి ఆలస్యమైతే కొన్ని యుగాలు అయినట్లుండేది. ఇంక నా మనసు ఆ యింటివాళ్లను ఎన్ని శాపనార్థాలు పెట్టేదో చెప్పలేను అతడు మా యింటికి రాకుండానే అల్లంత దూరం నుంచే 'ఏం హోయి నాగన్నా మాకేమన్నా ఉత్తరా లున్నాయా ?' అని కేకేసే దాన్ని 'లేవు తల్లీ' అనేవాడు

'ఆఁ, చూడకుండా నీకెలా తెలిసిందీ ? ముఖ్యమైన ఉత్తరం ఒకటి రావాలోయ్ రాకుండా ఎలా ఉంటుందీ ? చూడు చూడు' అనేదాన్ని. 'అవును తల్లీ, ఏదో ఉన్నట్టుంది, పెద్దకాలమై పోయిందా కళ్లు సరిగ్గా కనపడవు—పనిమనిషి కిచ్చి పైకి పంపమని సెలవా ? తమరే దిగొస్తారా ?' 'ఎందుకూ నేనే వస్తాను' నాలుగేసి మెట్లు ఒకొక్కసారే గెంతేస్తూ ఇంచుమించు పరుగెడుతూ వచ్చేసరికి తోలు సంచీలోంచి వెతికి నాగన్న నా కిచ్చే ఉత్తరం ఎటువంటిదనీ ? ఓ మనియార్డరు రసీదు ! తప్పితే యిన్సూరెన్సు డిమాండు నోటీసు !

ఇక మా యిద్దరి సంభాషణా యించుమించు యిలా నడిచేది

'ఏమండీ, మావాళ్ల దగ్గిర్నుంచి ఉత్తరం రాలేదండీ'

'అయితే ఏమంటావ్ ?'

'మా అన్నయ్య ఒంట్లో ఎలా ఉందండోనండీ'

'కులాసాగానే ఉండి ఉంటుంది లేకపోతే తెలియ బరచరూ ?

'అలా తెలియబరచే వాళ్లయితే అనుకోడం దేని కండీ'

'తెలియబరుస్తే మాత్రం నువ్వు నమ్మేవు గనుకనా ?'

'లేదనుకోండి.'

'మరి ?'

'ఏమిటో నాకేం తోచడంలేదండీ మా అన్నయ్య జబ్బెక్కువయిందేమోనని భయంగా ఉందండీ.'

'అబ్బబ్బబ్బ ఎప్పుడూ లేంది యిలా భయాలూ ఆందోళనలూ నీకెలా పట్టుకున్నాయ్ ? అలాంటే దానివి మరో నాలుగు రోజులుండి రాలేక పోయావా?

'అప్పటికే ఆలస్యమైపోయింది. మిమ్మల్నీ, మధురిమనూ వదిలి యింకెన్నాళ్లా ఉండగలను చెప్పండి ?'

'అయితే యిప్పుడేం చేద్దాం అంటావ్ ?'

'మరేంలేదు వాడెలా ఉన్నాడో అని నా బెంగ. పోనీ, వో టెలిగ్రాం యిస్తే ?'

'దానికి మాత్రం వాళ్లు సరైన సమాధానం యిస్తారని నమ్మకం ఏముంది ?'

'పోనీ, మీరు ట్రంక్ టెలిఫోన్‌లో మాట్లాడి చూస్తే ?'

'అబ్బబ్బ . అదే ధ్యాస .. అదే గోల'

'పోనీ వెళ్లి నాలుగు రోజులు ఉండి వస్తానండీ ?'

'నీ యిష్టం, నాకు తెలీదు. ఏకంగా అక్కడే ఉండిపోవలసింది'

ఈ మాట పట్టుకు నే నెక్కడ బయలుదేరను! అదిగాక, ఆయనకి ఆఫీసుకి ఇనస్పెక్షను అవడం వల్ల బొత్తిగా తీరుబడి అవడంలేదు నేను కదలడానికి అవకాశమూలేదు! ఆయన అన్నారని కాకుండా నా మటుకు నేను ఆలోచించుకున్నా మాట్లాడితే ఇల్లు కదిలి వెళ్ళడం ఏమీ సబబుగా కనిపించలేదు వచ్చి ఇరవై రోజులన్నా కాలేదు ఆ కామేశ్వరివచ్చి వెళ్ళిన తరువాత ఎక్కడి సామాను అక్కడ సర్దుకోడానికే మొన్న మొన్నటిదాకా పరిపోయింది పాలవాడికీ, చాకలాడికీ, హోటల్‌వాడికీ వందలికి వందలు కాతాలు చూస్తూంటే మతే పోతోంది. ఎంతసేపూ పక్కింటి పిల్లలతో ఆడుకుంటూ కూచుని ఒక క్షణం చదవని ఆ మధు

34 వ పేజీ చూడండి



ఆంధ్ర సచిత్ర

# 1964 సినిమా




★ చిత్రం: మూగమనసులు

★ నటి: సావిత్రి

★ సహాయ నటుడ

★ సహాయ న

★ సంగీత

★ హాస్య నటుడ

ఈ ఏడు సినిమా బాలట్‌లో పాల్గొన్నవారి సంఖ్య సంతృప్తికరంగా ఉంది. కాని ఎందరో పాఠకులు బాలట్ పత్రాలని సరిగ్గా నింపకుండా పంపారు; కొందరు చిత్తు కాగితాల మీదా, మరికొందరు పోయినసంవత్సరం పత్రాల మీదా, ఇంకా కొందరు ఒకే గడిలో ఎన్నో పేర్లు వ్రాసి పంపారు. ఇటువంటివి మొత్తం సంఖ్యలో 3-4%కి మించి లేకపోయినా అవి పంపినవారు 'నియమాలు' పాటించి ఉంటే మాకు సంతృప్తికరంగా ఉండేది।

శ్రీ ఆదుర్తి సుబ్బారావుకి పడినన్ని వోట్లు ఎవరికీ పడలేదు; మొత్తం సంఖ్యలో ఆయనకి 78.96% వచ్చాయి. ఈ విభాగంలో ఆయన తర్వాత ఎవరికీ 10% పైన వోట్లు రాలేదు. కాబట్టి మిగిలిన వివరాలు ఇవ్వడం లేదు.

ఉత్తమ దర్శకుడి తర్వాత ఉత్తమ హాస్యనటుడికి ఎక్కువ వోట్లు పడ్డాయి. శ్రీ పద్మనాభానికి 66.44 శాతం, శ్రీ రేలంగి వెంకట్రామయ్యగారికి 14.40 శాతం, శ్రీ అల్లు రామలింగయ్య గారికి 11.88 శాతం వచ్చాయి.

ఈ క్రమంలోనే చూసుకుంటూ వస్తే 'మూగమనసులు' చిత్రానికి నూటికి 61.06 చొప్పున వోట్లు



సావిత్రి



కె. జగ్గయ్య



ఎస్. రాజేశ్వరరావు

# వార పత్రిక

# ...లట్ ఫలితాలు!

★ దర్శకుడు: ఆదుర్తి సుబ్బారావు
★ నటుడు: అక్కినేని నాగేశ్వరరావు

...ం తె. జగ్గయ్య
...రి జమున
...ం ఎస్. రాజేశ్వరరావు
పద్మనాభం



పడ్డాయి; దాని తర్వాత, 'వివాహ బంధం' చిత్రానికి 13.42 శాతం పడ్డాయి.

'మూగమనసులు' నాయకుడుగా వేసిన శ్రీ అక్కినేని నాగేశ్వరరావుకి నూటికి 60.13 వంతు వోట్లు వచ్చాయి. శ్రీ ఎన్. టి. రామారావుగారికి వచ్చిన 36.93 శాతం వోట్లతో తెలుగు 'హీరో'లు ఇద్దరికి కలిసి 97.06% వచ్చాయన్నమాట.

ఉత్తమ నటిగా ఎన్నిక అయిన శ్రీమతి సావిత్రికి 59.95%, కుమారి జమునకి 22.96% వోట్లు వచ్చాయి.

సహాయ నటులలో మొదట స్థానం శ్రీ జగ్గయ్యది— 52.08% వోట్లు. ఆయనతర్వాత శ్రీ గుమ్మడికి 32.03% వోట్లు వచ్చాయి.

శ్రీ ఎస్. రాజేశ్వరరావు ఉత్తమ సంగీత దర్శకులుగా 51.40% వోట్లు తెచ్చుకున్నారు. శ్రీ కె. వి. మహాదేవన్‌కి 39.36% వోట్లు పడ్డాయి.

సహాయ నటీమణులలో కుమారి జమునకి నూటికి 34.25 వంతు వోట్లు, కుమారి గీతాంజలికి నూటికి 14.73 వంతు వోట్లు వచ్చాయి. ఈ 'ఎన్నిక' లో వోట్లు బాగా విడిపోయాయి. 5—10% వోట్లు తెచ్చుకున్నవారు నలుగురు, 5% (ఇంచుమించు) వచ్చిన ఆమె ఒక నటీమణి, ఇంకా ఉన్నారు. మొదటి ఇద్దరికి కలిపి మొత్తం వోట్లలో సగం కూడా రాలేదు.

ఫలితాలు చూస్తే ఒకటి గమనించవచ్చు. సంగీత దర్శకుడు, సహాయ నటుడు తప్ప గెలిచినవారందరూ 'మూగమనసులు' చిత్రంలో ఏదో ఒక విధంగా పాల్గొన్నవారే. అంతేకాదు, సహాయనటుడు, సంగీత దర్శకులలో రెండవచోటు తెచ్చుకున్న వారిద్దరూ కూడా ఆ చిత్రంతో సంబంధం ఉన్నవారు.

తక్కిన లెక్కలని పాఠకులలో ఎవరికి తోచినట్లు వారు వ్యాఖ్యానించుకోక మానరు! బాలట్‌లో పాల్గొన్న వారందరికీ మా కృతజ్ఞతలు! ★



ఆదుర్తి సుబ్బారావు



అక్కినేని నాగేశ్వరరావు



ప ద్మ నా భ ం



జ ము న

## సంపెంగలు సన్నజాజులూ

31 వ పేజీ తరువాయి

రిమను చూస్తే నయానో భయానో చెప్పవలసింది ఎంతైనా ఉందనిపిస్తోంది. కాని దేనిమీదా నా మనస్సులేదు ఇక్కడ ఉండనూ లేను. తెగించి అన్నయ్య దగ్గిరకు వెళ్ళనూ లేక పోతున్నాను!

ఆ మరునాడు అన్నయ్యకు ఆఖరి ప్రయత్నంగా మరొక ఉత్తరం రాశాను

ఒరే అన్నా,

నీ రక్తం పంచుకు పుట్టిన నీ చెల్లెల్ని ఎందుకురా ఇలా ఏడిపిస్తావ్? పదిహేను రోజుల క్రిందట వదినచేత ఉత్తరం రాయించావు, నీకు రోజు రోజుకీ ఆరోగ్యం చేకూరుతున్నదని. ఏమో ఎంత ఆలోచించినా ఇది నిజమని నా మనస్సు నమ్మలేక పోతున్నది. పోనీ మళ్ళీ మీ దగ్గిర్నుంచి ఉత్తరమేమైనా ఉందా అంటే అదీలేదు. నేను వచ్చేటప్పుడు రెండ్రోజుల కొక ఉత్తరం రాయమనీ, లేకపోతే నాకు తోచదనీ చేతిలో చెయ్యి వేయించుకుని మరీ వచ్చాను. ఏదీ నేను వచ్చి ఎన్ని రోజులయింది, నాకు వచ్చిన ఉత్తరా లెన్ని? వచ్చిన ఉత్తరం ఒకటీ కూడా ఏమాత్రమూ నమ్మశక్యంకానిది.

చిన్నప్పుడు, నాన్నగారు ఒక మంచంమీద పడుకుంటే మరొక పక్కమీద మనిద్దరం ఒకరిమీద ఒకరు చెయ్యి వేసుకుని పడుకున్న రోజులు అప్పుడే మరచి పోయావా అన్నయ్యా? ఒకరి చేతులో ఒకరు చెయ్యి వేసుకుని చేసుకున్న శపథాలు నువ్వు మరిచిపోయావని నన్ను నమ్మమంటావా అన్నయ్యా? చేతులు విడిపోయినా, మరొకరితో చెయ్యి కలిపినా మన మనసులు ఒకటే అన్న విషయం నన్ను మరిచిపోమంటావా అన్నయ్యా?

నీ భార్య అందరిలాంటిదీకాదు నాకు తెలుసు. నా భర్త కూడా అందరిలాంటివారూకారు. అది నీకు తెలుసూ? అన్నీ తెలిసుండి నన్నెందుకిలా వేధిస్తావు? వేధించి నువ్వేమిటి సాధిస్తావు?

ఈ ఉత్తరం అందిన పది రోజుల్లో నాకు సంతృప్తి కలిగించే సరి అయిన సమాధానం రాకపోయిందో—నేను మాత్రం వచ్చేస్తాను, నా భర్తా, పిల్లా ఏమయిపోయినాసరే. నీకు పూర్తిగా ఆరోగ్యం కలిగేదాకా అక్కడే ఉండిపోతాను, నువ్వూ నీ భార్యా పిల్లలూ తన్ని తగిలేసినాసరే.

ఉత్తరం నేనే స్వయంగా పోష్టుచేసి వచ్చాను. ఏస్తూంటే సరళ మా ఇంట్లో కూచుని ఉండడం కనిపించింది.

'ఎందుకక్కా అనవసరంగా కలవరపడతావు? జబ్బు ఎక్కువవడంగాని తగ్గడంగాని మన చేతుల్లో ఏముంది? నువ్వు ఒకవేళ వెడితేమాత్రం ఏం చెయ్యగలవు? తెలిసిన భోగట్టాల్నిబట్టి కులాసాగా ఉందనే నమ్ముదాం. మా నాన్నగారికి మళ్ళీ తిరగబెట్టిందని నిన్న మళ్ళీ ఉత్తరం వచ్చింది. తెలిసి నేను చేయగలిగింది ఏమిటి చెప్పు? మాటాడితే అంతంత దూరం ఆయన పంపగలరా, నేను వెళ్ళగలనా?' అని కళ్ళనీరు తుడుచుకుంది.

(సశేషం)

# తావిలేని పూవు



## అజీజ్

"నాలుగేండ్లక్రితం జరిగిందీ కథ!"

ఎలన్ చిన్నగా దగ్గి పేకముక్కలు పేర్చుకోవడంలో పడిపోయాడు. తనకు పట్టనట్లుగా రాజు ఓమారు అతనివైపు చూసి తలవంచుకున్నాడు.

చెప్తున్నతనిపేరు చక్రవర్తి. వాలు కుర్చీలో నిర్లక్ష్యంగా కాళ్ళుచాపి కూర్చున్నాడు అతని కెదురుగ్గా మరొకతను కూర్చున్నాడు అతని పేరు శేషాచలం.

"ఆట మాంచి పట్టులో ఉంది ఆ కథేదో తరువాత చెప్పు!" అన్నాడు కిటికీ దగ్గర కూర్చున్న వెంకటాద్రి.

"వాడు కథ చెప్పినంతమాత్రానా ఆటకొచ్చే నష్టమేమీలేదు. నువ్వు చెప్పరా చక్రవర్తీ—!" అంటూ అతనివైపు చూశాడు శేషాచలం కుతూహలంతో.

వెంకటాద్రి చక్రవర్తి వైపొకసారి చూసి అయిష్టంగానే చెప్పమన్నట్లు తలూపాడు.

చక్రవర్తి గొంతు సవరించుకుని అన్నాడు— "దీన్ని నేనేం మీకు కల్పించి చెప్పటంలేదు. నాలుగేండ్లక్రితం నేను హైద్రాబాద్‌లో ఉన్నప్పుడు జరిగిన కథే మీకు వివరిస్తాను. దీన్ని కథ అనడం కన్నా నా అనుభవమే అని చెప్పడం ఎంతో మంచిది."

అనుభవ మనేసరికి అంతవరకు తలవంచుకుని కూర్చున్న రాజు, ఎలన్ తలెత్తి చక్రవర్తి వైపు కుతూహలంగా చూశారు.

"లైఫ్ ఈజ్ ది బండిల్ ఆఫ్ ఎక్స్‌పీరియన్స్!" నవ్వుతూ పేకముక్క క్రింద పడేశాడు వెంకటాద్రి

చీకటి పడింది. గది వెలుతురు కిటికీలోంచి బైట వరండా ముందు గాలికి వూగుతున్న సన్నజాజి తీగలమీద పడుతుంది.

చక్రవర్తి కండ్లు మూసుకుని చెప్పటం మొదలెట్టాడు.

"సిటీ కెళ్ళడం నా కదే మొదటిసారి. అక్కడంతా నాకు క్రొత్త కావడంవల్ల ఆఫీసులో ఎవరితో మాట్లాడేవాడిని కాదు. సాయంత్రమైతే ఒంటరిగా ఎక్కడికెళ్ళాలో, ఏం చేయాలోననేవి పెద్ద సమస్యలుగా పట్టుకునేవి. కొన్నాళ్ళవరకు ఆఫీసునుంచి నేరుగా గదికి చేరుకోవడం, ఏదైనా పుస్తకం చదువుతూ కూర్చోవడం పనిగా పెట్టుకున్నాను. మీలాంటి స్నేహితుల్ని, ఇలాంటి పేకాట

కావాలన్నా దొరికేదికాదు." అంటూ నవ్వాడు అందరివైపు చూసి చక్రవర్తి.

"కోతలు—!" అన్నాడు వెంకటాద్రి.

"అబ్బ! మధ్యలో నువ్వు అడ్డు పోకు వాడు చెప్పేది కాస్త పూర్తిగా విను" అంటూ విసుక్కున్నాడు శేషాచలం.

అక్కడ కూర్చున్న వాళ్ళలో కొంత చిన్న కావడంవల్ల వెంకటాద్రి మరేం మాట్లాడలేక పోయాడు. వచ్చిన కోపాన్ని మింగుతూ చూశాడు, శేషాచలాన్ని.

"ఆఫీసులో వినాయకరావనే అతను కొంచెం క్లోస్‌గా మాట్లాడేవాడు రోజులు గడుస్తున్న కొద్దీ మంచి ఫ్రెండ్ అయ్యాడు అతనితో అప్పు డప్పుడు సినిమాలకు, పార్కులకు వెళ్ళేవాడిని. అతని గురించి అంతగా ఇక్కడ చెప్పాల్సిన అవసరంలేదు. కాని అసలు కథ మొదలవడం అతనితోనే జరిగింది కాబట్టి అవసరం వచ్చినంతవరకే ఉపయోగించుకోవడం మంచిది. అక్కడ వినాయకరావుకు కొంత పలుకుబడి ఉంది. పలుకుబడి అంటే పదిమందితో పరిచయం మాత్రమే! అతని సహాయంతో ఒక క్లబ్‌లో మెంబర్‌షిప్ సంపాదించ గలిగాను—"

"ఓహో! ఈ పేకాట అక్కడ నేర్చుకున్నదే నన్నమాట!" అంతసేపు మౌనంగా కూర్చున్న ఎలిస్ అడ్డు తగిలాడు

"అబ్బబ్బ! ప్లీజ్! మీరిలా ప్రతీసారి అడ్డు తగిలితే ఈ రాత్రంతా వాడు కథ చెప్పడమే సరిపోతుంది ఈ ఆట కూడా సరిగ్గా సాగదు కొంచెం ఇంట్రెస్ట్‌గా వినండి— చెప్పేవాడికి కూడా కుతూహలం పెరుగుతుంది" అని నచ్చచెప్పాడు శేషాచలం

"ఇది దయ్యాల కథ కాకపోయినా అసలే చీకటి రాత్రి- -ఎందుకైనా మంచిది—ఒరే వెంకూ! ఆ కిటికీ తలుపులు కొంచెం దగ్గరికి లాగు" అన్నాడు రాజు భయంగా వెంకటాద్రి వైపు చూస్తూ.

"అలాంటిదికాదులేరా—!" అంటూ తిరిగి మొదలెట్టబోయాడు చక్రవర్తి వెంకటాద్రి ఏమనుకున్నాడోకాని లేచి వెళ్ళి కిటికీ రెక్కలు దగ్గరకేసి వచ్చాడు.

"ఆ క్లబ్బుకు .." తిరిగి చెప్పటం మొదలెట్టాడు చక్రవర్తి ". .మంచి హోదాలో ఉన్నవాళ్ళు వచ్చేవారు. అక్కడ ఇలాగే ఎక్కువగా పేకాట నడిచేది అప్పట్లో నాకు సరిగ్గా ఏ ఆటా వచ్చేదికాదు. అంతవరకు మీకు తెలిసిన విషయమే! కాని వినాయకరావు ధర్మమా అంటూ పేకాటలో అన్ని రకాలు నేర్చుకున్నాను ఇక్కడ మరో విషయం చెప్పాలి. ఆడవాళ్ళు కూడా మెంబర్స్‌గా ఉన్నారు ఆ క్లబ్బులో చాలా కొద్దిమంది అది కూడా భర్తల్తో అప్పుడప్పుడు కలిసి రావడం వల్ల ఇంట్రెస్ట్ ఎక్కువై మెంబర్‌షిప్ తీసుకున్నారు. ఎవరొచ్చినా, రాకపోయినా వాళ్ళుమాత్రం వదిలేవాళ్ళుకారు అందులో 'చూడామణి' అనే ఆవిడ బిలియడ్స్ బాగా ఆడేది మొదట్లో ఆమె పేరు నాకు తెలియదు. తరువాత వినాయకరావే చెప్పాడు. ఆరు నెలలు తిరిగేసరికి 'మంచి ఆటగాడు'—అని అందరూ మెచ్చుకున్నారు" నవ్వుతూ అందరి వైపొకసారి చూశాడు చక్రవర్తి.

మధ్యలో ఆపినా ఎవరూ మాట్లాడ లేదీసారి. అందరూ ఎంతో ఆసక్తితో చక్రవర్తి చెప్పబోయేది ఏమై ఉంటుందా అని ఆతృతగా చూస్తున్నారు—అతనివైపు. చక్రవర్తి వోమారు అందరి వైపూ పరీక్షగా చూసి చెప్పసాగాడు.

"క్లబ్బుకు వచ్చేవాళ్ళలో చాలామందికి తాగుడు అలవాటుండేది తరచుగా కొట్టుకోవడం కూడా జరిగేది—లోడ్ ఎక్కువైతే. అందులో కొందరు ఆడవాళ్ళు కూడా తాగుతారంటే మీరు నమ్మరు."

"అవును! నేను నమ్మను ఇదంతా కట్టుకథ!" అంటూ అరిచాడు వెంకటాద్రి

"అంతే నిజంగా కట్టుకథే!" పేక ముక్కలన్నీ కలుపుతూ అన్నాడు రాజు.

"ఇదిగో వెంకటాద్రి— అనవసరంగా ఆవేశ పడటం ఎందుకు చెప్పు? దానివల్ల వచ్చేదేమీ లేదు. లేని పోని గందరగోళం! నువ్వు కానివ్వరా?" అంటూ చక్రవర్తివైపు తిరిగాడు శేషాచలం.

"చూడామణి కూడా తాగేది ఆమె మాట్లాడుతున్నప్పుడు నోట్లోంచి వాసన వచ్చేది మొదట్లో నాకు ఆశ్చర్యమనిపించింది కాని వినాయకరావు ఆ అనుమానం కూడా తీర్చాడు అందరూ ఆవిడను 'మణిగారు' అని పిలుస్తుండేవాళ్ళు అందరితో ఆమె ఎంతో సరదాగా మాట్లాడేది ఎప్పుడైనా ఆమె రావడం ఆలస్యమైతేచాలు— క్లబ్బులో ప్రతీవాడు— "ఏమండీ! మణిగారు ఇంకా రాలే దివ్వాళ వచ్చే టైం కూడా దాటిపోయింది" అంటూ కాలు గాలిన పిల్లిలా తిరిగేవాళ్ళు.

ఊర్లో బాలకృష్ణనాయుడు అనే పేరుమోసిన పబ్లిక్ ప్రాసిక్యూటర్ భార్య చూడామణి. వినాయకరావు చెప్పినంతవరకు నాయుడు బాగా సంపాదిస్తాడని, ఎవరితో మాట్లాడినా గడగడ వాగటం అలవాటని తెలిసింది. క్లబ్బుకు అప్పుడప్పుడు వచ్చేవాడటగాని అప్పట్లో నేనతన్ని చూడలేదు.

ఒకరోజు వర్షం మూలంగా క్లబ్బుకు చేరుకోవడం చాలా ఆలస్యమైంది చీకటి పడింది. వర్షం మూలంగా చల్లగాలి ఎక్కువైంది చూడామణితో మాట్లాడటానికి ఆరోజు మొదటిసారి దొరికింది అవకాశం ఆరోజే అంతగా గుర్తుండటానికి కారణం—వర్షమే. రాత్రి పన్నెండువరకు ఎడతెరపి లేకుండా కురిసింది.

వినాయకరావు ఆరోజు నాకన్నా ముందేవచ్చి కూర్చున్నాడు అతని కెదురుగ్గా చూడామణి కూర్చోనుంది నేను వెళ్ళగానే వినాయకరావు "ఇదిగో—వీరే చక్రవర్తి! మా ఆఫీసులోనే పని చేస్తుంటారు" అంటూ పరిచయ వాక్యాలు పలికాడు

చూడామణి నావైపు పరీక్షగా వోమారు చూసి చిరునవ్వు నవ్వింది "కూర్చోండి!" అంటూ ఆమె తన ప్రక్కగాఉన్న ఖాళీ కుర్చీ చూపించింది నేనేం మాట్లాడలేదు మౌనంగా కూర్చున్నాను"

"ఇంకేం రొట్టె విరిగింది—నేతిలో పట్టానికి" రాజు తల వంచుకునే గొణిగాడు.

"ష్—అన్నీ ఫూలిష్ ఆలోచనలు—మాట్లాడకుండా వినూ—" అంటూ చెప్పసాగాడు చక్రవర్తి— "బైట వర్షంతోపాటు ఈదురుగాలి ఎక్కువైంది. చూడామణి ముఖంమీద పడుతున్న ముంగురుల్ని కేర్‌లెస్‌గా వెనక్కునెట్టి—

"మీ రివ్వాళ నాకు రమ్మీ నేర్పాలి. నాకు కార్డ్స్ డిస్‌చార్జ్ చేయడం రాదు. నేనూ, వినాయక్‌రావు ఆడ్తుంటాం. మీరు చెప్తూ కూర్చోండి." అంది.

"నాకేం వచ్చని—?" అన్నాను వినాయకరావు వైపు కోపంగా చూస్తూ.

"పోనీ —మీకు వచ్చినంతవరకే చెప్పండి." అంటూ నవ్వింది.

మౌనమే శరణ్యమైంది నాకు ఒకటీ— రెండూ ఆటలు తప్పితే అన్ని ఆటలు మణే గెలిచింది. దాంతో ఆమెకు నేనంటే మంచి గురి ఏర్పడింది. నేనేది అవునన్నా అవుననేది ఆటలో. కాదన్నది కాదనేది.

ఆట మీదినుంచి లేచేసరికి ఆ రోజు పదకొండు దాటింది. బైట వర్షం తగ్గి జల్లు పట్టింది వినాయకరావు ముఖం ముడుచుక పోయింది.

"అరె! యింకా తగ్గనట్టుందే యీ వర్షం?" అంది మణి బైటికి చూస్తూ.

మా యిద్దరిలో ఎవరూ మాట్లాడలేదు తరువాత నా వైపు తిరిగి—"మీ రెక్కడుంటున్నారు?" అడిగింది నేను చెప్పాను ఆ తరువాత కొంతసేపు ముగ్గురం మౌనంగా కూర్చున్నాం. క్లబ్బు చాలావరకు పలుచబడింది. అయిదు నిమిషాల తరువాత మణి బైటికి వెళ్ళింది ఇప్పుడే వస్తానని ఆమె అటు వెళ్ళాక— "ఏమిటి—అలా అయిపోయారు?" అడిగాను వినాయకరావును.

అతను బదులు పలకలేదు అతని బదులు పలుకులకు ఆమె అవకాశం ఇవ్వలేదు... అంతలోనే మణి తిరిగి వచ్చింది.

"పదండి— ట్యాక్సీని పిలిచాను మిమ్మల్ని డ్రాప్ చేసి వెళ్తాను" అంది

"మా కింకా కూర్చోవాలనుంది!" అంటూ నవ్వాను నేను

మణి కనుబొమలు ఎగరేస్తూ— "వాట్— పన్నెండు కావస్తుంది ఎక్కువగా మేలుకోవడం ఆరోగ్యానికి మంచిదికాదు" అంది

ఒక్కరోజు పరిచయంలోనే ఆమె తీసుకున్న చనువుకు చకితుడనయ్యాను ఆ సమయంలో చూడామణి నాకన్నా వయసులో నాలుగైదేండ్లు పెద్దగా కనిపించింది నేను మాట్లాడకుండా వినాయకరావువైపు చూశాను

"పదండి వెళ్దాం!" అంటూ లేచి నిల్చున్నాడతను లేవటం నాకూ తప్పిందికాదు. ముగ్గురం కలిసి ట్యాక్సీ ఎక్కాం అందులో కూర్చున్నంతసేపు చూడామణి తన కుటుంబ విషయాలు, భర్త గురించి చెప్పుకొచ్చింది.

"నాన్నను నేను చూడలేదు. అమ్మ ఒక్కతే నన్ను పెంచి పెద్దదాన్ని చేసింది. చదివించింది. పెండ్లి చేసింది అంతటితో తన బాధ్యత తీరినట్టు ఈ లోకంనుంచి శాశ్వతంగా శలవు తీసుకుంది వారు తప్పితే ఈ లోకంలో నా కెవరూ లేరు—" చెప్తున్నప్పుడు చూడామణి గొంతు జీరపోయింది చీకట్లో ఆమె ముఖం సరిగ్గా కనిపించటంలేదు చూడాలనుకున్నా

మధ్యలో వినాయకరావు దిగిపోయాడు. ఆమె ముందు కూర్చోనుంది. రెండు నిమిషాల తరువాత సెంటర్‌లో కొంతసేపు ఆగింది ట్యాక్సీ.

"వారు చాలా కోపిష్టి మనిషి......" అంటూ నిట్టూర్చింది నా వైపు తిరిగి.

టాక్సీ కదిలింది.

ఆమె నా వైపు తిరిగి మాట్లాడటం నాకెంతో ఇబ్బందిగా కనిపించింది.

"మా ఇంటికి ఎప్పుడొస్తారు?" అడిగింది.

నవ్వాను—"వస్తాను... ..!" అంటూ నాలో నేనే గొణుక్కున్నాను. నవ్వింది మణి. బహుశా నా పిరికితనానికి కాబోలు.

ఆరోజలా గడచిపోయింది. ఆ తరువాత రెండు మూడు రోజులవరకు చూడామణి క్లబ్బుకు రాలేదు. ఒక రోజు వినాయకరావు అన్నాడు—"మణి మిమ్మల్ని అంత తేలిగ్గా వదలదు" అని. అతనలా అనడం నా కెందుకో నచ్చలేదు. ఆమెతో నేను చనువుగా ఉండటం అతని కిష్టంలేదనుకుని మౌనం వహించాను కాని వినాయకరావు వూరుకోలేదు.

"కొంత కాలానికి మీరు బోర్ అవుతారు" అన్నాడు.

"కావలసిందేగా!" అంటూ నవ్వాను నేను.

"గుడ్! అసలు కథ ఇప్పటిగ్గాని దారిలో పడలేదు" వెంకటాద్రి పేకముక్కలు పంచుతూ అన్నాడు.

"ఆమె పరిచయం అయిందని చెప్పడానికి ఈ చేట భారతం ఎందుకు?— ఒక్కమాటలో చెప్పొచ్చుగా—!" ఎలన్ విసుగ్గా చూశాడు చక్రవర్తిని.

రాజు సిగరెట్ ముట్టించి—"ఈ నాలుగేండ్లు నువ్వు ఉత్తరాలు సరిగ్గా వ్రాయకపోవడానికి కారణం ఏదో అనుకున్నాను. అసలు సంగతి ఇదన్న మాట—!" అన్నాడు.

"పొరబడ్తున్నారు మీరు. నే నలా అనడంలో దురుద్దేశమేమీలేదు. కేవలం వినాయకరావును ఏడ్పించాలనే అలా అన్నాను. ఒకవేళ చూడామణి మీద నేనింతవరకు వూహించని ఇంట్రస్టేవుంటే ఈరోజు మీ కా అనుభవం చెప్పేవాడినికాదు. అది నాలోనే దాగుండేది. మీరు కాస్త ఒళ్ళు దగ్గర

# తావిలేని పూలు

పెట్టుకుని వినండి—" అన్నాడు చక్రవర్తి కోపంగా.

"ఇంతట్లోనే నీకు కోపం ఎందుకు? పెద్దగా వాళ్ళు మాత్రం ఏం అన్నారని?" అంటూ శేషాచలం చక్రవర్తివైపు చూశాడు.

"ఇక్కడ చర్చ అనవసరం. మీరు వోపిగ్గా వినండి కాస్త. నాకంతేచాలు—!" తేలిగ్గా నవ్వడానికి ప్రయత్నించాడు చక్రవర్తి వచ్చిన కోపాన్ని దాచేస్తూ.

"ఊఁ!" అన్నాడు రాజు.

తిరిగి కథలోకి వచ్చి చెప్పటం ప్రారంభించాడు చక్రవర్తి.

"ఆరోజు నెల జీతం తీసుకుని సాయంత్రం వస్తూవస్తూ కొన్ని వస్తువులు కొనాలనుకున్నాను. అనుకోకుండా షాప్‌మెట్లు దిగుతూ చూడామణి కనిపించింది. వెంట ఎవరో ఉన్నారు. విష్ చేశాను—తప్పనందుకు. బదులుగా చిరునవ్వు నవ్వుతూ పిలిచింది మణి.

"బాగున్నారా?" అడిగింది.

నవ్వొచ్చింది ఆమె ప్రశ్నకు. "నాలుగు రోజుల్లోనే నాకేమైనా జబ్బు చేసిందా అలా అడగటానికి?"

"దాందేముంది. అయిదు నిమిషాల్కితం కనిపించిన వ్యక్తి ఇంటికెళ్ళి మరీ కాఫీ త్రాగి చనిపోయాడు ఈమధ్యనే. అలాంటి జబ్బు నీకేమైనా చేసిందేమోనని అడిగి ఉంటుంది. కానివ్వు!" అంటూ నవ్వాడు వెంకటాద్రి.

"మాట్లాడకుండా తలూపాను నేను—బాగానే ఉన్నట్లు.

"వీరు మావారు—పబ్లిక్ ప్రాసిక్యూటర్—!" అంటూ ఆమెతోవున్న వ్యక్తిని పరిచయం చేసింది

అప్పుడు చూశాను — బాలకృష్ణనాయుడును. బట్టతల—ఉన్న కాస్త జుట్టు కూడా నెరసింది.

అతనిది నిజానికి అంత ఎక్కువ వయసు లేకపోయినా ఉన్నట్లే కనిపించాడు. టెర్లిన్ షర్ట్ మీద తెల్లపాంటు టక్ చేశాడు. కొంచెం లావుగా, పొడుగ్గా చామనఛాయ రంగులో ఉన్నాడు. అందమైన చూడామణి గర్వంగా చూసింది నా వైపు.

"వీరు చక్రవర్తిగారని ఫ్యామిలీ ప్లానింగ్ ఆఫీసర్. ఆమధ్య మీటింగ్‌లో పరిచయమైందన్నానే వీరే—!" అంది మణి నవ్వుతూ.

"గ్లాడ్ టు సీ యు—!" అన్నాడు నాయడు. నాతో చేయి కలుపుతూ. బదులుగా నవ్వాను. కాని మణి ధోరణి నాకు అర్థం కాలేదు. నన్నా విధంగా పరిచయం చేయాల్సిన అవసరం ఏమొచ్చిందో ఎంతకూ బోధపడలేదు. నేను ఫ్యామిలీ ప్లానింగ్ ఆఫీసర్‌నట—! నాయుడు నమ్మాడు.

"ఎప్పుడైనా వస్తూ ఉండండి మా ఇంటికి!" అన్నాడు నాయుడు.

"ఎందుకురారు? వారికిమాత్రం ఎవరున్నారని ఈ వూళ్ళో ఇన్వైట్ చేయడానికి క్రొత్తగా ఈమధ్యనే వచ్చా రిక్కడికి. మీరు బోర్‌గా ఫీలైనప్పుడు వోమారు రండి—!" అంది మణి.

నాకు మణిమీద ఎక్కడలేని కోపం వచ్చింది. భర్తముందు ఎంత అప్యాయంగా అబద్ధమాడిందో తలుచుకుంటే ఆశ్చర్యమనిపిస్తుంది. నిజంగా నేను మామూలు ఆఫీస్ గుమస్తానని పరిచయం చేస్తే ఆమె డిగ్నిటీకి భంగమేమో, లేక భర్త ఏమైనా అంటాడేమోనని భయం కాబోలు! ఏది ఎలాగున్నా ఒకటిమాత్రం నిజమనిపించింది. చూడామణికి ఎంత ఉన్నా జీవితంలో సుఖంలేదని కొంతకాలానికి పసికట్టాను అందుకే ఈ విధంగా క్లబ్బులకు, సినిమాలకు, షికార్లకు స్నేహితులతో తిరుగుతూ కాలక్షేపం చేస్తుందని—అని వూహించాను.

నే నూహించింది నిజం కాకపోదు ఎందుకంటే నాయుడు అస్తమానం కోర్టు, స్నేహితులు, క్లబ్బులచుట్టూ తిరుగుతాడు కాబట్టి అతను మణిని ఏ విధంగాను సంతోషపెట్టలేడు. పైగా రాత్రులు తాగిరావటం, నానా బూతులు తిట్టడం, మైకం ఎక్కువైతే చేయి చేసుకోవడం ఇవన్నీ చూడామణికి మేలుకొలుపు చేశాయి. భర్తలా ఆమె కూడా తిరగటం మొదలెట్టింది. అంతకంటే మరోదారి కనిపించలేదామెకు.

ఒకసారి మాటల్లో చెప్పింది.

"మావారు బాగా తాగుతారు. నేనే ఆలస్యం అనుకుంటే నాకన్నా ఆలస్యంగా వస్తుంటారు ఇంటికి!" అంది ఎంతో తేలిగ్గా నవ్వుతూ.

నాకు కొంచెం బాధనిపించింది మణిమీద సానుభూతి పెరిగింది 'నిజమే! నాయుడుకు మణిని సుఖపెట్టేందుకు సమయంలేదు' అనుకున్నాను.

"వారితో ఆరోజు అబద్ధం చెప్పారు నా గురించి చెప్తూ. కారణం నాకింతవరకు అర్థం కాలేదు!" అన్నాను.

"మీరేం కంగారు పడకండి. అలాంటి మనుషులకు అలా చెప్పాలి కనుకనే చెప్పాను. ఆ విషయాన్ని మీరు అనవసరంగా గుర్తుకు తెచ్చుకోకండి!" అంది నవ్వి.



"నేను మంత్రిగా వుండేరోజుల్లో యీవూరు వచ్చాను, ఇక్కడే ఓ అసుపత్రి భవనానికి శంకుస్థాపనచేశా! ఆ రాయి యింకా యిక్కడెక్కడో వుండొచ్చు..."











CINTHOL
CINTHOL

# తావిలేని పూలు

ఆరోజు ఆ సంభ్రమంలోంచి తేరుకోకముందే ఆమెకోసం వచ్చిన స్నేహితునితో వెళ్ళిపోయింది అక్కడినుంచి మణి.

ఆ తరువాత మరోసారి సినిమా హాల్లో చూశాను. వెంట ఎవరో స్నేహితులు కూడా ఉన్నారు.

"నిన్న చెప్పారుకాదేం, నేనూ వచ్చేదాన్ని మీకు కంపెనీగా! ఎవరూ దొరక్కపోతే వినాయకరావు స్నేహితులతో వచ్చాను!" అంది సినిమా అయిపోయాక దారివెంట నడుస్తూ.

"అనుకోకుండా వచ్చాను—!" అన్నాను నేను.

నాకు తెలియకుండానే చాలా దూరం నడిచాను ఆమెతో. ఆరోజు రాలేనని ఎన్ని సాకులు చెప్పినా ఆమెతో వాళ్ళ ఇంటికి వెళ్ళడం తప్పలేదు నాకు. ఆమె బలవంతంవల్లనే భోజనం కూడా చేయాల్సి వచ్చింది అక్కడే.

తాంబూలం చేతికిస్తూ—"మీకు నా ప్రతీ కదలిక చకితుడ్ని చేస్తుందికదూ! నిజానికి ఇందులో అంతగా అబ్బురపడేందుకు ఏమీలేదు. కాలంమారింది. దాంతోపాటు మనుషులు కూడా మారటం సహజం. వివేకం కూడాను!" అంది నవ్వుతూ.

"అవునేమోకాని అందరూ మీలాంటివాళ్ళే ఉండరు. మీరుకోరే మార్పుల్ని తృణీకరించవచ్చు. అంతమాత్రంచేత వాళ్ళలో వివేకం లేదని అనలేరు. అవివేకం ఎంతమాత్రంకాదు—!" అన్నాను.

భయం, కోపం కలగాపులమయ్యాయి ఆమె ముఖంలో. ఆమెవైపు చూడలేక తలవంచుకున్నాను నేను. ఒకవేళ ఆ సమయానికి నాయుడు రాకపోతే ఏం జరిగేదో కనీసం నేనూహించనైనాలేను

నాయుడు బట్టలు మార్చుకోవడానికి లోపలికెళ్ళాడు. మణి కదలకుండా అలాగే కుర్చీకి అంటుకుపోయింది.

నాయుడు వచ్చాడు ఆమె పలకలేదు.

"ఏమిటి? ఇద్దరూ అలా కూర్చొండిపోయారు" అంటూ తనూ కూర్చున్నాడు.

నేను నవ్వలేక నవ్వుతూ చూశాను అతనివైపు.

"మనం కలసి చాలా రోజులైందికదూ—! అప్పుడప్పుడు మణి మీ గురించే చెప్పేది. మీ పనులు ఎలా సాగుతున్నాయి—?" అడిగాడు.

మనిషి తాగి వచ్చాడు. అతను మాట్లాడుతుంటే వాసన వేసింది. కండ్లు రక్తమై ఉన్నాయి. కొంచెం చలి చలిగాఉన్నా అతని నుదురంతా చెమట పట్టింది.

"ఒకరి ప్రమేయం లేనంతవరకు పనులు బాగానే సాగుతుంటాయి. మధ్యలో ఎవరైనా అడ్డు తగిలితే అది వేరే విషయం!" అందిమణి.

"ఎవరి గురించి మాట్లాడుతున్నావు మణీ నువ్వు? నేను వీరిని, మన చక్రవర్తిగారిని అడుగుతున్నాను—!" అంటూ వెకిలిగా నవ్వాడు నాయుడు.

మణి భర్తవైపు కోపంగా చూసింది.

"నీ కళ్ళు చాలా ఎర్రబడ్డాయి—! నీకు నిద్ర అవసరం. ఇప్పుడే వచ్చావనుకుంటాను. వెళ్ళి పడుకో!" నాయుడు కొంచెం వంగ్యమైన ధోరణితో అన్నాడు భార్యవైపు చూస్తూ.

ఒట్టిగానే ఇద్దరిమధ్య కొంతసేపు వాగ్వాదం జరిగింది. వారి అనవసరపు వాగ్వాదాలమధ్య నేను శ్రోతనయ్యాను.

"దురదృష్టమేమిటంటే మాకు కుటుంబ నియంత్రణ సూత్రాలను పాటించాల్సిన అవసరం కలగలేదు. మీనుంచి అలాంటి సహాయాన్ని పొందనందుకు, మీరు నమ్ముతారో లేదోగాని నాకు చాలా విచారంగా ఉంది!" కబుర్లలోకి దిగాడు నాయుడు నావైపు తిరిగి.

మణి లేచి లోపలి కెళ్ళిపోయింది ఆమె వెళ్ళిపోవడంతో నాయుడు కేమైందోగాని పక పక నవ్వటం మొదలెట్టాడు.

"ఇక మీరు నాకు శలవిప్పిస్తే—!" అంటూ లేచి నిల్చున్నాను నేను.

"అప్పుడే వెళ్తారేంటి—? ఆల్‌రైట్— మీ ఇష్టం. కాని మిమ్మల్ని నా కారులో డ్రాప్ చేస్తాను—ఇవ్వాళ!" అంటూ ఆనైట్ డ్రస్‌తోనే బైటి కొచ్చాడు నాయుడు—నాకు మాట్లాడటానికి ఎటువంటి అవకాశం ఇవ్వకుండా!

"కారు నాది పాతదే అయినా మిమ్మల్ని అయిదు నిమిషాల్లో మీ ఇంటి దగ్గర దిగబెడుతుంది. అడ్రస్ చెప్పండి" అంటూ స్టార్ట్ చేశాడు కారును.

"మీరు ఈ టర్నింగ్ అవతలున్న సెంటర్‌లో దిగబెట్టండి చాలు. ఆ తరువాత నేనే వెళ్తాను!" అన్నాను నేను.

"అలాగే—!" అంటూ కారును పోనిచ్చాడు.

కొంతదూరం పోయాక టర్న్ తిప్పుతూ— "గుడ్......అప్పుడే దగ్గర పడుతుంది. మీరుకి దిగిపోయేలోగా మీకో విషయం చెప్తాను. బహూశా ఇంతకు క్రితమే నా గురించి వినిఉంటారు మీరు అయినా బాధలేదు. ఇప్పుడు నేనూ చెప్తాను. నే నంత మంచివాడినికాదు ఎందుకని మీరు నన్ను అడగలేరు. అది కూడా నేనే చెప్తాను. త్రాగుబోతును ఎవరంటారు మంచివాడని—ఇప్పటికే నన్నుచూస్తే మీ కర్థమై పోయిందనుకుంటాను" అని కారును ఆపి "......ఇక దిగండి.... మర్యాదస్తుల సమయం కాదిది ఫ్రండ్స్‌తో తిరగటానికి. తిరిగి ఎప్పుడూ మా మణిని కలవకండి. అంతమంచిదికాదు. ఆ ఇంటి ఛాయలవైపు కూడా రారని నమ్ముతున్నాను. గుడ్‌నైట్—!" అంటూ ఆక్సిలేటర్‌ను గట్టిగా నొక్కాడు.

ఉలిక్కిపడ్డాను అతని మాటలకు. కాని అప్పటికే కారు నాకు చాలా దూరమైపోయింది. నిస్సహాయంగా చూస్తూ నిలబడిపోయాను."

"గ్రేట్ ఇంసల్ట్—ఆ వెధవను అలాగే వదిలేశావా—?" వెంకటాద్రి అరిచాడు కుర్చీలోంచి లేవబోతు.

"నేను అయితే అక్కడే వాడి అంతు తేల్చేవాడిని!" రాజా కూడా కోపం ప్రదర్శించాడు.

"నిజమే! కాని మీకు తెలుసు—నా కంతటి ఆవేశం లేదని" నచ్చచెప్పబోయాను.

"పూర్ ఫెలో! ఆడదానివై పుట్టినా బాగుండేది!" విచారం వెలిబుచ్చాడు శేషాచలం.

"ఆవేశపడ్డా, విచారపడ్డా ఇప్పుడేమీ లాభం లేదు. మీకు నేను నాలుగేండ్ల క్రితం జరిగిన సంఘటన చెప్తున్నాను. అంతేకాని నిన్న మొన్నటిదికాదు. నాకు ఇంకా మీరు కొంత అవకాశమిస్తే దీన్ని ఇవ్వాళ పూర్తి చేస్తాను" అన్నాడు చక్రవర్తి ఎంతో నెమ్మదిగా.

అందరూ మౌనం వహించారు తిరిగి మిగిలిన కథలోకి వచ్చి చెప్పటం ప్రారంభించాడు.

"అనవసరపు మనస్పర్థలు తెచ్చుకోవడం ఇష్టంలేక మణితో స్నేహం పెంచటం ప్రమాదానికి దారితీస్తుందేమోనని భయపడి ఆనాటినుంచి క్లబ్బు కెళ్ళడం మానేశాను. తిరిగి నా పాత అలవాట్లను క్రొత్త చేసుకున్నాను. మధ్య మధ్య వినాయకరావు నన్ను కదిలించటం మానలేదు. అయినా ఆరోగ్యం బాగులేదని, అర్జంట్ పనులున్నాయని తప్పుకునేవాడిని. అలా కొన్ని రోజులు గడిపాను. ఎంత మరచిపోవాలనుకున్నా మణి, నాయుడుల ప్రవర్తన, మాటలు మరచిపోలేకపోయాను. సుఖమైన నిద్ర కోసం పడ్డ బాధలు వర్ణించలేను. వాళ్ళిద్దరూ నాకో పెద్ద సమస్య అయి కూర్చున్నారు.

ఒకరోజు తిరిగి బజార్లో కనిపించింది మణి. తల వంచుకుని నడుస్తున్నాను. "హలో, బాగున్నారా?" అంటూ నా ఎదురుగ్గా వచ్చా రెవరో. ఎవరోకాదు ఆ గొంతు మణిది.

హృదయం గతుక్కుమంది. తలెత్తి చూశాను. సందేహంలేదు. మణి నా దారికి అడ్డంగా నిలబడుంది కాని విచిత్రమేమిటంటే ఆ ముఖంలో మునుపటి జీవంలేదు కండ్లలో కళలేదు. మనిషి కొంచెం బక్కచిక్కింది

"బాగున్నారా—?" తిరిగి అడిగిందామె.

ఎంతో బలవంతంమీద గొంతు పెగిలింది. "నాదేముంది లెండి ఎప్పటిలాగే ఉన్నాను. కాని మీరే చాలా మారిపోయారు" అన్నాను.




మా ఆవిడ నా నిద్రలో తెగమాట్లాడుతూందండీ...ఓసారి పరీక్ష చేయండీ

మణి నవ్వింది.

"క్లబ్బుకు రావడం మానేశారా—?" అడిగింది.

"అవును—!"

"కారణం చాలావరకు నేనే ననుకుంటాను—!" అంది మణి. అలా చెప్తున్నప్పుడు గొంతు జీర పోయింది. నావైపు చూడలేక తలవంచుకుంది.

"అంత మాట పట్టించుకోలేదు లెండి నాకు—!" అన్నాను మణికి నాయుడు అన్నమాటలు తెలుసు నని వూహించి.

మణి తలెత్తింది. 'నిజంగానా—' అన్నట్లు చూసింది.

"అవును—! అలా చూస్తారేం? నమ్మలేరా!" అన్నాను.

నవ్వింది. దిగులుగా నిట్టూర్చి—"అయితే ఇవ్వాళ్ళ నాతోపాటు రండి—మీకు చాలా విషయాలు చెప్పాలి" అంది.

"ఎక్కడికి—?" అడిగాను.

"ఏదైనా పార్కువైపు వెళ్దాం!"

ఆమె మాట్లాడుతుంటే వినాలని కుతూహలంగా ఉంది. అలాగైనా మనసు తేలికవుతుందని ఆశించాను. అందుకే ఆమె మాటల్ని కాదనలేక ఆమెతో బయలుదేరాను.

పార్కుకు చేరుకునేసరికి చీకటి పడింది. దీపాలు వెలిగాయి. మణి ఏం చెప్తుందో వినాలన్న కాంక్ష క్షణ క్షణానికి ఎక్కువ కాసాగింది. ఎలా చెప్పాలో, ఎలా మొదలుపెట్టాలో అర్థం కానట్లుంది మణికి చాలా సేపటివరకు మౌనంగానే కూర్చుంది. చివరికి బరువుగా నిట్టూర్చి—

"ఆరోజు వారేదో మిమ్మల్ని అన్నారట......" చెప్పలేక చెప్తూ ఆగిపోయింది.

నవ్వాను. నా నవ్వులోని అంతరార్థాన్ని తెలుసుకుంది కాబోలు తిరిగి చెప్పటం మొదలెట్టింది.

"మీరు బాధపడి ఉంటారు. నిజానికి అలా మాట్లాడినందుకు వారు కూడా విచారించారు నాతో చెప్తూ! వారు మైకంలో ఏదేదో అని ఉంటారు దానికి నన్ను క్షమించు బ్రదర్— ఇదంతా నా మూలకంగానే జరిగింది!" అంటూ కన్నీళ్లు కార్చింది చూడామణి

ఈసారి ఆమె సంబోధనకు చకితుడనయ్యాను. అప్పటికే ఏదో బరువు నానుంచి దించినట్లనిపించింది. ఆనందానందంలో మైమరచిన మనసు అనురాగపుటాకాశంలో విశ్రాంతిని పొందింది.

చూడామణి ఇంకా ఏదైనా చెప్తుందనుకున్నాను తన దాంపత్య జీవితంలోవున్న లోటుపాట్లను నాముందు వర్ణిస్తుందనుకున్నాను. కాని ఆమె అలా చేయలేదు. అంతకంటే ఇంకేమీ మాట్లాడలేదు. ఆమె దగ్గర కన్నీళ్లు తప్పితే ఇంకేమీ మిగల్లేదు.

"విచారపడకు అక్కయ్యా! నాకేమైందని?" అన్నాను.

మణి చటుక్కున తలెత్తింది. ఆమె కండ్లు ఆనందంతో మెరిశాయి. ఏదో చెప్పాలని, చెప్పలేక, గొంతు పెగలక మెల్లిగా నా చేతుల్ని తన చేతుల్లోకి తీసుకుంది.

"నేను ఇంకేం బాధపడను. ఇదంతా నాఅదృష్టం!" అంటూ నా చేతులతో తనే తన కన్నీళ్ళను తుడుచుకుంది.

పోతే ఆ సమయానికి నేనుగాని, మణిగాని వూహించలేని సంఘటన జరిగింది. నాయుడు మమ్మల్ని ఎక్కడ ఎప్పుడు చూశాడోకాని అక్కడ ప్రత్యక్షమయ్యాడు.

పూర్వంలాగే అతని కండ్లు రక్తంలో తడసి ఉన్నాయి. పిడికిలి బిగించి మా ఇద్దరివైపు చూశాడు.

"యూ......రోగ్!" అంటూ ఆమె మెడను తన రెండు చేతుల్లో బిగించాడు.

మణి కదల్లేదు పెనుగులాడనూలేదు.

"చంపేస్తాను......" అంటూ చేతుల్ని అంతకంతకూ బిగదీశాడు నాయుడు. నాముందు ఏం జరుగుతుందో కొంతసేపటివరకూ నాకేం కనిపించలేదు. అతను మణిని చంపేస్తాడేమోనని భయం వేసింది. ఆలస్యంచేస్తే లాభం లేదనుకుని గబుక్కున అతని చేతుల్ని పట్టి ఇవతలికి లాగాను.

నాయుడు చేతులు వదిలేసి వెనక్కు ఒరిగిపోయాడు. అప్పటికీ మణి కదల్లేదు. నా వైపు జాలిగా చూసింది.

వెనకకు తూలిన నాయుడు మళ్లీ ముందుకు రాలేదు. ఆలోచిస్తూ కూర్చున్నాడు కొంతసేపు.

"నువ్వెందుకు అడ్డొస్తావు చక్రవర్తీ—? వారి ఇష్టప్రకారమే జరగనివ్వు—" అంది మణి. అంటున్నప్పుడు ఆమె కండ్లలోంచి కన్నీళ్లు జల జల రాలాయి

నాయుడు దిగులుగా చూశాడు. అతని కండ్లలో కూడా నీళ్లొచ్చాయి. నాకు విచిత్రమనిపించింది.

"థ్యాంక్యూ— చక్రవర్తీ!" అంటూ అక్కడినుంచి లేచి వెళ్ళిపోయాడు. మణి కూడా లేచి నిల్చుంది. నావైపు చూస్తూ చేతులు జోడించింది. 'వస్తాను' అంటూ.

చూస్తూ కూర్చున్నాను ఈసారి ఇద్దరివైపు మణి నాయుడ్ని అనుసరించింది.

"మీరు చెప్పండిక. నాయుడు మణిని ఎందుకు చంపలేకపోయాడు!" అంటూ నలుగురివైపూ చూశాడు చక్రవర్తి. కాని ఎవరూ మాట్లాడలేదు.

చక్రవర్తి నవ్వి—"నే చెప్తాను—మణి అంటే నాయుడికి ఎక్కడలేని ప్రేమ.. మాట మాత్రం వాస్తవం అలాంటప్పుడు మణిని చంపటం అతని తరం కాదు. ఒకవేళ అనుకోకుండా అప్పుడా సమయంలో మణి మరణించినా దానికి బాధ్యుడు నాయుడుకాదు. ఎందుకంటే అతని ఉద్దేశం ఆమెను చంపాలనికాదు. కేవలం చంపుతానని భయపెట్టడమే. కాని న్యాయశాస్త్ర రీత్యా అతను దోషి కావలసి వస్తుంది. అది అతను భరించలేడు. బోన్ ఎక్కకముందే అతను చచ్చినా చావచ్చు. కనుక మణికి నాయుడువల్ల ఎలాంటి ప్రాణాపాయంలేదు. పోతే నాయుడికి కోపం వచ్చినప్పుడు—మణిని తనలో తనే చంపుకోవడం అలవాటు చేసుకున్నాడు. అందుకే ఇద్దరికీ మనశ్శాంతి లేకుండా పోయింది" అంటూ ముగించాడు చక్రవర్తి. ★

# అపస్వరం

మూలం త్రివేణి

అనువాదం శర్వాణి

### జరిగిన కథ

పసితనంలోనే కన్నవారికి దూరమైన మీర, పెదనాన్న కృష్ణయ్యగారింట్లో పెరిగి పెద్దదవుతుంది గోపీ అన్నయ్యలాగా తను కూడా డాక్టర్ చదవాలని కలలు కంటుంది కానీ ఆ కలలు ఫలించకుండా శాముతో మీర వివాహం జరిగిపోతుంది మనస్సులోని డాక్టరవాలన్న కోర్కె తను ఇంటర్ ఫస్ట్ క్లాసులో పాసయిందని తెలియగానే బలవత్తరమౌతుంది. ఆ కోర్కెను భర్తతో చెప్పినా ఫలితం లేనందున గతాన్ని కొంత మరవవచ్చుననే వూహతో పల్లెస్త్రీలకు విద్యాబోధన చేయాలని సంకల్పిస్తుంది కానీ, అదీ నెలరోజులైనా సరిగా నడవక మూలపడ్తుంది. మీరను చూడ్డానికి కొచ్చిన స్నేహితురాళ్లు పల్లె వాతావరణానికి మురిసిపోతారు. శాము ప్రవర్తన వలన మీరకు అతనిమీద విపరీతమైన ద్వేషభావం కలుగుతుంది. కాని అతనిలో కొంత మంచితనాన్ని కూడా చూస్తుంది మీర.

## 12

మీర బొట్టు పెట్టుకొని వంటింట్లోకి వచ్చింది. వెంకమ్మగారితో

"అరటికాయ చిప్స్ చేద్దాం. నేను తరిగిస్తాను" అంటూ అరటికాయలు, కత్తిపీట ముందేసుకొని కూర్చుంది చేతికి నూనె రాసుకుని అరటికాయ తొక్కు తీస్తుంటే మళ్ళీ కళ్ళు తిరిగాయి. చేతిలోని అరటికాయ క్రింద పడేసి మోకాలిమీద తల ఆన్చి కూర్చుంది. పొయ్యి మంట వేస్తున్న వెంకమ్మగారు,

"మీరా బొగ్గుల డబ్బా ఇలా ఇవ్వు?" అన్నారు. మీరనుండి బదులు రాకపోయేసరికి తిరిగి చూశారు.

"ఏమిటమ్మా, వేలు కోసుకున్నావా? అరటికాయ నేను తరుక్కుంటానుగాని లే" అన్నారు.

"లేదు"

"మరి అలా ఉన్నావేం?"

"ఎందుకో కళ్ళు తిరుగుతున్నాయి."

"అయితే వెళ్ళి కాస్సేపు పడుకో. శామణ్ణ వచ్చాక భోంచేద్దువుగాని."

మీర లేచి నుంచుని, "అరటికాయ పల్చగా తరిగి ఎర్రగా వేయించి ఉప్పూ కారం వేయండి. నాకు చాలా ఇష్టం." అని గదిలోకి వెళ్ళి కప్పుకుని పడుకుంది.

శాము వచ్చి దగ్గర కూర్చుని "మీరా, మీరా" అని తట్టిలేపినపుడే మెలకువ వచ్చింది.

"టైం ఎంతండి?"

"ఒకటిన్నర — భోంచేద్దాం పద ఇప్పుడెందుకూ పడుకున్నావ్? ఒంట్లో కులాసాగా ఉంది కదా?"

"ఊఁ. వూరికేనే పడుకున్నా."

ఇద్దరూ భోజనాలకు కూర్చున్నారు. శాము చిప్స్ ఓ ముక్క నోట్లో వేసుకొని, 'బ్రహ్మాండంగా ఉంది' అన్నాడు. మీరకు ఒక ముక్క నోట్లో వేసుకోగానే డోకొచ్చినట్టయింది. అసహ్యంతో ప్రక్కకు నెట్టింది.

"చిప్స్ సయించలేదా మీరా?"

"సయించకేం? ఈ రోజేమిటో ఒద్దనిపిస్తోంది" అంటూ చారన్నం కలిపి, సయించకపోయినా, బలవంతాన ఒక్కో మెతుకే తినసాగింది. వెంకమ్మగారు సందేహంతో మీర భోజనపు తీరును పరీక్షిస్తున్నారు. ఆమె అనుభవపు బుద్ధికి మీర అనారోగ్యపు కారణం ఇట్టే తెలిసి పోయింది. శాము లేచి వెళ్ళగానే,

"ఏమిటమ్మాయ్, ఏదీ సయించనట్టుందే?" అనడిగారు.

"ఎందుకో సయించటంలేదు."

"ఇష్టపడి చిప్స్ చేయించావు. మరి"

"అవును, కాని ఇప్పుడు తినబోతే డోకొస్తోంది."

"అన్నీ మంచి లక్షణాలు"

మీర ఆశ్చర్యంతో తలెత్తి చూసి "మంచి లక్షణాలా? అంటే .....?" అంది.

వెంకమ్మగారు అర్థ గర్భితంగా నవ్వి "ఎంత చదువుకుంటే ఏమిటి చెప్పు. మంచి లక్షణాలంటే నీకు అమ్మాయో, అబ్బాయో కలగ బోతున్నారన్నమాట." అన్నారు.

మీర కళ్ళు ఆశ్చర్యంతోనూ, భయంతోనూ పెద్దవయ్యాయి. అసలు సంగతి తెలుసుకొని కృంగిపోయింది. క్షీణకంఠంతో "ఇంత తొందరగా పిల్లలు కావాలని ఎవరేడ్చారో" అంది.

"మన మెవరమమ్మా కావాలీ, ఒద్దు, అనడానికి? దేవుడిస్తే వద్దనగలమా!"

ఇంత త్వరగా తల్లి కావాలన్న అపేక్షలేదు మీరకు. పెళ్ళయిన సంవత్సరం లోపుగానే పిల్లలెత్తుకున్న తన స్నేహితురాళ్ళను హాస్యం చేసి ఏడిపిస్తూండేది తను. అలాటి తనకే పెళ్ళయిన ఎనిమిది మాసాలలోనే తల్లి కాబోతున్న సూచనలు కనిపించి అధీరురాలయింది. మాతృత్వపు కాంక్ష ఆమెలో ఇంకా పొడ సూపనే లేదు. పిల్లలంటే స్త్రీలను స్వాతంత్ర్యం నుండి దూరంచేసే బంధనంగా అనిపించే దామెకు. పిల్లలకోసం, తీర్థయాత్రలూ, నాగ ప్రతిష్టలూ చేసేవారిని చూసి, "ఛా, బుద్ధిలేక పోతేసరి, వీరికి" అనుకునేది. చిన్నపిల్లలను ఎప్పుడూ ఎత్తుకుని లాలించి ఎరుగదు. పెదనాన్న ఇంటిలో అందరికన్నా తనే చిన్న. స్నేహితురాళ్ళ, చిన్నారి చెల్లెళ్ళనూ, తమ్ముళ్లనూ చూసినపుడు వూరికే వోసారి బుగ్గగిల్లి నవ్వించటం తోనే ఆమె ముచ్చట అఖరయ్యేది. గోపన్నయ్య కొడుకు మూడు నెలల కిశోరుని చూసిన గుర్తు బాగా ఉంది, మీరకు. ఎర్రగా మృదువుగాఉన్న శరీరం, ఇంకా ఆకారం రూపొందని మాంసపుముద్ద, ఆమెను ఆకర్షించలేదు. ఇప్పుడు తను తల్లి కాబోతున్న సంగతి ఆమెను బెదరిపోయేటట్టు చేసింది.

మీర శాముతో ఈ విషయం చెప్పలేదు 'నిజమవునో కాదో ఇంకా కొద్దిరోజులు చూద్దాం' అని వూరుకుంది. ఇంకోవారం గడిచేసరికి వేవిళ్ళ బాధతో సగమయింది మీర. తిన్న అన్నం దక్కేది కాదు. ఎక్కువ కాలం బయటే గడిపే శాముకు ఇదేం తెలియదు. కాని మీర చిక్కిపోతూండటం గమనించి అడిగినప్పుడు మీర లేని నవ్వు తెచ్చుకొని మాట మార్చేసేది.

ఒకరోజు శాము టిఫిన్ కొచ్చినప్పుడు వెంకమ్మగారు రాగి రొట్టె, వెన్న, చట్నీ, పళ్లెంలో అతని ముందుంచి అక్కడే నుంచున్నారు.

"మీర ఆరోగ్యం గురించి కాస్త శ్రద్ధ వహించాలి శామణ్ణా. ఆమెకు ఎందులోను కొదవ చేయకు."

శాము రొట్టెను ముక్కలు చేస్తూ,

"నే నడిగితే కులాసాగానే ఉన్నానని చెప్పిందే. ఆమెకు నే నెందులో కొదవ చేశా నత్తయ్యా?"

"అలా కాదయ్యా. మీర చాలా నీరసంగా ఉంది. పండితులకు చెప్పి ఏదైనా కషాయమో, లేహ్యమో చేయించి తెచ్చిపెట్టు. వంట్లో రక్తమే లేనట్టు తెల్లగా పాలిపోయింది."

"పండితులను పిలిపించేటంత ఆరోగ్యం బాగా లేదా?"

వెంకమ్మగారు నవ్వి, "చెబితేకాని తెలియదు కదా నీకు? నీకు వంశోద్ధారకుడు కలుగబోతున్నాడు. జాగ్రత్తగా చూసుకోవాలి మీరను" అన్నారు.

శాము మొహం సంతోషంతో ఇంతైంది. వూళ్లో పిల్లలందరిని దగ్గరకు తీసుకొని తినుబండారాలు పంచిపెట్టి ఆనందించేవాడు. వాళ్ళతో తనూ ఒకడై ఆడుకునేవాడు. ఇప్పుడు తను తండ్రి కాబోతున్నాడని తెలియగానే, అతని ఆనందానికి పట్ట పగ్గాలు లేకుండా పోయింది. కాఫీ ఒక గుక్కలో నోట్లో పోసుకుని,

"నిజంగా!" అన్నాడు.

"అవును నాయనా"

శాము లేచి నుంచుని "మీర ఏది?" అనడిగాడు.

"గదిలో ఉందేమో చూడు."

మీర గదిలో లేదు. శాము ఆమెను వెతుక్కుంటూ పెరటివేపు వెళ్ళాడు.

విశాలంగాఉన్న పెరట్లో కొబ్బరి, మామిడి చెట్లున్నాయి. మామిడిచెట్టు వెనక ఆకుపచ్చ వాయిల్, చీరకొంగు రెపరెపలాడుతూ, 'నువ్వు వెతుకుతున్న మనిషి ఇక్కడుంది' అని చెప్పింది.

శాము చప్పుడు చేయకుండా పిల్లిలా అడుగులు వేసుకుంటూ, ఆమె వెనుకనుండి ఆమెను సమీపించాడు. మామిడి చెట్టు మొదట్లో ఓ పుట్ట ఉంది. శాము చూస్తూండగానే మీర వంగి, పుట్టమీదనుండి ఓ మట్టిపెళ్ళ తీసుకుంది. తన అర చేతిలో పెళ్ళనుంచి, కుడిచేతి వేలితో నలిపి పొడి చేసింది. నోటితో వూది, మిగిలిన మెత్తటి మన్ను కాస్త నోటిలో వేసుకుంది.

"మీరా"

త్రుళ్ళిపడింది మీర. కుడి చేతిలోని మట్టిని దాచుకొని 'ఎవరూ' అంది.

"నేనే, ఏంచేస్తున్నా విక్కడ?"

మీర పాలిపోయిన బుగ్గలు ఎర్రబడ్డాయి.

"ఏంలేదు" అంది మెల్లిగా.

"ఏమిటి తింటున్నావు"

"ఏమీ లేదే!"

శాము ఆమె చేతిని పట్టుకొని మెల్లిగా వేళ్ళను విడిపించాడు. అర చేతిలోని మన్ను కనిపించింది. మీర సిగ్గుతో తల వంచుకుంది. శాము నవ్వి,

"ఈ మన్ను తింటున్నావన్నమాట! ఇలాటి కోర్కెలే అయితే సులభంగా తీర్చేయవచ్చునే!" అంటూ, కాస్త పెద్ద మట్టిపెళ్ళ తీసుకుని, పొడిచేసి, ఆమె ముందుంచి "తీసుకో" అన్నాడు.

"నాకేం వద్దు."

"ఇది నీ కిష్టమయిందే కదా?"

"అయితే ఈ మట్టి తినిపించటంలోనే నా కోర్కెలంతా తీర్చేస్తారన్నమాట"

శాము చేతిలోని మన్ను క్రింద పారవేసి ఆమె నడుముచుట్టూ చెయ్యివేసి,

"నారాణి ఏం కోరినా తెచ్చివ్వగలను. కాని వీలులేనిది మాత్రం కోర రాదు" అన్నాడు.

మీర తన నడుం మీద నుండి అతని చేతిని తీసి వేస్తూ, "ఎవరైనా చూడగలరు. కాస్త దూరంగా ఉండండి" అంది.

"చిత్తం. రాణిగారి ఆజ్ఞ."

"ఈ పుట్ట కొట్టించేసి, కాస్త ఇసుక తెప్పించి వేయించండి."

"పుట్ట కొట్టించేయనా! తరువాత నీ గతేమిటి?"

"నాకేం పరవాలేదు గాని, ముందు పుట్ట కొట్టించేయండి. లేకపోతే పామువచ్చి చేరుకో వచ్చు."

"అత్తయ్య రొట్టె చేశారు. చాలా బాగుంది. రుచి చూద్దుగాని రా."

"ఊహు, నా కది సయించదు."

"మరి నీకేం సయిస్తుంది. పోనీ నే నిచ్చే దేదో వద్దనకుండా తీసుకుంటావా?"

మీర తల అడ్డంగా వూపి "ఊహు మీ రిచ్చే దాంతో నా ఆకలి తీరదు. నాకు పళ్ళు తెప్పించి పెట్టండి" అంది.

లోపలికి వెళ్ళగానే "మీరు టిఫిన్ తినేసి రండి" అంది.

"ఊహు. నువ్వు వచ్చి అక్కడ కూర్చుంటే గాని నేను తినను" పసి పిల్లాడిలా మారాం చేశాడు శాము.

నిండు పున్నమినాడు వెన్నెల్లో భోంచేయా అని కోరింది మీర.

రాత్రి పదింటికి బండిలో చెరువు దగ్గరికి బయలుదేరారు. వెంకమ్మగారు 'బిసిబేళెహుళి' అన్నం, పెరుగన్నం, అప్పడాలు వడియాలు క్యారియర్లో సర్దిచ్చారు.

వీరు చెరువు దగ్గరికి చేరుకునే సరికి చంద్రుడు తూర్పువేపునుండి పైకి వస్తున్నాడు. నారింజ పండు వన్నెలోనున్న చంద్రుడు పైకి రాను రాను బంగారు చాయ దాలుస్తున్నాడు. నీలాకాశంలోని చంద్రుడి ప్రతిబింబం నీటిలో మెరుస్తోంది. అపుడపుడూ చెరువులో పడే గడ్డి పరకలవల్ల, పిల్ల తరంగాలులేచి చంద్రుని ప్రతిబింబం చెదిరి మళ్ళీ మామూలుగా కనిపిస్తోంది.

నింగడు ఎడ్లనువిప్పి వాటిముందు గడ్డి వడే శాడు. మీర క్యారియర్ మూత తీసింది. శాము ముందు అరిటాకువేసి, "నింగా, నువ్వూరా" అని పిలిచింది.

నింగడు సిగ్గుపడుతూ, "మీరు భోంచేయం డమ్మగోరూ. నేను ఆనక తింటాను" అనిదూరంగా వెళ్ళాడు. శాము మీర వేపు చూసి,

"నింగడు బుద్ధిమంతుడు" అన్నాడు.

ఇద్దరూ ఒకరి కొకరు బలవంతంచేసి వడ్డించు కుంటూ నెమ్మదిగా భోంచెయ్యసాగారు.

శాము కొంటెగా "నీకు అబ్బాయి కావాలా, అమ్మాయా?" అని అడిగాడు.

మీర విసుగ్గా "అసలు నాకు పిల్లలు కావాలని లేదు. ఇపుడిక ఏదైనా ఒకటే" అంది.

"నాకేమో అమ్మాయే కావాలనుంది. పిల్లలు లేక ఇల్లంతా బోసిపోయినట్టుంది. ఇక ఇల్లంతా కళకళలాడుతుంది. ఇంటినిండా పిల్లలుంటేనే బాగు. నంద గోకులంలా ఉండాలి."

"ఏం బాగో బాబూ. నా కేమిటో ఈసారికి ఈ గండం గడిస్తే చాలనిపిస్తోంది."

"నీకు ఒక బిడ్డ చాలంటావా మీరా?"

"ఒక బిడ్డ కావాలని కూడా కోరుకోలేదు. నేను ఇప్పుడు ఒక్క బిడ్డే చాలునని చెప్పక తప్పదు."

"నాకేమో ఆరుగురు అమ్మాయిలు, ముగ్గురు అబ్బాయిలు ఉండాలని కోరిక."

మీర అదిరిపడి, "అప్పటికి నా పని అయి పోయినట్టే." అంది.

శామూ, అర్థంకాక "ఏం నీకేం కష్టం?" అన్నాడు."

"నాకు కాకపోతే మరెవ్వరికి కష్టం? పిల్లలు ఆకాశంనుండి వూడి పడతారనుకొన్నారా? మగ వారికేం తెలుసు బిడ్డ విలువ? తొమ్మిది నెలలూ మోసి కనటం అంత తేలిక అనుకుంటున్నారా? ఒక్కొ బిడ్డకూ తల్లి, తన రక్త మాంసాలనే పంచాల్సి ఉంటుంది. ఒక్కొసారి ప్రాణాన్నే పణంగా పెట్టాల్సొంటుంది. తొమ్మిదిమంది పిల్లల్ని కనడమంటే నా సమాధి సిద్ధపర్చుకున్నట్టే."

శాము మృదువుగా అడిగాడు, "నీకు పిల్ల లంటే ఇష్టం లేదూ?"

మీర నెమ్మదిగా తల అడ్డంగా వూపుతూ, "ఊహు. నాకు పిల్లలంటే కొంచెం కూడా ఇష్టం లేదు" అంది.

శాము నోట మాట రాలేదు. పురుషుడైన తాను, పిల్లలకోసం తహతహలాడు తూండగా ప్రేమ



# అపస్మారం

మూర్తి స్త్రీ తన హృదయాంతరాళంలోని మాతృత్వాన్ని కాదని, 'నాకు పిల్లలువద్దు' అనటాన్ని విని తన చెవులను తనే నమ్మలేకపోయాడు.

మీర హృదయంలో మరో రకమైన పోరాటం జరుగుతోంది. ఆడదాన్ని పిల్లల్ని కనే యంత్రంగా మార్చివేసే మగవారి పశుత్వం ఆమెలో ద్వేషాన్ని రేకెత్తించింది. పురుషు డంటేనే ద్వేషమూ, తిరస్కారమూ ఏర్పడింది. భగవంతుడు ప్రతి ఒక్క మగవాడిని కూడా ప్రసవవేదనకు గురి చేస్తే అపుడైనా ఆడదాని కష్ట మెంతటిదో వారికి తెలిసి వస్తుందన్న తీరులో ఆలోచిస్తోంది మీర.

మీర పరధ్యానంలో అన్నం తినకుండా కూర్చోవటం చూసి శాము,

"భోంచేయి మీరా" అని హెచ్చరించాడు.

ఆరోజు భోజనాలు ఆ సమాధానంతోనే పూర్తయ్యాయి. పరస్పర భిన్నాభిప్రాయాలవల్ల ఆ చల్లటి వాతావరణం కూడా వేడెక్కింది

అప్పటినుండి శాముకు తాను 'అపరాధి' నన్న భావన పీడించసాగింది. తన ముద్దుల భార్యమీద ఆమె కక్కర్లేని బరువు మోపానన్న బాధతో క్రుంగిపోసాగాడు కాని, భావోద్వేగాల దాసుడైన శాము, ఏం చేయగలడు!!

మీర భోజన పానీయాల్లో ఏ విధమైన లోటూ రాకుండా చూసుకునేవాడు రోజూ సాయంత్రం ఇద్దరూ కాస్త దూరం షికారెళ్లేవారు. మరీ నీరసపడినప్పుడు పండితు లిచ్చిన కషాయం సేవించి తేరుకునేది మీర.

మీరకు మొదట్లో తల్లి కావాలన్న కోర్కె లేకపోయినా, మూడు నెలలు నిండి, తన గర్భంలో కదలిక కలుగ గానే ఒకవిధమైన మార్దవం, కోమల భావనలు హృదయాన్ని నింపివేసేయి. ఒక్కోసారి తన బిడ్డ ఎలా ఉంటుందోనన్న పిచ్చి ఆవేశంలో ఆ నిమిషమే తన బిడ్డను చూడాలన్న తీవ్రమైన ఆకాంక్ష కలిగి వెర్రిగా తహతహలాడిపోయేది.

వెంకమ్మగారి శుశ్రూషతో తన నెంతో శ్రద్ధాసక్తులతో చూసుకుంటున్న తన భర్త సాన్నిధ్యంలో ఆమె రోజులు నిర్విచారంగా దొర్లిపోతున్నాయి.

మీరకు అయిదు నెలలు నిండగానే కృష్ణయ్యగారు కూతురిని పురిటికి పంపవలసినదిగానూ, తీసుక పోవటానికి తాను వస్తూన్నట్టుగానూ ఉత్తరం రాశారు. పల్లెవాసంతో విసుగెత్తిపోయిన మీర సంతోషం అవధులు దాటింది. మీరను పంపించడానికి శాముకు కొంచం కూడా ఇష్టం లేదు. కాని తొలికాన్పవటంవల్ల, వైద్య సదుపాయాలులేని పల్లెలో వుంచుకొనే ధైర్యంలేక, ఆమె సౌఖ్యాన్ని గురించి ఆలోచించి, మైసూరు పంపించడానికే నిశ్చయించుకున్నాడు.

మీరకు పెద్దనాన్ననుచూసి, ఎన్నో యుగాలయినట్టుంది. ఆయన వచ్చేరోజున, ఎదురుచూస్తూ గుమ్మందగ్గరే నుంచుంది. దూరంలో బండి కనిపించగానే, గబగబా నడచివెళ్ళి, బండి వెనుక వేపుకువచ్చి, "పెదనాన్నా" అంది. అల్లుడితో

# పోటీలేనిది —

## నాణ్యతకైనా సరే, ధరకైనా సరే!



ఈ నేషనల్–ఎక్కో మాన్‌సూనైజ్డ్ రేడియోల యొక్క ధరలు, డిజైను, ప్రత్యేకాంశములు మరియు పనితనమును యితర రేడియోలతో పోల్చి చూడండి. నేషనల్-ఎక్కో రేడియోలే మీ డబ్బుకు తగిన విలువనిస్తాయని మీరే అంటారు. ఈ రేడియోలు ఉష్ణదేశములలో ఉపయోగమునకై ప్రత్యేకముగా తయారు చేయబడ్డాయి. వీటి భాగములకు ప్రత్యేకమైన రక్షణ యివ్వబడింది. కనుక యీ రేడియోలు పాడవకుండా ఏళ్ల తరబడి బాగుగా పనిచేస్తాయి. మీ దగ్గరలోనున్న నేషనల్–ఎక్కో డీలరువద్ద వీటిని నేడే వినండి!

**మోడలు 806:**
6 వాల్వులు. 3 వేవ్ బ్యాండులు.
సొగసైన కఱ్ఱ క్యాబినెట్. మోడలు యు-806 ఎసి/డిసి సెట్. మోడలు ఎ-806 ఎసి సెట్.
**రు. 396.00**

ధరలలో ఎక్సైజ్ డ్యూటీ చేర్చబడినది; పన్నులు అదనము

# నేషనల్ ఎక్కో

## మాన్‌సూనైజ్డ్ రేడియో







**మోడలు యు-819:**
ఎసి/డిసి. సెట్. 5 వాల్వులు. 3 వేవ్ బ్యాండులు. ప్లాస్టిక్ గ్రిల్‌గల సొగసైన బేక్‌లైట్ క్యాబినెట్.
**రు. 298.00**

**మోడలు ఎ-829:**
ఎసి సెట్. 6 వాల్వులు, 4 బ్యాండులు. అందమైన బేక్‌లైట్ క్యాబినెట్. పుష్‌బటన్ టోన్ కంట్రోలు. పియానో కీ స్విచింగ్.
**రు. 481.00**

**మోడలు ఎ-786:**
ఎసి సెట్. 6 వాల్వులు. 5 వేవ్ బ్యాండులు. అందమైన కఱ్ఱ క్యాబినెట్. రొటేటింగ్ ఫెరైట్ ఏరియల్. పియానో కీ స్విచింగ్.
**రు. 575.00**

**జెనరల్ రేడియో & అప్లయన్సెస్ లిమిటెడ్** బొంబాయి . కలకత్తా . పాట్నా . మద్రాసు . బెంగుళూరు . ఢిల్లీ . సికిందరాబాదు

మాటల్లోపడ్డ కృష్ణయ్యగారు మీర కంఠంవిని, "బండి ఆపవయ్యా" అని క్రిందికి దిగారు. శాము కూడా బండిదిగి, నింగడితో "నువ్వెళ్ళు. మేమొస్తాం" అన్నాడు.

కృష్ణయ్యగారు ప్రేమతో మీర తలనిమిరి, "చిక్కిపొయ్యా వేమిటమ్మా" అన్నారు.

"లేదు పెదనాన్నా, చిక్కి పోవటానికి, నాకేం?"

మొదట చిన్న పిల్లలా గెంతుతూ, నడకే తెలియనట్టున్న మీర, ఇప్పుడు నిండుగా, స్త్రీత్వాన్ని నింపుకుని, గంభీరంగా అడుగులు వేస్తోంది. గులాబి రంగు చీరలో, గులాబిపువ్వులా తమకెదురుగా వచ్చిన కుమార్తె పరిపూర్ణ సౌందర్యాన్ని చూసి, సంతోషమూ, గర్వమూ కలిగాయి, ఆయనకు. మీర అడుగుతున్న వంద ప్రశ్నలకూ నవ్వుతో బదులు చెప్పుతూ నడవసాగారు.

కృష్ణయ్యగారు వచ్చిన మరుసటిరోజే, మీరని తీసుకుని బయలుదేరాలను కున్నారు. కాని శాము బలవంతంవల్ల రెండురోజు లాగక తప్పలేదు. లక్ష్మి నిలయమైన శాము ఇంటినిచూసి, మీర అదృష్టానికి ఎంతో సంతోషించారాయన.

ప్రయాణానికి ముందురోజున కృష్ణయ్యగారికి విందు చేశారు. మీర తన సామాన్లు సర్దుకోవటం పూర్తయింది. రాత్రి వరండాలో కూర్చొని శాము, కృష్ణయ్యగారూ, మీరా కబుర్లోపడ్డారు.

కృష్ణయ్యగారు "నామాటవిని,నువ్వూరారాదటయ్యా శామణ్ణా రెండురోజులుండి తిరిగి రావచ్చు" అన్నారు. మీర శామువేపు సాభిప్రాయంగా చూసింది.

"లేదు మామయ్యా. నేనిప్పుడు రాలేను. మరోసారెప్పుడయినా వస్తాను."

"గోవిందు పెళ్ళికి ఎల్లాగూ రావాలనుకో. వచ్చేనెల మొదటివారంలోనే పెళ్ళి."

"ఏవూరమ్మాయి?"

"మైసూరే— ఇంటర్ పాసైంది. బెంగుళూరులో హోటల్ భోజనంతో విసుగెత్తింది, గోవిందుకి. బోంబాయి నుండి గోపాల్ కూడా వస్తున్నాడు, పెళ్ళికి."

"రాధవదిన వచ్చిందా, పెదనాన్నా?"

"ఊఁ. సుబ్బారావుగారే వెళ్ళి తీసుకొచ్చారు. ఇప్పుడు పురుటి రోజులు."

"కిశోర్ ఎల్లావున్నాడు?"

"వాడికేం! పైల్వానులా వున్నాడు. ఒక్కటే అల్లరి 'తాత' అంటూ భుజమెక్కి కూర్చున్నాడంటే ఇక ఒక పట్టాన దిగడు. శామణ్ణా, నువ్వొస్తే బాగుంటుందయ్యా"

శాము సంకోచంతో "మీరు మరోలా అనుకోకండి మావయ్యా. ఇప్పుడు రాలేను. గోవిందు పెళ్ళికి తప్పక వస్తాను." అన్నాడు.

మీర ఆవలించింది. కృష్ణయ్యగారు అది గమనించి, "వెళ్ళమ్మా పడుకో నాకూ నిద్రొస్తూంది పడుకుంటా నిహ" అన్నారు.

రాత్రి చాలా సేపటివరకూ భార్యా భర్తలు కబుర్లు చెప్పుకుంటూ గడిపారు. పల్లె జీవితం ఎంత విసుగు తెప్పించినా తనకూ భర్తకూ మధ్య ఎన్నో భిన్నాభిప్రాయాలున్నా, ఇప్పుడు తను ఇంచుమించు ఏ సంవత్సరంపాటు భర్తను వదలి ఉండాలంటే బాధగానే ఉందామెకు. భర్త కౌగిలిలో ప్రాపును విమురుతూ,

## అపస్వరం

"ఆదివారం తప్పకుండా తలంటు పోసుకోండి. లేకపోతే మళ్ళీ తల నొప్పి, కళ్ళు మంటలూ అని బాధ పడతారు. రాత్రి పాలు త్రాగటం మరచి పోకండి . ."

శాము మధ్యలోనే నవ్వి, "మీరా ఇవన్ని గుర్తుంచుకోలేను నేను. కాగితంలో వ్రాసి ఉంచు" అన్నాడు.

మీర తన చేతిలోవున్న అతని జుత్తును లాగి, "తమాషాగా ఉందా, మీకు? నిజంగా చెపుతున్నాను నేను" అంది.

"సరే నువ్వు చెప్పిందంతా గుర్తుంచుకుంటాను. కాని నే నొక టడుగుతాను. చెప్తుతావా?"

"అడగండి"

"మీరా నీకు నిజంగా పిల్లలు కావాలని లేదా?"

మీర వెంటనే బదులు చెప్పలేకపోయింది. తనకు కడుపు వచ్చిన మొదట్లో బిడ్డ వద్దనిపించినా, పేగుల్లోని బిడ్డ పెరుగుతున్నకొద్దీ తనకు తెలియకుండానే తన బిడ్డను ప్రేమించ సాగింది మీర.

"పిల్లలంటే నాకు ద్వేషమేమీ లేదు."

శాము మీర రెండు చేతులనూ తన చేతుల్లోకి తీసుకొని, "నువ్వు అలాంటి వ్యథ మనసులో పెట్టుకోకు. మనోరోగాన్ని మించిన జబ్బు వేరే ఉండదు. నాకోసం, నీకోసం, మన బిడ్డల కోసం, నీ ఆరోగ్యాన్ని జాగ్రత్తగా కాపాడుకో. డబ్బు కావాల్సినపుడు రాయి. ఏం కావాలన్నా తెప్పించుకో. నాకుమాత్రం వారానికో ఉత్తరం రాయటం మరచి పోకు....."

ఏ ఏ కారణాలచేతనైతేనేమి, దూరంగా ఉండిపోయిన రెండు హృదయాలూ, వాళ్ళ జీవితంలో ప్రవేశించనున్న నూతన శిశువువల్ల దగ్గరగా వచ్చాయి.

మీర వచ్చిందన్న వార్త వినగానే, రాజా, చంపా, నర్మదా ఆమెను చూడటానికి ఆత్రుతతో వచ్చారు.

"కంగ్రాటులేట్స్ మీరా"

"చాల్లే. హాస్యం చేయక్కర్లా"

"అన్ని పదవులకన్నా గొప్ప పదవి, మాతృత్వం పొందబోతున్నావు. నీ కింకా ఏం కావాలి?"

"ఛ! వూరుకోమంటూంటే. నర్మదా, రాధ వదిన ఎలా ఉన్నారు?"

"నీలాగే ఉంది. కాని బయటికి వచ్చే స్థితిలో లేదు. రేపు నువ్వేరా చూద్దూగాని."

"అలాగే. కిశోర్ ఎలా ఉన్నాడు?"

"రాజాలా ఉన్నాడు. నాకేమో పరీక్షలాయె. ఒక్క నిమిషం చదువుకో నివ్వడు."

"ఓహో మీ కందరికీ పరీక్ష లొచ్చాయి కదూ?"

అలా అంటున్నపుడు మీర కంఠం వణికింది. తనూ మెడికల్ కాలేజీలో చేరిఉంటే?. ...... ఈపాటికి హాయిగా చదువు గొడవల్లో పడి ఉండేది. మీరకు శాముమీద, తనమీద, తనను సృష్టించిన బ్రహ్మమీదా కోపం ముంచుకొచ్చింది.

నర్మదనూ, రాధ వదిననూ చూడటానికి వాళ్ళింటికి వెళ్ళాలనుకుంది మీర. (సశేషం)







# మేలైనవాటినే కోరేవారు ఎల్లప్పుడూ బ్రూక్ బాండ్ టీనే ఎందుకు కావాలంటారో ?

టీ త్రాగే చాలామందిని అది బాగుందని మెప్పించడం, సంతృప్తి పరచడం అంత సులభం కాదని బ్రూక్ బాండ్ వారికి ఎప్పుడో తెలుసు. అంటే రుచి, సువాసన, చిక్కదనం కూడినట్లుండాలి. అందుకే బ్రూక్ బాండ్ వారు టీ బ్లెండింగును ఓ కళగా భావించి గత 60-ఏండ్లుగా బహు నేర్పుతో చేస్తున్నారు.

మీకు పూర్తి సంతృప్తినిచ్చే బ్లెండు ఇవ్వడానికి బ్రూక్ బాండ్ వారి టీ టేస్టర్లు రోజూ 800 పైచిలుకు రకరకాల తేయాకును మాదిరి చూస్తారు. కొన్ని రకాలు చిక్కదనాన్నిస్తే, మరికొన్ని సువాసన నిస్తాయి. అన్నీ కలిసి మీకు సంతృప్తినిచ్చే కమ్మని టీ నిస్తాయి.

బ్రూక్ బాండ్ నిపుణులు సాటిలేనివారి నేర్పు, అనుభవాలతో టీలను బ్లెండు చేస్తారు గనుకనే మీకు నచ్చిన బ్రూక్ బాండ్ బ్లెండు తిరుగులేని సువాసన, కమ్మదనాలతో ఎప్పుడంటే అప్పుడు లభిస్తుంది. బ్రూక్ బాండ్ అంటే పరిశుద్ధమైన సాటిలేని తాజా టీ అని హామీ. ఏమంటే అది ఆరోగ్యప్రదమగు రీతిని గాలి చొరలేని డబ్బాలలో ప్యాకెట్లలో మీకు లభిస్తోంది.

మిమ్మల్ని సంతృప్తిపరచడం ఎంత కష్టమో తెల్సా? ఆ కష్ట నిష్ఠూరాలు, కిటుకు బ్రూక్ బాండ్ కే తెలుసు. నిత్యావసరాలకు మేలైనవే కొని వాడే మీలాంటి అనేకమందికోసం బ్రూక్ బాండ్ వారు టీలను బ్లెండు చేస్తున్నారు.




AVT/60 2357



నీకు తెలీకపోతే తెలీదని అఘోరించ[illegible]యినావా! అసల్నాతో ఎందుకు చెప్పలేదు నువ్వు...."

"చిత్తం. తమతో మనవి చేసుకుందాం అనుకున్నాను. కాని ప్రొద్దుటే తమరు గుడికివెళ్లేటప్పుడు అడిగితే బాగుండదని వూరుకున్నాను.....అమ్మగారు పూజలో ఉండిపోయినారు....ఏం చేయాలో తెలీక మధన పడుతుంటే గుండుమణి అయ్యోరేమో నే చెప్తా చెయ్యి అన్నాడు. ...రక్షించావురా నాయనా అనుకుని వాడు చెప్పినట్టల్లా ముక్కులు మూసుకుని చేశాను.......పెద్దవాణ్ణి......" వంటవాడి కండ్లల్లో నీళ్లు తిరిగాయి పాపం.....

"హారి దొంగభడవా!......అసలేడీ? ఆ మసాలా వెధవ!......" అంటూ గుండుమణిని వెతుక్కుంటూ పెరట్లోకి వెళ్లారు మా అత్తగారు.

వంటవాణ్ణిచూస్తే జాలేసింది.....

"అసలు వాడెట్లా చెయ్యమని చెప్పాడు" అని అడిగాను.

వంటవాడు కండ్లు తుడుచుకుంటూ చెప్పుకొచ్చాడు.

"ఒరే అబ్బి నాకా బాదముక్రీరు చేయడం రాదు. నీకేమైనా వచ్చునా అని అడిగాను..... ఓ అదేం పెద్ద కష్టంగాదు.....రెండు ఉల్లిగడ్డలూ రెండు వెల్లుల్లిగడ్డలూ తరిగి పెట్టుకో... బాదంపప్పూ, ఆ ఉల్లిగడ్డల ముక్కలూ పచ్చిమిరపకాయలూ అల్లం, చెక్కా, లవంగం, యాలక్కాయలూ కాస్త ఇంగువ చేర్చి మెత్తగా రుబ్బు.. ఒక శేరు పాలలో కొద్దిగా పెరుగు కలిపి పొయిమీద బాగా మరగనిచ్చి, ఈ మసాలా ముద్దను మరిగే పెరుగు పాలల్లో కలిపేసెయ్....చివర్లో కాస్త పన్నీరు పోసెయ్. 'క్రీర్ క్రీర్' అని గిన్నెలోంచి శబ్దం వస్తుంది......దించెయ్.....అదే బాదంక్రీరు......" అంటూ ఆ పని వెధవ వంటవాడికి కీరు చేసే విధానం విశదీకరించాట్ట... పాపం వాడు చెప్పింది తు. చ. తప్పకుండా భక్తిగా చేశాడు చాదస్తుడు ...

మా అత్తగారికి పనివాడు కనిపించలా. ఎక్కడో దాక్కున్నాడు..... పన్నీరు పప్పు పెట్టి వంటవాణ్ణి వెనకేసుకొచ్చినందుకు వాడు కావాలని చేశాడు...

"ఆ మసాలా వెధవెక్కడా కనిపించలా... రానీ చెప్తా" అంటూ కాళ్లూ చేతులూ కడుక్కొచ్చి భోజనానికి కూర్చున్నారు. ఈలోపుగానే ఆ మసాలా గిన్నె పెరట్లో అంట్లల్లో పడేయించాను ..

భోంచేసి హాల్లో కొచ్చి కూర్చున్నాం. మా అత్తగారూ నేనూ. . ఉన్నట్టుండి పెరట్లోంచి ఏదో గోల బయల్దేరింది.

## అత్తగారూ - పనివాళ్లూ

11 వ పేజీ తరువాయి

పనివాళ్లు దెబ్బలాడుకుంటున్న అరుపులు వినిపించాయి.........

మా అత్తగారు ఖంగారుపడుతూ పెరటివేపుకు పరుగెత్తారు. నేనూ ఆమె వెనకాలే వెళ్లాను.

పనిమనిషి ఎల్లమ్మ అంట్లన్నీ ముందేసుకుని కొళాయి తిప్పితే నీళ్లు రాలేదట..... పక్కనే వున్న భావిలోంచి రెండు బిందెలు నీళ్లు తోడియ్యమని గొడ్లపనివాడు సుబ్రమణిని అడిగిందట. అటువంటి సమయంకోసమే కాచుకొనున్న ఆ కొంటె వెధవ భావిలోనుంచి నీళ్ళు తోడి తెచ్చినవాడు వూరికే ఇవ్వక కాసిని నీళ్ళు ఆ పనిమనిషి ఒంటిమీద పడేట్టు చేయి విదిల్చాట్ట.... .తక్షణం వాడిమీద గజ్జలగుర్రంలా విరుచుకుపడ్డది ఎల్లమ్మ.

వాడదేం లక్ష్యం చేయకుండా నవ్వుకుంటూ మామిడి చెట్టుకింద తన పని తను చూసుకుంటున్నాడు.

"నవ్వుతావేంరా నడమంత్రపు గాడిద!...... సిగ్గు లేకుండా ఇవేం పన్లురా!.....ఆంబోతులా వూరుమీద పడితే వూరుకుంటారనుకున్నావా!..... ఎముకలు విరగ్గొడతారు......పాపం దానిపనేమిటో అదేమిటో........ఒకళ్ల జోలి దాని కక్కర్లేదు......నిప్పులాంటి పిల్ల.....నీకేం పోయేకాలంరా దాని జోలికిపోయావ్!....."అంటూ మా అత్తగారు చీవాట్లు పెడుతూంటే సుబ్రమణి బ్రేండో స్టయిల్లో నవ్వాడు......వాడు మేర్లోన్ బ్రేండోలా ఉంటాడని మావాడు, వాడిని 'బ్రేండో' అని పిలుస్తుంటాడు.....

"అది నిప్పుగాదు పెద్దమ్మా....ఒట్టి పప్పు అదంతా పైకే.....దాని కంతా ఉందిలెండి యవారం" అంటూ ఈలేస్తూ కొంటెగా ఎల్లమ్మవైపు చూశాడు..... అది కూడా వాణ్ణోక వోరచూపు చూసి ఏమీ ఎరగనట్టు తన పని తను చూసుకోడం మొదలెట్టింది.....

ఎల్లమ్మ పనిలో చేరాక నే నెప్పుడూ దాన్ని పరీక్షగా చూళ్లేదు. చామనచాయగావున్నా చిలకలా అందంగానే ఉంది ... అంతవరకూ అఘాయిత్యంగా కేక లేసిందేగాని దాని ముఖంలో కోపంగానీ, అవమానంగానీ మచ్చుకైనా కనిపించలా......

"ఎల్లమ్మా!...."అంటూ పొలికేక వినిపించింది... వెనక్కి తిరిగిచూశాం.....దాని మొగుడు ..మా పక్కింట్లోనే వాడు వంచేసేది....మా పెరట్లో ఏం గొడవ జరిగినా పిట్టగోడ మీదనుంచి వాడు చూస్తుంటాడు......జరిగిందంతా చూశాడో ఏమో కోపంతో బుసలు కొటుతూవచ్చి నిలబడ్డాడు.... ఎర్రగావున్న వాడి కండ్లు సుబ్రమణిమీద నిప్పులు కక్కుతున్నాయి ....

మా అత్తగారికి ఒణుకు పట్టుకొంది... గబగబ నా దగ్గిరికి పరుగెత్తుకొచ్చారు.

"ఒసేవ్ వీళ్లు కొట్టుకు చచ్చేట్లున్నారు.... పోలీసుల్దాకా పోకముందే ఆ పోకిరీ వెధవనీ, దాన్నీ పంపించేద్దాం ... అంట్లు కావాలంటే నేనూ, వెంగళం తోముతాం..."అంటూ గాభరాపడిపోయారు.

"ఏంటే! ఏం జరిగింది! నీమీద నీళ్లు బోశాడా వాడు?...చెప్పు....యిప్పుడే వాణ్ణి నరికి పోగులేస్తాను..." అని గట్టిగా అరిచాడు ఎల్లమ్మ మొగుడు... వాడి చేతులో కొడవలిగూడా ఉంది...

"ఓయమ్మ ఏమిటే యీ పీడా..."అంటూ గజగజ లాడుతున్న మా అత్తగారు నా చెయ్యి గట్టిగా పట్టుకున్నారు.

సుబ్రమణి నిర్లక్ష్యంగా యీలేసుకుంటూ పని చేస్తున్నాడు.

ఎల్లమ్మ ఏం జెప్తుందోనని అందరం ఆదుర్దాగా ఎదురు చూశాం.

ఏమీ ఎరగని నంగనాచిలా, "ఏంటి మావా!.... నీళ్లేంటి!....ఎవరు బోశారూ!...."అంటూ ఎదురు ప్రశ్నేసింది మొగుణ్ణి....

"హారి దీని తస్సాదియ్యా....విన్నావంటే!....." అంటూ నా చెవు దగ్గిర గొణిగారు మా అత్తగారు.

"నిజం చెప్పు!.....వాడు నీళ్లు పోశాడా లేదా"

"అబ్బే లేదు మావా!.....ఆ యబ్బి నా వూసుకే రాడు......కొళాయిలో నీళ్లు రాలేదంటే బాంలో నీళ్లు తెచ్చిచ్చాడు.....అంతే. ఇంకా ఎప్పుడైనా ఈ



వంటాయనే నా ఆరటమెరు చెయ్యాన్హాడు పాతా వస్తా'' .. అంటూ యాభై అయిదేండ్ల తిరువేంగళాచారిమీదికి తిప్పింది కథంతా.

''శ్రీహరీ! పాపము శమించుగాక .''అంటూ చెవులు మూసుకున్నాడు వెంగళాచారి . .

''హవురా! హవురా! . ఏం కైకవే! . ఏం కైకవే! .. .'' అంటూ ఎల్లమ్మమొగుడు చూడకుండా గుండెలు బాదుకున్నారు మా అత్తగారు.

ఎల్లమ్మ మొగుడు వంటవాడివైపు భయంకరంగా చూశాడు .

''ఏం వంటాయనా ప్రాణాలమీద ఆశ ోదులుకున్నావా! ....'' అంటూ ముందు కొచ్చాడు . . .

వంటవాడి పై ప్రాణాలు పైన్నేపోయాయి.

''హా శ్రీనివాసా! ఏమిటీ అభాండం! .. ఏనాడో స్వసుఖములను త్యజించి, శరీర సౌఖ్యములను మరచి, వంట చెరుకుల్లో వంట చెరుకువలే సదా అగ్నిహోత్రం దగ్గిర అలమటించే నాకా ఈ అపవాదు. . ..''అంటూ వాపోయాడు వంటవాడు

మలేరియా వచ్చిన వాడికిమల్లే భయంతో వంటవాడు ఒణకడంచూసి గొడ్లను కడుగుతున్న సుబ్రమణీ, తలుపుచాటున నిలబడి తమాషాచూస్తున్న గుండుమణీ, పడీ పడీ నవ్వడం మొదలెట్టారు.

''ఎల్లమ్మ చెప్పింది నిజమే యీ వంటాయన ఎల్లమ్మంటే పడి చస్తాడు .ఎందుకు రోజూ గిన్నెల గిన్నెలు అన్నం, పులుసూ, కూర్లూ పెద్దమ్మగారికి తెలీకుండా దొంగచాటుగా ఎల్లమ్మకిస్తుంటాడు'' అని చెప్పాడు గుండుమణి.

ఒక్కక్షణం అనుమాన మేఘం మా అత్తగారి ముఖాన్ని ఆవరించింది

అది చూసిన వంటవాడు ఖంగారుపడిపోతూ మా అత్తగారిముందు చేతులు జోడించి, ''అమ్మా మీరు నన్ను సందేహిస్తున్నారా! దండించినా, ఖండించినా పెద్దవారు. కాదనను ఒక్కటి రెండుసార్లు మిగిలిపోయిన పదార్థాలు ఎక్కువగానే ఇవ్వడం జరిగింది .కావాలని ఇవ్వలేదు .. ఇది ఆ కుర్రవాడి కల్పన నామీద ఉండే ద్వేషం వల్ల చెబుతున్నాడు వృద్ధిలోకి రావలసినవాడు . . పెద్దవాళ్లే నామీద ఇటువంటి అబాండం వెయ్య తగునా!.......ఏనాడో స్వసుఖాలను త్యజించి, శరీర సౌఖ్యాలను మరచి ''

''అబ్బబ్బ ఆపవయ్యా నీ అష్టోత్తరం అసలు పిన్నడక్కుండా మిగిలినవైనా సరే నిన్నెవరిమ్మన్నారు దానికి!.... '' యీ ప్రశ్నకు ఉక్కిరి బిక్కిరయ్యాడు వంటవాడు.

''అయ్యో పెద్దమ్మగారూ ... చాలాసార్లు బియ్యం, పప్పూ, చక్కెర, నెయ్యి, మానె ఒక ఓంటిలెండి శానా ఇచ్చాడు మీకు తెలీకుండా .. తనెన్నిసార్లు కాఫీ తాగితే ఎల్లమ్మ కన్నిసార్లు ఇయ్యాల్సిందే ... ఒకసారి మీరు పాలడిగితే లేవన్నాడు. ఆరోజు ఈళ్ళిద్దరూ ఆరుసార్లు తాగారు కాఫీ. నే నెప్పుడన్నా రెండోసారి కాఫీ అడిగితే కసిరి కొడతాడు.. ..''

''ఒకసారి సినిమా కెళ్దాంధా అని గూడా పిల్చా

# అత్తగారూ - పనివాళ్లూ

డంట ఎల్లమ్మని ... .కదెల్లమ్మా! ...'' అని అడిగాడు గుండుమణి ..

''అవును'' అంది నంగనాచిలా బుంగమూతి పెట్టి ఎల్లమ్మ

ఆ మాట విన్న ఎల్లమ్మ మొగుడికి ఎక్కడలేని ఆవేశం వచ్చి కొడవలి తీసుకుని వంటవాడిమీదికి దూకాడు. .



''శ్రీనివాసా! .''అంటూ ఒక్కవెర్రికేకపెట్టాడు వెంగళాచారి. మరుక్షణం సుబ్రమణీ, గుండుమణీ ఒచ్చి అడ్డుపడి ఆపారు

ఇదే సమయమని వంటవాడు పూజగదిలోకి పరుగెత్తి తలుపులు మూసుకున్నాడు సుబ్రమణీ, గుండుమణీ, ఎల్లమ్మ మొగుణ్ణి పట్టుకోనుండడం చూసి మా అత్తగారు కాస్త ధైర్యం తెచ్చుకున్నారు

''ఒరే అబ్బి! ఏమిట్రా నీ దౌర్జన్యం! .. నీ పెళ్లాన్ని అదుపులో పెట్టుకోలేక కొడవళ్లూ కత్తులూ తీసుకుని వూళ్లో వాళ్ళమీదికిపోతే వూరుకుంటారా! పోలీసులకి పట్టిస్తారు . . దాని పనీ ఒద్దు పాడూ వద్దు ముందు నీ పెళ్లాన్ని తీసుకుని బయటికి నడు. అది ఎక్కడుంటే అక్కడ నిప్పులేకుండా అంటుకుంటాయి కొంపలు

ఊఁ నడవండి బయటికి . అంటూ ఎల్లమ్మనీ దాని మొగుణ్ణీ తరమడం మొదలెట్టారు

''ఏదశ. ఎందుకులేని ఇడిసిపెట్టు'' అంటూ గుడ్లురిమిచూశాడు సుబ్రమణిని ఎల్లమ్మమొగుడు.

''ఏంజేసేడ్డివేంటి! '' అన్నాడు సుబ్రమణి.

'' ఏంజేస్తావోన్నా! '' అంటూ కొడవలి చూపించాడు ఎల్లమ్మ మొగుడు. మళ్లీ కథ పెరుగుతోందని మా అత్తగారు ఖంగారు పడ్డారు.

''పదండి పదండి బయటికెళ్ళి కొట్టుకు చావండి'' అంటూ మళ్లీ తరమడం మొదలెట్టారు.

''గడ్డికోసే కొడవలి జూపితే బయపట్టానికి నేను వంటయ్యోర్నిగాదు—'' అన్నాడు సుబ్రమణి.

''గడ్డి కోసేదా నీ పీక్కోసేదా'' అంటూ సుబ్రమణి మీదికి దూకాడు ఎల్లమ్మ మొగుడు.

అంతవరకూ ఏమీ ఎరగని దానిలా నిలబడి చూస్తున్న ఎల్లమ్మ కెక్కణ్ణుంచొచ్చిందో బలం ''ఒద్దు మావా ... . ఒద్దు'' ..... అంటూ అంత మగాణ్ణీ వాటేసుకుని ఆపింది.

సుబ్రమణి మళ్లీ ట్రేండో స్టయిల్లో నవ్వేసి ఈలేసుకుంటూ గొడ్ల దగ్గిరి కెళ్ళిపోయాడు. ''రాసే'' అంటూ పెళ్లాం చేయి బట్టుకుని లాక్కెళ్లాడు వెనక్కి తిరిగి తిరిగి చూస్తూ వెళ్లింది ఎల్లమ్మ.

ఎల్లమ్మ పోగానే మా అత్తగారు కాస్త తెప్పరిల్లి ''అదికాదే! చూశావా దా నఘాయిత్యం!.. .'' అన్నారు.

''అసలు ఎల్లమ్మకి సుబ్రమణి అంటే శానా ఇష్టం అమ్మగారూ'' అన్నాడు ముసి ముసి నవ్వులు నవ్వుతూ గుండుమణి

''సరి నీ యిష్టం ముదనష్టంగానూ అది ఎంతయినా జేస్తుంది అన్యాయంగా ఆ వంట వెధవమీద పడ్డదే పాపం అసలేడీ వాడూ! . '' అంటూ వంటవాడికోసం నాలుగు వేపులా చూశారు మా అత్తగారు.

''పూజ గదిలో దాక్కున్నాడమ్మగారూ '' అన్నాడు గుండుమణి నవ్వుతూ.

మా అత్తగారెళ్లి, పూజ గది తలుపు నెట్టారు.

దేవుడిముందు సాష్టాంగపడివున్న వంటవాడు ఒక్కసారి తుళ్లిపడి, ''శ్రీనివాసా రక్షించు'' అంటూ అరిచాడు—మళ్ళి ఎల్లమ్మ మొగుడే వచ్చాడని . ... మా అత్తగారికీ నాకూ నవ్వాగలేదు ''నేనయ్యా నీ భయం మండిపోను అయినా, దానికి అన్నిసార్లు కాఫీయిచ్చిగొంతుమీదికి తెచ్చుకున్నావ్ చూశావా!. . '' అన్నారు ఏడిపించడానికి మా అత్తగారు . వంటవాడు చివాల్న లేచి మళ్లీ మా అత్తగారిముందు సాష్టాంగపడి లెంప లేసుకుంటూ.

''అమ్మా మీరూ నన్ను అపార్థం చేసుకున్నారా! .. ఏనాడో స్వసుఖాలను త్యజించి, శరీర సౌఖ్యాలను మరచి వంట చెరుకుల్లో వంట చెరుకువలె ''

''అబ్బబ్బ! ఆపవయ్యా ఎగతాళి కన్నానులె కాఫీ వేళయింది''—అంటూ ఆ రోజంతా పనిమనిషినీ, దాని మొగుణ్ణి తిడుతూనే ఉన్నారు మా అత్తగారు.

మర్నాడు మామూలుగాతెల్లారుగట్ల వచ్చి పాలు పిండి గొడ్ల పని చూసే సుబ్రమణి పనికిరాలేదు. ఇంక మా అత్తగారికి ఎక్కడలేని చిరాకూ వచ్చేసింది—కాసేపటికి గుండుమణి పరుగెత్తుకుంటూ వచ్చాడు. పెద్దమ్మగారూ, అమ్మగారూ అంటూ ....

పూజగదిలో వున్న నేనూ మా అత్తగారూ ఏం కొంప మునిగిందోనని బయటికి పరుగెత్తుకొచ్చాం..

''ఏమిట్రా! ఏమైంది! ఎందుకలా రొప్పుతున్నావ్!'' అని అడిగారు

''సుబ్రమణి ఇంక పనిలోకి రాడు '' అన్నాడు తలొంచుకుని సిగ్గుపడిపోతూ.

''ఏంరా! వాడికేం మొచ్చింది'' అన్నారు మా అత్తగారు.

''ఏం రాలేదు పెద్దమ్మగారూ! ఎల్లమ్మను తీసుకొని ఎక్కడికో వెళ్ళిపోయాడంట. ''

''ఆ!'' అంటూ మా అత్తగారు ముక్కుమీదే వేలేసుకుని అలా ఎంతసేపు నిలబడ్డారో తెలీదు. నేను పూజ గదిలో కెళ్లాను. ★

# చిత్రలహరి

## తోడూ-నీడా

భానుమతి, జమున, గీతాంజలి, బేబీ షకీలా, ఎన్. టి. రామారావు, ఎస్. వి. రంగారావు, నాగయ్య, నాగభూషణం, రామకృష్ణ, రమణారెడ్డి నటించుతున్న 'విజయభట్' మూవీస్‌వారి "తోడూ—నీడా" చిత్రం పదకొండు రీళ్లకు పైగా తయారైంది. ఆదుర్తి దర్శకత్వాన యీ చిత్ర నిర్మాణము వాహినీలో చకచక సాగిపోతున్నది. సంభాషణలు : జూనియర్ సముద్రాల వ్రాశారు. గీతాలు : ఆత్రేయ, సంగీతం : కె. వి. మహదేవన్, కెమేరా : ఎం కె. రాజు, ఎడిటర్ : టి. కృష్ణ, నిర్మాతలు : ఎన్. ఎన్. భట్, ఏ. రామిరెడ్డి.

## వీరాభిమన్యు

శ్రీ వి. మధుసూధనరావు దర్శకత్వంలో రస రితంగా రూపొందుతున్న రాజలక్ష్మీవారి భారీ 'రాణిక చిత్రం "వీరాభిమన్యు" కూడ హుటా ఁటిన నిర్మాణం జరుగుతున్నది. యుద్ధ దృశ్యా ను ఏప్రిల్ మధ్యభాగంలో చిత్రించగలరని తెలియ న్సింది.

ఎన్. టి. రామారావు, కాంతారావు, రాజనాల, ...నాభం, ముక్కామల, కె వి. ఎస్. శర్మ, ...ళిపాళ సీతారామశాస్త్రి, దండమూడి రాజ గోపాలరావు, నెల్లూరి పహిల్వాన్ కాంతారావు, ... కొండలరావు, శోభన్‌బాబు, కాంచన, జి. లక్ష్మి, ఎస్. వరలక్ష్మి, గీతాంజలి, మాలతి ...న్నగువారు నటించుతున్న యీ చిత్రానికి ...భాషణలు : సముద్రాల రాఘవాచార్య, పాటలు : ...ద్ర, సముద్రాల, నార్ల చిరంజీవి, దాశరథి, ...గీతం : కె. వి. మహదేవన్, నృత్యాలు : పసుమర్తి, : ఎస్. కృష్ణారావు, ఎడిటర్ : ఎన్. ఎస్. ...కామ్, కెమేరా: రవికాంత్, నిర్మాతలు : సుందరలాల్ ...'తా, డూండి.

## ...ందరకాండ

శ్రీ రామా పిక్చర్సువారు రామాయణంలోని ...త్తర ఘట్టం "సుందరకాండ"ను చలన ...కంగా నిర్మించే సన్నాహాలలో ఉన్నారు. చిత్రంలో పాతవారితోపాటు, కొందరు కొత్త ...లను కూడా పరిచయం చేస్తున్నారు. ఆరుద్ర ..., ఎల్. మల్లేశ్వరరావు సంగీత దర్శకత్వం ...హించుతున్నారు. నిర్మాత, దర్శకుడు, ఛాయా ...హకుడు : బొల్ల సుబ్బారావు.

## ...మతి

...శ్రీ నిలయం పిక్చర్స్‌వారి "శ్రీమతి" చిత్రం ...దరాబాద్ శ్రీ సారథి స్టూడియోలో ...ంచబడుతున్నది. శారద, కాంతారావు ప్రధాన ...కలు పోషించుతున్న యీ చిత్రానికి దర్శ... : విజయారెడ్డి, నిర్మాత : బి. ఎస్. రాయుడు, ...ం : నిత్యానందం.

## ...గపూర్ సి. ఐ. డి.

...శ్రీనివాస్ మూవీస్‌వారి "సింగపూర్ సి. ఐ. డి" ... ఆంధ్రలోని ప్రధాన కేంద్రాలలో శ్రీ ...వారి ద్వారా మే నెలలో విడుదల కానున్నది. ...మన్ కలర్‌లో నిర్మించబడిన యీ అపరాధ పరిశోధక చిత్రంలో బి. సరోజాదేవి, జానకి, శివాజీ గణేశన్, నాగేష్, వి. కె. రామస్వామి, మనోరమ, కరుణానిధి, రామదాసు, ఎం. ఆర్. రాధ నటించారు. మాటలు, పాటలు. ఆరుద్ర, సంగీతం: విశ్వనాథం రామమూర్తి, కళ గంగా, నృత్యాలు: తంగప్పన్, కెమేరా. కె. యస్. ప్రసాద్, దర్శకత్వం. దాదా మిరాసి, నిర్మాతలు. యర్రా కన్నయ్య, సూరవరపు భాస్కరరావు.

## పాదుకా పట్టాభిషేకం

అమరావతి చిత్ర అనే నూతన చిత్ర నిర్మాణ సంస్థ "పాదుకాపట్టాభిషేకం" నిర్మించుతున్నది. కృష్ణకుమారి, కాంతారావు, నాగయ్య, బాలయ్య, కె. వి. యస్. శర్మ, మల్లాది, జి. వరలక్ష్మి, పుష్ప వల్లి మొదలయిన వారు నటించుతున్నారు.

ఇందులో కొత్తనటుడు ఏడిద నాగేశ్వరరావు



"ప్రేమించి చూడు"లో నాగేశ్వరరావు

గుహుని భూమిక పోషించుతున్నారు. ఈ యువ నటుడికి నాటక రంగంలో విశేషమయిన అనుభవం వున్నది. అనేక నాటక పోటీలలో ఉత్తమ నటుడిగా బహుమతులందుకున్న చక్కని నటుడు. గుహుని పాత్ర వేషధారిని ఎన్నిక చేయడంలో దర్శకుడు వసంతకుమారరెడ్డి న్యాయం చేకూర్చారనిపిస్తుంది.

ఈ చిత్రానికి మార్చినెల 5 వ తేదీన ప్రారంభం జరిగింది. తొలి షాట్‌లో సీతారామ పాత్రధారులు కృష్ణకుమారి, కాంతారావు పాల్గొన్నారు. వడ్డాది రచనా బాధ్యత చేపట్టారు. సంగీతం: ఘంటసాల, కెమేరా. వెంకట్, దర్శకత్వం: పొన్నలూరి వసంతకుమారరెడ్డి.

## ఘరానా హంతకుడు

శంకర్ మూవీస్ వారి "ఘరానా హంతకుడు" సాంఘిక చిత్రం మార్చినెలలో విడుదల. బి. సరోజా దేవి, ఎల్. విజయలక్ష్మి, ఎం. జి. ఆర్. నంబియార్, బాలాజీ, ఎం. ఆర్. రాధ, నాగేష్ నటించారు. సంభాషణలు : మహారథి, పాటలు : వీటూరి, బి. ఎన్. చారి, సంగీతం. టి. వి. రాజు, దర్శకత్వం : నటేశన్, నిర్మాత : టి. శంకరరావు.

## మోహినీ భస్మాసుర

రాజు పేద, చెంచులక్ష్మి వంటి చిత్రాలను నిర్మించిన దర్శక నిర్మాత శ్రీ బి. ఏ. సుబ్బారావు, ప్రఖ్యాత నటుడు శ్రీ ఎస్. వి. రంగారావు కలిసి బి. ఏ. యస్. బేనర్‌మీద "మోహినీ భస్మాసుర" పౌరాణిక చిత్రం సంయుక్తంగా నిర్మించుతున్నారు.

భస్మాసుర పాత్రపై పరిశోధన జరిపి, ఆ పాత్ర కొక ప్రత్యేకతను కూర్చి, కొత్త తరహాలో మలిపించారు దర్శకులు బి. ఏ. సుబ్బారావు. ఈ భూమికను ఎస్. వి. రంగారావు పోషించుతారు. వాలి కథాదర్శకత్వం, ఎస్. రాజేశ్వరరావు సంగీత దర్శకత్వం వహించుతున్న యీ చిత్రం ఏప్రిల్ మాసం నుంచి సెట్స్‌పైకి వెళ్లనున్నది.

## ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్

ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్ వారి కొత్త సాంఘిక చిత్రం యింతవరకు ఏడు రీళ్లకుపైగా తయారయింది. నాలుగు పాటలు చిత్రీకరణ జరిపారు. తరువాత షెడ్యూలు మార్చి 15 నుంచి ఏప్రిల్ 10 వరకు జరుగుతుంది. ఇందులో సావిత్రి, నాగేశ్వర రావు, జయలలిత, జగ్గయ్య, రమణారెడ్డి మొదలయిన వారంతా పాల్గొంటున్నారు. ఈ షెడ్యూలులో కొన్ని సంభాషణ దృశ్యాలు, నాలుగు పాటలు చిత్రీకరించుతారు. దీనితో యీ చిత్రనిర్మాణం పూర్తి అవుతుంది. కథ: యద్దనపూడి సులోచనారాణి, సంభాషణలు: ఆత్రేయ, గీతాలు: ఆత్రేయ, నారాయణరెడ్డి, దాశరథి, సంగీతం: టి. చలపతిరావు, కళ: జి.వి. సుబ్బారావు, నృత్యాలు: హీరాలాల్, నిర్వహించుతున్న యీ చిత్రానికి దర్శకుడు కె. ప్రత్యగాత్మ, అసోసియేట్ డైరెక్టర్: తాతినేని రామారావు, నిర్మాత. ఏ. వి. సుబ్బారావు.

—మోహన్‌కుమార్ ★

**ఒక ప్రత్యేక విలేఖరి సమీక్ష**

# కొత్త ఉగాదికి ఆదుర్తి కొత్త 'ఎక్స్‌పెరిమెంట్'

**ఈ 'సమీక్ష' రచయిత తెలుగు పత్రికాలోకానికి సుపరిచితులే, కాని ఆయనకోరికమీద పేరు వెల్లడించటం లేదు—సం.**

ప్రముఖ బొంబాయి చిత్ర నిర్మాతలు పది పదిహేను మంది ఇటీవల ఒక ఉద్యమం తల పెట్టారు. కొత్త నాయికా నాయకు లిద్దరు ముగ్గురిని ఎన్నిక చేసి వారికి అందరూ తలొక అవకాశమూ యిచ్చి నిలబెట్టాలని. దానికై ప్రధాన నగరాలలో ఇంటర్వ్యూలు జరుప నిశ్చయించారు. ఇటీవల వారిక్కడికి (హైద్రాబాదు) వచ్చి ఈ విషయం మాట్లాడుతూ ఉండగా ఒక విలేఖరి బాబూ మూవీస్ వారి ప్రసక్తి తెచ్చాడు. వారు 'తేనె మనసులు' చిత్రంలో రెండు కొత్త జోడాలను పరిచయం చేస్తున్నారనీ, అంతేకాక మరో పదిమంది సహాయ నటులను కూడా ప్రవేశ పెడుతున్నారనీ, వారంతా కొత్తవారేనని చెప్పాడు.

కొద్ది క్షణాలపాటు ఎవరూ నమ్మలేక పోయారు. 'ఇంపాసిబుల్' అన్నారు ఒకరు. 'అసాధ్యం కాదు గాని పెద్ద విశేషమే .... ఇంత సాహసంతో ఇందుకు ఉద్యమించిన ఆ నిర్మాతను కలుసుకోవాలని ఉంది' అన్నారు మరొక దర్శకుడు.

కాని "పొగరు మోతుబరి" (ఈ బిరుదాయన కిదివరకే ఎవరో యిచ్చారు) ఆదుర్తి సుబ్బారావుకు సాహసం అనేది సరదాగా చేసే పని. తాను నమ్మిన విద్యకోసం, తనకు నచ్చిన వృత్తికోసం తండ్రితో తగవాడి ఆస్తి వాటా వేసుకుని వూరుకాని వూరు వెళ్ళిపోయి, ఎండతోనూ, ఆకలితోనూ మాడి, వానతోనూ, కన్నీటితోనూ తడిసి, కష్టపడి విద్య నేర్చుకుని నెగ్గుకు వచ్చిన జగమొండి ఆదుర్తి.

"ఏదో ఒక కొత్త, ఏదో ఒక ప్రత్యేకత ఉంటేనే



ఆదుర్తి సుబ్బారావు

ఏ కళాసృష్టికైనా ఆకర్షణ. దానికోసం చేసే కృషిని సాహసమన్నా, సరదా అన్నా, మరేమన్నా మీ యిష్టం" అన్నా రాయన సిగ్గుతో తల వంచుకుని, ఒట్టి కాలరుతో మాత్రం గర్వ పడుతూ.

ఇవాళ 'తేనె మనసులు' చిత్రంలో ఆయన చేస్తున్నది ఏడెనిమిది లక్షల రూపాయల సాహసం, పాతిక ముప్ఫై చిత్రాల సాహసం, ఏడెనిమిది మాసాల సాహసం, పదిహేను, ఇరవై (మూగ మనసులులాగే) ప్రాణాల సాహసం. (దీని గురించి ఆంధ్రపత్రిక పాఠకులు ఇదివరకే చదివారు.)

ఈ సాహసోద్యమాన్ని యావదాంధ్రమూ ఆశీర్వదించింది. యావత్ పరిశ్రమ అభినందించింది అగ్ర నటులంతా జయం ఆకాంక్షించారు. నిర్మాత, డిస్ట్రిబ్యూటర్‌లు ఆమోదముద్ర వేశారు.

కొందరు తొందరపాటుగా అనుకున్నట్టు అన్నట్టు ఇది ఉన్న నటులమీద సవాలు కాదు. ఆదుర్తి సర్వజన మిత్రుడు. ఆయన దక్షిణ భారతములోని అగ్రనటులు అందరితోనూ కలిసి పని చేశాడు, చేస్తున్నాడు, చేయబోతున్నాడు. పెరిగే మన పరిశ్రమకు మరికొందరు నటులవసరం. హాలీవుడ్‌లో పాతిక ముప్ఫై మంది హీరోలున్నారు. ఆయా పాత్రలనుబట్టి ఆయా నటుల ఎన్నిక జరుగుతోంది. కథల వైవిధ్యం పెరుగుతోంది. అలాగే మన పరిశ్రమా పెరగాలని ఆయన సరదా

"అసలు కారణం—అన్నిటికన్న ముఖ్యమైనది చెప్పాలంటే—మూగమనసులు—ఘన విజయం సాధించింది. వెంటనే అంతటి చిత్రం—దానికి సరితూగేది నిర్మించడం కష్టం. అందువల్ల దానికి ఏవిధంగానూ పోలిక రానిది చేయాలనిపించింది. అందరూ కొత్త నటులనే తీసుకుని బలమైన కథ అమర్చుకుని ప్రయత్నించా లనిపించింది" అన్నారాయన.

రెండు మాసాలపాటు రమణ, ఆదుర్తి, విశ్వం కలిసి చలనచిత్ర కథను రూపొందించారు. అది విన్నవారు బాగుందని మెచ్చుకుంటూ "దీనికే గనుక స్టార్ వాల్యూ తగిలిస్తే సిల్వర్ జూబిలీయే" అన్నారు ఉత్సాహంగా.

నిజమే మంచి కథ దొరికినపుడు దాన్ని సహజంగా చూపడానికి ఎవర్ని నటులను తీసుకోవడం ఎంత సులువో, కొత్తవారిని తీసుకోవడం కూడా అంతేను.

కొత్త నటులను ఆహ్వానిస్తూ ప్రకటన చేయగానే—ఒకే ఒక్క ప్రకటన—నాలుగు వారాలలో అయిదువేల దరఖాస్తులు వచ్చాయి. వత్సెటూరి నాటక సమాజాల నుంచి, జోకర్ నాగేశ్వరరావు, రామారావుల వద్ద నుంచి, పట్నాలలో లవెచూర్ నాటక సంఘాల నుంచి, విద్యార్థులనుంచి, బొంబాయి, కలకత్తా, ఢిల్లీ, రంగూన్, సింగపూర్ వంటి దూర ప్రాంతాలనుంచి, ఏడెనిమిది వందల జీతం తెచ్చుకుంటున్న ఉద్యోగస్థుల దగ్గర నుంచి పుంఖానుపుంఖాలుగా దరఖాస్తులు వచ్చాయి.

ఆదుర్తి, కో డైరక్టర్ విశ్వం, కామెరామెన్ సెల్వరాజ్, పి. ఎల్. రాయ్, రచయితలు ఆత్రేయ రమణ, ఎడిటర్ కృష్ణ అన్నిటినీ పరిశీలించి ఎన్నికలు జరిపారు. కొందరికి లేఖలు వ్రాశారు. కొందరిని ఆయా పట్టణాలకు వెళ్ళి ఇంటర్వ్యూ చేశారు. తరువాత మద్రాసు, హైద్రాబాదులలో దాదాపు 150 మందికి స్క్రీన్ టెస్ట్‌లు (ఒక్కొక్కరికీ ఒక్కొక్క పాత్ర యిచ్చి నటించమని, అది షూట్ చెయ్యడం) తీశారు. ఆ తర్వాత వారం పది రోజులపాటు వాటిని పరీక్షచేసి సాకల్యంగా చర్చించి, కథకూ, కథలోని పాత్రలకూ తగినవారిని ఎన్నుకున్నారు.

"మాకు వచ్చిన దరఖాస్తుదారులలో అర్హులు ఇంకా చాలామంది ఉన్నారు. కాని, మా ఎన్నిక ప్రధానంగా—మా కథకు, పాత్రలకు అనుగుణమైన వ్యక్తులను దృష్టిలో ఉంచుకొని చేయుట



కృష్ణ. సుకన్య



సంధ్యారాణి, రామ్మోహన్

జరిగింది." అన్నారు ఆదుర్తి ఈ విషయం వివరిస్తూ.

తరువాత రెండు మూడు నెలలపాటు కొత్త నటులకు శిక్షణ కార్యక్రమం సాగింది. అందంగా, ఒడుపుగా కూర్చోవడం, లేవడం, నడవడం, పరుగెత్తడం వగైరా డ్రిల్లు దగ్గరనుండి రకరకాల వ్యాయామాల వరకూ—వచనం, సంభాషణలూ, పద్యాలూ, పాటలూ చదవటం నుంచి ఆయా సన్నివేశాలను నటించటం వరకూ అనేక అంశాలలో కట్టుదిట్టమైన శిక్షణ ఇచ్చారు ఎవరికీ జంకూ, బెరుకూ లేకుండా ధైర్యంగా, ధీమాగా తిరిగి నటించే స్థాయికి తీర్చిదిద్దారు. వారికి కథ తెలియ జెప్పి, పాత్రల స్వభావ స్వరూపాలు ఎరుకపరచారు అందరిచేతా ఆయా పాత్రలన్నిటినీ నటింపజేసి, విగ్రహం, నటన, తీరు అన్నీ పరిశీలించి ఆ ప్రకారం పాత్రలకు తగిన వారిని ఎన్నికచేశారు.

ఇందులో ముఖ్యపాత్రలు ఆరున్నాయి. వాటి జీవితరేఖలు ఒకదానికొకటి ఒరుసుకుంటూ పోయి, మెలివేసుకుని, చిక్కులుపడి ముడీ విడతాయి.

ఒక తండ్రి తనకూతురు పెళ్ళికోసం మరొక తండ్రి దగ్గర డబ్బు దోచాడు. అందువల్ల అతని కూతురుకు పీటల మీది పెళ్ళి ఆగిపోయింది. ఇటు దొంగ డబ్బుతో జరిగిన పెళ్ళికూడా ఫలప్రదం కాకుండా పోయింది ఆ డబ్బుతో విదేశాలకు వెళ్ళి వచ్చిన భర్త చిట్టిబాబు, ముద్దపప్పులాటి పెళ్ళాం తనకి పనికి రాదని కాలదన్ని వెళ్ళగొట్టాడు. తరువాత అతను తన కంపెనీలో తన సెక్రటరీగా పనిచేస్తున్న అమ్మాయి భానుమతిని ప్రేమించి ఆమె వెంట పడ్డాడు. అతని భార్య సీత భానుమతికి స్నేహితురాలే. తన యింటిపక్కనే ఉంటుంది. చిట్టిబాబుకి బుద్ధిచెప్పి, ఆలు మగలను కలిపి, వారి కాపరం నిలబెట్టాలని సంకల్పించి, గెలవటం కోసం ఓటమిని నటించింది

ఈ ప్రయత్నంలో ఆమె ఎదురు చూడని సమస్య ఒకటి ఏర్పడింది ఒకనాడు పీటలమీది పెళ్ళి త్రోసి రాజని, ఆమె ముఖమైనా చూడకుండా వెళ్ళిపోయిన బసవరాజు కూడా ఈనాడు ఈమెను చూసి ఎవరో అన్న భావంతో మనసిచ్చి పుచ్చుకున్నాడు. ఇంతలో ఈమె పెద్ద పదవిలో ఉన్న **చిట్టిబాబు** వెంట పడడంతో ఆమెను ద్వేషించి పగబట్టాడు. ఈ విచిత్ర పరిస్థితిని భానుమతి సాహసంతో చక్కబెట్టడమే ఈ కథకు పతాక ఘట్టం

చిట్టిబాబుగా రామ్మోహన్, రాజుగా కృష్ణమూర్తి, భానుమతిగా సుకన్య, సీతగా సంధ్యారాణి నటిస్తున్నారు, తండ్రు లిద్దరి పాత్రలను కోనేశ్వరశాస్త్రి, జి ఎస్. ఆర్ మూర్తి నిర్వహిస్తున్నారు చిట్టిబాబు అన్నా, వదినలుగా వెంకటేశ్వరరావు, పుష్పకుమారి, బసవరాజు తల్లిదండ్రులుగా రాధాకుమారి, చలపతిరావు, తండ్రిపై అత్యద్భుతమైన ప్రభావంగల ఏడేళ్ళకూతురు చిన్నిగా రోజారాణి నటిస్తున్నారు

వీరేకాక చిత్రం పొడుగునా చిన్నచిన్న పాత్రలు ఎన్నో ఉన్నాయి వాటన్నిటినీ కూడా కొత్తవారే నటిస్తున్నారు వీ రందరినీ రంగులలో చూపడం మరో విశేషం. ఈస్ట్‌మన్ కలర్‌తో వచ్చిన మొట్టమొదటి తెలుగు సాంఘిక చిత్రం ఇదే.

ఇలా అన్ని పాత్రలకూ కొత్తవారినే నియోగించి ఇంత ఖర్చుతో చిత్రం తీయడం దేశం మొత్తంమీద బహుశా యిదే తొలిసారేమో.

వీరందరినీ పరిచయం చేయడానికి వీరి వెనక దర్శకుడు ఆదుర్తి, రచయితలు ఆత్రేయ, రమణ, కామెరామన్ సెల్వరాజ్, సంగీత దర్శకుడు మహదేవన్ ప్రభృతులు పనిచేశారు.

చిత్రనిర్మాణం పూర్తి అయిన తరువాత మొన్ననే పూర్తి చిత్రం చూసుకున్నారట. అందులో పనిచేసినవారు, మిత్రులు కొందరు చూశారు. ఫలితం అత్యంత సంతృప్తికరంగా ఉంది.

ఆ తృప్తితో సంతోషంలో తరువాతి చిత్రం "విశాలనేత్రాలు"తో బాటు మరో చిత్రం నిర్మించడానికి నిశ్చయించారు. ఆ చిత్రానికి 'కన్నెమనసులు' అని పేరు కూడా పెట్టారు. అందులో ఈ చిత్రం తారలంతా నటిస్తారని చెప్పారు.

మొత్తంమీద కొత్త సంవత్సరంతోపాటు ప్రవేశిస్తున్న ఈ కొత్త నట బృందం ఈ కొత్త ప్రయత్నం విజయవంతం కావాలని సినిమా పరిశ్రమలోని వారూ, ప్రేక్షకులూ కూడా ఆకాంక్షిస్తున్నారు. ఈ చిత్ర విజయంతోంచి ఇంకా ఎన్నో కొత్త తరహా కథలూ, పాత్రలూ, కొత్తకొత్త పోకడలూ, రుచులూ జన్మించాలనీ తెలుగు చలన చిత్రకళ కొత్త చిగురు తొడగాలనీ కొత్త పూలు పూయాలనీ ఆశిద్దాం. ★

ఆరుద్ర సంకలనం

# సమగ్ర ఆంధ్రసాహిత్యం

**సమీక్ష : తిరుమల రామచంద్ర**



ఆరుద్ర

(మొదటి సంపుటం—చాళుక్య యుగం రచయిత. శ్రీ ఆరుద్ర. పుటలు : 1/16 డెమ్మి 254 మూల్యం : 5—00. ప్రాప్తిస్థానం : ఎం. శేషాచలం అండ్ కంపెనీ, మద్రాసు, మచిలీపట్నం, సికిందరాబాదు.)

కవి చరిత్రలకు— తద్వారా సాహిత్య చరిత్రలకు తెలుగువారు శ్రీకారం చుట్టి సప్తత్యబ్ది పూర్తి అయింది. అముద్రిత గ్రంథ చింతామణి నాటి నుంచి నేటిదాక ఈ చరిత్ర రచన అవిచ్ఛిన్నంగా కొనసాగుతున్నది. ఆ కోవలో తాజా పుస్తకం ఈ సమగ్ర ఆంధ్ర సాహిత్యం.

దీనిలో ఆదిమ యుగం, చాళుక్య యుగం, నన్నయభట్టు, పావులూరి మల్లన, నన్నెచోడుడు, వేములవాడ భీమకవి, మల్లియరేచన, మల్లికార్జున పండితారాధ్యుడు—అనే ఎనిమిది ప్రకరణాలున్నాయి.

ఇలాటి ఉద్గ్రంథాలు వెలువడినప్పుడు (1) రచయిత పూర్వ కవి చరిత్రలోను, సాహిత్య చరిత్రలోను లేని విషయాలు చెప్పి, మౌలికంగా నిగ్గుతేల్చి, ఏ సమస్యనైనా పరిష్కరించారా ? (2) అన్ని పక్షాలూ వదలక సేకరించి నిగ్గు తేల్చడం పాఠకులకే వదిలారా ? (3) అటూ ఇటూ వాదాలు కొన్ని చెబుతూ సామాన్య పాఠకులకు అభిరుచి, అభినివేశం కలిగించడమే ప్రధానోద్దేశంగా భావించారా?— అనే ప్రశ్నలు తోస్తాయి. ఈ గ్రంథం శీర్షిక సమగ్ర ఆంధ్ర సాహిత్యం గనుక మొదటి రెండు ప్రశ్నలే చప్పున ఎదురౌతాయి

శ్రీ ఆరుద్ర పూర్వకవి, సాహిత్య చరిత్రలు, సాంఘిక చరిత్రలు, మానవజాతి చరిత్రలు క్షుణ్ణంగా అధ్యయనంచేసి వివిధ విషయాలు సేకరించారనడం, వాటిని తమ ఉద్దేశాలకు అనుగుణంగా క్రోడీకరించారనడం నిస్సందేహం. ఇంతవరకు ఎవరూ చెప్పని ఎక్కు అంశాలు— పదవ్యుత్పత్తులు అర్థాలు మొదలయినవి చెప్పారనడమూ నిస్సంశయం. అయినా ఇదివరకు అపరిష్కృతంగా, అనిర్ధారితంగా ఉన్న అంశాలు "ఎక్కడ ఉన్నావే గొంగడీ అంటే వేసిన చోటనే ఉన్నాను" అన్న సామెతగానే ఉండిపోయాయి.

శ్రీ ఆరుద్ర ఆదిమ యుగాన్ని తెలుగు బాష పుట్టు పూర్వోత్తరాలతో ప్రారంభించి తెలుగు శాసన సాహిత్యంతో ముగించారు. బ్రాహ్మీ లిపిలోని నాగబు శాసన గ్రథితమైన అతి ప్రాచీనమైన—బహుశా తొలి—తెలుగు పదమని శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు చెప్పిన వాదం ఆలంబనగా ఈ ప్రకరణం ఆరంభం కావడం ప్రశంసనీయం ప్రాచీన ప్రాకృత సంస్కృత శాసనాలలోని తెలుగు పదాల పట్టిక ఇచ్చారు తెలుగుభాష స్వతంత్రమైన భాషని, సంస్కృత జన్యం కాదని తెలిపారు. ఇక్కడ ఆధునికులను పేర్కొన్న శ్రీ ఆరుద్ర కాల్డ్వెల్‌ను స్మరించక పోవడం ఆశ్చర్యం ! (పుట—18)

గుణాఢ్యుని కథ (పుట—19) ప్రచారానికి తెచ్చినవాడు కథాసరిత్సాగరకారుడు అతని ప్రసక్తి దుర్వినీతుని శాసనంలో తొలిసారిగా కానవస్తున్నదని శ్రీ వేదం వేంకటరాయశాస్త్రి (ఎం. ఏ) నిరూపించారు కనుక అతడు క్రీస్తుకు పూర్వం వాడనడానికి ఆధారాలేమీ లేవు.

పల్లవుల జన్మస్థానం పల్లవనాడు అన్నారు (పుట—20). పల్లవులు ఏలిన నాడనే వాగ్నాన్ని తోసిరాజనగల కారణాలు చెప్పలేదు వారు ఔత్తరాహులు, తర్వాత [illegible] లు.

తెలుగు పద వ్యుత్పత్తిని గురించి చాల చర్చించారు. కాని, ఏమీ తేలినట్టు నాకు తోచలేదు

మొట్టమొదటి తమిళదేశ భాషా శాసనం 5 వ శతాబ్దిదని (పుట—34) అన్నారు. కాని, క్రీస్తుశకానికి ముందే తిరుచిరాపల్లి జిల్లా గుహలలో తమిళ శాసనాలు ఉన్నట్టు పరిశోధకులు నిరూపించారు.

పొట్లదుర్తి— పొట్లాటల వూరు— గాని పొట్లదుర్తి కాదు ఇది కేవలం అచ్చు పొరపాటే.

తెలుగుదేశంలోని రాజుల వంశాలను చెప్పే పట్టున త్రిలోచన పల్లవుని, కరికాళచోళుని కాలాలను శ్రీ వేటూరి వేంకటరమణయ్యగారి వాదాన్ని బట్టి యిచ్చారు. కరికాళుడు క్రీస్తుశకం రెండవ శతాబ్దివాడు.

పొట్లదుర్తి శాసనం చర్చలో (పుట—66) "చోళ మహారాజు ఒప్పుకుంటే ఇను పోలు గ్రామంలోని రేవణగారు, పుద్దణగారు అనే ఆజ్ఞప్తులు పెద్ద బ్రాహ్మణుడు ఇశరేడుగారికి ఇచ్చిన పన్నస (50 కుంటలో, 50 బస్తాలు పండేదో) ఇది " అని వ్యాఖ్యానించారు మూలంలో "శ్రీ చోళ మహారాజు లొప్పుకొన" అని ఉంది. చోళ మహారాజు అంగీకారంతా అని అర్థమే కాని, ఒప్పుకుంటే అని తేదర్థకం కాదు. చేదర్థకం ఉంటే ఇక దానం ఎట్లా అవుతుంది ? ఇశరేడును ఇదివరకు ఈశ్వరుడుగా అందరూ అర్థం చెప్పారు. ఇశ్శరేడు సంగీత విద్వాంసుడు అని శ్రీ ఆరుద్ర అంటున్నారు. ఇశ్శైకు మరొక ప్రయోగం చూపితే ఈ వాదం బలపడుతుంది.

'బోయ శబ్దం' పూర్తి పెద్దకు ఉండిన దనేది చాల బాగుంది. కాని, (పుట—72) బోయ అన్న మాట గొల్లలకు వర్తిస్తుం దన్నారు. బోయలు వేరు, గొల్లలు వేరు. బోయలు తెలంగాణా, పశ్చిమాంధ్రాలలో ప్రముఖమైన అనాది వాల్మీకజాతి. వీరు రాయల కాలంలో సేనాదళ నాయకులుగాను, అంగరక్షకులుగాను ఉన్నవారు. దుర్గాపతులు కూడ.

ద్విపద చర్చలో (పుట—78) తరువోజ ద్విపద వాదాలతో ఏర్పడినదని తేల్చారు. తరువోజ మొదటినుంచి ఉంది. ద్విపదను సోమనాథుడు శివుని రెండు పాదాలలాగ కల్పించానని చెప్పుకున్నాడు కనుక సోమనాథుడు తరువోజా పాదాన్ని రెండుగా విరిచి మౌలికంగా ద్విపద చేశాడని స్పష్టం. (పరిశోధన సోమనాథ సంచిక చూడగోరినాను ) కనుక రెండు ద్విపదలతో తరువోజకా లేదు.

అరసున్న చర్చలో (పుట—120) వంటయింటి కుందేలు సామెత వేంట— వెంట ఇంటి కుందేలు అని చెప్పడం చాల బాగుంది దీర్ఘాక్షరాల మీది బిందువును దక్షిణాదిని స్థిరపడిన తెలుగువారు వేంట, వాండు, పేండ, కూంతురు అని నేటికీ వ్యవహరిస్తారు. అది ప్రాచీనమైన వ్యవహారం. అప్పుడు వేంట ఇల్లు వెంట యిల్లు అయి, ఎవరో వెంట ఏమిటి అని వంటగా దిద్దగా వంటయిల్లు అయివుంటుంది. ఇది వేట గాని యిల్లు అనడం కంటే వేట ఇల్లు అనడం సమంజసం. అడవులలో క్రూరమృగాలు పడడం కోసం నాలుగు గోడల ఇండ్లు కట్టి, వేట మృగాలను తరుముతారు. మృగాలు పరిగెత్తి వాటిలో పడుతాయి. దీనిని నేడు 'గవికట్టడం' అని వాడుతారు ఏనుగుల కైతే అవపాతం—గుంటలు తవ్వి పైన తేలికైన తడకలతోనో, వెదుళ్లతోనో మూయడం

'అర్ధాంతరంగా వచ్చిన అరసున్న' అనే శీర్షిక క్రింద (పుట 120) అర్ధానుస్వారం పుట్టుపూర్వాలు చర్చించవలసింది. (మన లిపి పుట్టుపూర్వోత్తరాలు — "అర్ధాంతరంగా వచ్చిన అరసున్న" చూడండి.)

"అక్షర రమ్యత .... నన్నయగారిలో లోపించిందేమో అని మొదట మనకు తోస్తుంది గాని" (పుట 131) అక్షర రమ్యత అన్న మాటను మనకు చెప్పినవాడే నన్నయ. అలాంటప్పుడు ఈ రిమార్కు వంటిది కూడా న్యాయంకాదు.

మత్స్యగంధ్యుపాఖ్యానం పచ్చి శృంగారంగా ఉన్నది కాబట్టి ప్రక్షిప్తమై ఉంటుందన్నారు శ్రీ ఆరుద్ర. (పుట—134) కారణాలు స్పష్టంగా లేవు. సంస్కృత సాహిత్యం ఆపోశనం పట్టినవారికి అవి బూతులు కావు.

నన్నెచోడుని గురించి జరిగినంత చర్చ ప్రపంచంలో మరే ప్రాచీన కవిని గురించీ ఏ భాషలోను జరుగలేదు. ఆ వాదాలు ఇవ్వడం—సంగ్రహంగా

న్నైనా—న్యాయం. "నన్నెచోడుడు నన్నయ, తిక్కనల మధ్యకాలం వాడని ఆమోదించారు. మనం కూడ మెజారిటీ వాదాన్నే ఒప్పుకొని ముందుకు పోదాం" (పుట—157). సాహిత్యంలోనూ వోటింగు పద్ధతు లయితే వట్టి బ్యాలెట్ పెట్టెలే మిగులుతాయి. నన్నెచోడని గ్రీష్మ వర్ణనలోని

"ఆతప భీతి నీడలు ర
యంబున ప్రాకుల క్రింద దూరెనో
ఆతరులుం దృషాభిహతు
లై తమ నీడలు తార త్రాగెనో
ఖ్యాతి ఎనంగ నీడ లురు
పాదప మూలములం దడంగె గ్రీ
ష్మాతప మధ్య వాసరము
లందు జలింపక యుండు నెండలన్"

అన్న పద్యము (పుట—184) కళింగత్తు బరణిలోని పద్యానికి నకలు అన్నారు. కాని, ఇద్దరూ కాళిదాసును కాపీ కొట్టారేమో!

వేములవాడ భీమకవి చర్చలో (పుట—195) నల్లసిద్ధి సాగి పోతరాజు కాలమువాడో, 1162 లోని ఉదయచోడుని దండనాయకుడో అన్నారు. ఎందుకు? మొదటి కులోత్తుంగచోళుని (మదురాంతకిదేని కుమారుడు) శ్రీ మధురాంతక పొత్తపిచోళ నల్లసిద్ధి (1106) ఉన్నాడే, ఆ నల్లసిద్ధే భీమకవి పద్యంలోని నల్లసిద్ధి ఎందుకు కాకూడదు? ఇతడు కులోత్తుంగచోళుని పరిపాలనకాలంలోనే పొత్తపినాడుకు గవర్నరుగా ఉన్నవాడు.

"మానవనాథుడు గంగా
స్నానాంతరము సకల దానములు మహా"

అన్న కందంలోని (పుట—196) స్నానపదంలోని నా సర్ణానికి, గా సర్ణానికి యతి అని అన్నారు స్నాన శబ్దం స్తానమని సకార తకార నకారాలతో వేద కాలం నుంచి ఉన్నదని, కనుకనే తానమనే రూపం పలు భాషలలో వచ్చిందని పూర్వం పెద్ద చర్చ జరిగింది కనుక తమిళులోని ఉగర సగరాలతో ప్రసక్తి లేదనుకుంటాము.

మల్లికార్జున పండితారాధ్యులు ప్రకరణంలో సోమనాధుని పండితారాధ్య చరిత్రలోని కథను ఇచ్చారే గాని, కాల నిర్ణయాదుల ప్రసక్తికి పోలేదు "మల్లికార్జునయోగి కవీంద్రుడు గూడ ఈ సంగతి నన్నెచోడుడు కుమారసంభవంలో అక్కడక్కడ చెప్పాడు సుప్రసిద్ధుడైన మల్లికార్జున పండితారాధ్యుడే మల్లికార్జునయోగి అని కొందరు భావించారు గాని అది సత్యంకాదు" (పుట—170) శ్రీ లక్ష్మణరావు, శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రి మొదలయినవారు చేసిన నిర్ణయాల బాగోగులను పరిశీలించకుండా ఇలా ఎక్స్‌పార్టీ నిర్ణయం చేయడం న్యాయమా?

శివతత్త్వసారం పాఠ నిర్ణయానికి కన్నడ శివతత్త్వసారం ఎంతో ఉపయోగపడుతుంది అది తరం క్రింద అకస్మాత్తుగా నాకు లభించింది. దానిని శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు ప్రపంచానికి తెలిపారు మద్రాసు ఓరియంటల్ లైబ్రరీ జర్నలులో లైబ్రేరియన్ శ్రీ హనుమంతాచార్యులుగారు దానిని పరిష్కరించి ప్రచురించారు. శ్రీ ఆరుద్ర దానిని పేర్కొనవలసింది.

"సమగ్ర ఆంధ్ర సాహిత్యం" (కాంప్రెహెన్సివ్ హిస్టరీ ఆఫ్ తెలుగు లిటరేచర్) అని అన్నందున ఇంతగా వ్రాయవలసి వచ్చింది.

శ్రీ ఆరుద్ర కవిగాను, వచన రచయితగాను పేరు పొందినవారు. ఈ గ్రంథంలోని శైలి అయస్కాంతంవలె పాఠకుల మనస్సును లాగి గ్రంథాన్ని పూర్తిగా చదివించే వరకు వదలదు. ఈ శక్తికి తోడుగాను, పేరుకు తగినట్లు ఈ గ్రంథం ఉండి

తలమానిక మయ్యేది. ఇప్పు డిది "నలుగురితో పాటు నారాయణ" గా "శతే పంచాశత్" న్యాయంగా అయిపోయిందని విచారపడుతున్నాను. అయి సామాన్య పాఠకుల కోసమని రచయిత ఉద్దేశమయ్యేటట్లయితే అది చాలవరకు సఫలమయిందని భావిస్తున్నాను వచ్చే సంపుటాలలో ఇలాంటివి ఉండవని నమ్ముతాను. ★

# నికో
## క్రిమిసంహార సబ్బు
## పార్క్-డేవిస్ ఉత్పత్తి

మీ చర్మాన్ని, మొటిమలు, పొక్కులు, పేయడంనుంచి కాపాడి పరిశుభ్రంగా ఆరోగ్యంగా వుంచుతుంది. దీనితో నిత్యం తల రుద్దుకొంటే, దీని క్రిమిసంహారనురగ, చుండ్రు రాకుండా కాపాడుతుంది. నిరుపమానమైన నికో క్రిమిసంహార సబ్బు మీకు మూడు విధాల లాభం చేకూరుస్తుంది; అది పరిశుభ్రంచేయడం, క్రిములను నాశనంచేయడం, సంరక్షించడం. మీ చర్మానికి కావలసిన సంరక్షణ నిత్యంచేయండి.




మొట్టమొదటి క్రిమిసంహార సబ్బు, నిత్య ఉపయోగానికి.

NAS PD 1662

# విశ్వావసునామ సంవత్సరం.

## 2-4-1965 మొదలు
## 23-3-1966 వరకు.

### మేషం :

(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)

ఈ సంవత్సరం ప్రారంభంలో అంత బాగా ఉండదుకాని రాను రాను అన్ని వ్యవహారాల్లోను అనుకూల పరిస్థితులు ఏర్పడతాయి. వ్యాపారంలో ఇదివరకు ఏర్పడిన అనిశ్చిత పరిస్థితి తొలగిపోవడం వలన తగిన అభివృద్ధిని సాధించడానికి అవకాశం ఏర్పడుతుంది. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. ఆర్థిక వ్యవహారాలు బాగానే ఉంటాయి కాని మీరు ఇదివరకు జరిపిన వ్యవహారాలవల్ల అప్పుడప్పుడు ఒత్తిడికి గురి కావలసివస్తుంది ఉద్యోగంలో మీ పరిస్థితి ఇదివరకటికంటె బాగా ఉంటుంది కాని విశేషమైన అనుకూలతను ఆశించడానికి అవకాశంలేదు. స్థిరాస్థి వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. కోర్టు వ్యవహారాల్లో అనుకూలమైన మార్పులు వస్తాయి. ఆరోగ్యం బాగా ఉంటుంది. బంధువులకు సహాయం చేస్తారు. విలాసయాత్రలు చేస్తారు విద్యార్థులు మొదట నుంచీ శ్రద్ధగా చదవడం అవసరం

స్త్రీలకు—ఆరోగ్యం బాగానే ఉంటుంది. కుటుంబ కార్యక్రమాలు సంతృప్తికరంగా ఉంటాయి. సంవత్సరం మధ్యలో సాటివారితో మాట పట్టింపులు రావచ్చును. అలంకార వస్తువులు కొంటారు.

### వృషభం :

(కృత్తిక 2, 3, 4 పా, రోహిణి మృగ 1, 2 పా)

వృత్తి వ్యాపారాల్లో అప్పుడప్పుడు కొన్ని ఒడిదుడుకులను ఎదుర్కోవలసి వస్తుంది కాని మొత్తంమీద ఈ సంవత్సరం బాగానే ఉంటుంది. మీరు స్వంతంగాచేసే వ్యాపారాలకంటె భాగస్వాములతో కలసిచేసే వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలకు ఆకస్మికంగా ఆటంకాలు రావడంవలన సంవత్సరం మధ్యలో మీ కార్యక్రమాలకు మార్పులు వస్తాయి. వృత్తిలో మీరు సాటివారి పోటీని ఎదుర్కొని అభివృద్ధిని సాధించగలరు. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది కాని మీ శక్తి సామర్థ్యాలు అధికారుల చేత గుర్తింపబడతాయి. స్థిరాస్థి వ్యవహారాలు మాత్రం అంత బాగా ఉండవు. రాజకీయ వ్యవహారాల్లో సంవత్సరాంతంలో కొత్త సమస్యలను ఎదుర్కోవలసి ఉంటుంది. ఆరోగ్యం ప్రస్తుతం బాగా ఉన్నా నిర్లక్ష్యం చేయతగదు. విద్యార్థులు సామాన్యంగా కృతార్థులు కావచ్చును.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుందికాని అప్పుడప్పుడు మానసికాందోళన కలుగుతుంది. కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. సంతానానికి కించిదనారోగ్యము చేయవచ్చును. సంవత్సరం మధ్యలో సంతోషకరమైన వార్తలను వింటారు.

| మీ | మే | వృ | మి |
|---|---|---|---|
| ర చం బు శు | | గు రా | |
| శ | మ హే ష్ | | |
| | | | కు |
| | కే | | |

### మిధునం :

(మృగశిర 3, 4 పా, ఆర్ద్ర, పునర్వసు, 1, 2, 3 పా)

ఈ సంవత్సరం శుభా శుభ మిశ్రమంగా ఉంటుంది. సంవత్సరాది మొదలు ఆగస్టు 6 వ తేదీవరకు మీరు జరిపే వ్యవహారాల్లో అనవసరమైన వ్యయం, ప్రయత్నించిన పనులకు ఆటంకాలు ఏర్పడడంవంటి సంఘటనలు జరుగుతాయి. ఆగస్టు 6, 1966 సం. జనవరి 10 వ తేదీల మధ్య వృత్తి వ్యాపారాల్లో ప్రోత్సాహకరమైన పరిస్థితులు ఏర్పడతాయి. భారీ ఎత్తునచేసే వ్యాపారాల్లో ఆదాయం పెరుగుతుంది. జనవరి 10 తరువాత సంవత్సరాంతంవరకు మీరు జరిపే వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. వృత్తిలో మీ పరిస్థితి బాగానే ఉంటుంది. ఉద్యోగంలో అప్పుడప్పుడు సాటివారితో భేదాభిప్రాయాలు రావచ్చును. కోర్టు వ్యవహారాల్లో వ్యయ ప్రయాసలమీద అనుకూలత లభిస్తుంది. సాంఘిక వ్యవహారాల్లో ప్రముఖ పాత్రను నిర్వహిస్తారు. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. విద్యార్థులకు సెప్టెంబరు పరీక్షలు బాగా ఉంటాయి.

స్త్రీలకు—ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. బంధువుల వ్యవహారాల్లో గౌరవం బాగా ఉంటుంది. సాహిత్య కళారంగాల్లో మీ కృషి రాణిస్తుంది. సంవత్సరాంతంలో దూర ప్రయాణాలు చేస్తారు. శుభ కార్యాల విషయంలో మీ ఆలోచనలు ఫలిస్తాయి.

### కర్కాటకం :

(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష.)

ఈ సంవత్సరం ప్రారంభంలో వృత్తి వ్యాపారాలు ప్రోత్సాహకరంగానే ఉంటాయికాని సంవత్సరం మధ్యలో ఆకస్మికంగా ఆందోళన కలిగించే పరిస్థితులు ఏర్పడతాయి. సంవత్సరాంతానికి మరల అన్ని వ్యవహారాల్లోను అనుకూల పరిస్థితి ఏర్పడుతుంది. దీర్ఘకాలానికి ఫలితాన్ని ఇచ్చే భారీ వ్యవహారాల విషయంలో తొందరపాటు తగదు. వృత్తిలో మీకు ఇంతవరకు సహాయంగా ఉన్నవారికి సంవత్సరం మధ్యలో చికాకులు రావడంవలన మీరు కూడా ఇబ్బందిని పొందగలరు. సాహసముతో కూడిన వ్యవహారాల్లో సంవత్సరం మధ్యలో నష్టం వస్తుంది. ఉద్యోగంలో స్థాన చలనము కలిగగల సూచనలు ఉన్నాయి. స్థిరాస్థి వ్యవహారాలు బాగా ఉంటాయి. గృహ నిర్మాణాది ప్రయత్నాలు చురుకుగా సాగుతాయి. ఆరోగ్యం సంతృప్తికరంగా ఉండకపోవచ్చును. విద్యార్థులు కొంచెం శ్రమమీద కృతార్థులు కాగలరు.

స్త్రీలకు—ఆరోగ్యం ప్రస్తుతం బాగా ఉన్నా నిర్లక్ష్యం చేయుతగదు. కుటుంబంలో అప్పుడప్పుడు భేదాభిప్రాయాలు వస్తాయి. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి. సాటివారిలో గౌరవం బాగా ఉంటుంది. పుణ్యకార్యాలు చేస్తారు.

### సింహం :

(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)

వృత్తి వ్యాపారాల్లో అప్పుడప్పుడు ఆందోళన కలిగించే పరిస్థితులు ఏర్పడవచ్చును. కాని మొత్తంమీద ఈ సంవత్సరం సంతృప్తికరంగా ఉంటుంది. వ్యాపారంలో అనుకూలమైన మార్పులు వస్తాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు కూడా కొంతవరకు లాభించగల సూచనలు ఉన్నాయి. వృత్తిలో మీ అభిప్రాయాలు సరియైనవని రుజువు కావడం వలన అధికాదాయంతోపాటు సాటివారిలో గౌరవం కూడా లభిస్తుంది. ఉద్యోగానికి సంబంధించిన విద్యలో ఉత్తీర్ణులు కాగలరు ఆర్థిక వ్యవహారాలు బాగానే ఉంటాయి కాని మీరు కొన్ని మొగమాటాలకు లొంగిపోవడంవలన కొంచెం ఇబ్బంది కలుగుతుంది. రాజకీయ వ్యవహారాల్లో ప్రతిపక్షాల పంచలనం అధికం కావచ్చును. ఆరోగ్య విషయంలో జాగ్రత్త అవసరం. దైవ కార్యాలు నెరవేరుతాయి. విద్యార్థులు మంచి మార్కులతో కృతార్థులు కాగలరు.

స్త్రీలకు—ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. కుటుంబ కార్యక్రమాలు నిరాటంకంగా నెరవేరుతాయి. శుభమూలంగా ధన వ్యయం జరుగుతుంది. బంధువులకు సహాయం చేస్తారు. ఉద్యోగినులకు మంచి సమయం.

### కన్య :

(ఉత్తర 2, 3 4 పా, హస్త, చిత్త 1, 2 పా)

ఈ సంవత్సరం అన్ని విధాలా ప్రోత్సాహకరంగా ఉంటుంది. దీపం ఉండగానే ఇల్లు చక్కబెట్టుకోవాలి అన్నట్లుగా ఇటువంటి సమయంలోనే మీ భవిష్యత్తుకు సంబంధించిన దీర్ఘకాలిక ప్రణాళికలు అమలు జరపడం మంచిది. భాగస్వాములతో కలసిచేసే వ్యాపారాలకంటె మీరు స్వంతంగాచేసే వ్యాపారాలు అనుకూలంగా ఉంటాయి. వృత్తిలో మీరు ఇదివరకు ఎదురు చూచిన అవకాశాలు లభించగల సూచనలు ఉన్నాయి. ప్రయాణం ద్వారా కార్యసాధన చేయగలరు. ఉద్యోగంలో ఉన్నతస్థానంకోసం మీరుచేసే ప్రయత్నాల్లో అధికారుల సహకారం లభిస్తుంది. రాజకీయ వ్యవహారాల్లో బాధ్యతతో కూడిన పదవిని నిర్వహించగలరు. అనవసరమైన వాద ప్రతివాదాలకు దిగి ఇటువంటి అమూల్యమైన కాలాన్ని వ్యర్థం చేసికొనే ప్రమాదం ఉంది. ఆరోగ్యం బాగా ఉంటుంది. విద్యార్థులకు క్లాసు రావచ్చును.

# సంవత్సర ఫలం

స్త్రీలకు—ఈ సంవత్సరం గత సంవత్సరం కంటే బాగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. సాంఘిక కార్యక్రమాల్లో మీ ప్రాముఖ్యత పెరుగుతుంది. విలాస యాత్రలు చేస్తారు. కళాకారిణులకు మంచి సమయం.

## తుల :

**(చిత్త 3,4 పాదాలు, స్వాతి, విశాఖ, 1,2,3 పా)**

ఈ సంవత్సరం చిత్రంగా ఉంటుంది. కొన్ని వ్యవహారాలు మీరు ఎంత ప్రయత్నం చేసినా నెరవేరక పోవడం, మరికొన్ని వ్యవహారాలు వాటి అంతట అవే నెరవేరడంవంటి సంఘటనలు జరుగుతాయి. వృత్తి వ్యాపారాల్లో మీ ఆలోచనలు మీ స్వంత వ్యవహారాల్లోకంటే ఇతరులకు బాగా ఉపకరిస్తాయి. వ్యాపారంలో మీరుచేసే ప్రయత్నాల వల్ల మీకు ముమ్ముందు మంచి ప్రయోజనం ఉంటుంది. వృత్తిలో కొత్తవారి పోటీని ఎదుర్కోవలసి ఉంటుంది. సంవత్సరం ప్రారంభంలో మీ తాలూకు వస్తువులుపోయే ప్రమాదం ఉంది. రావలసిన డబ్బు సమయానికి అందకపోవడంవలన లాభం రావలసిన వ్యవహారాలను కూడా వదలుకోవలసిన పరిస్థితి ఏర్పడుతుంది. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. సంవత్సరం మధ్యలో అనుకూల వార్తలను వింటారు. ఆరోగ్యం బాగానే ఉంటుంది. విద్యార్థులు సామాన్యంగా కృతార్థులు కావచ్చును.

స్త్రీలకు—ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. సంతానానికి మాత్రం కించిదనారోగ్యం చేయవచ్చును. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషికి ఆటంకాలు వస్తాయి. శుభకార్యాల విషయంలో కొంచెం అభివృద్ధి ఉంటుంది.

## వృశ్చికం :

**(విశాఖ 4-వ పాదం, అనూరాధ, జ్యేష్ఠ)**

సంవత్సరాది మొదలు ఆగస్టు 6 వ తేదీవరకు జరిపే వ్యవహారాలు లాభదాయకంగా ఉంటాయి. అది మొదలు 1966 జనవరి 10 వ తేదీ వరకు వృత్తి వ్యాపారాల్లో అనుకోని ఇబ్బందులను ఎదుర్కోవలసి ఉంటుంది. అది మొదలు సంవత్సరాంతంవరకు జరిపే వ్యవహారాల్లో అధికాదాయం, నూతన గౌరవం లభిస్తాయి. మీకు అంతగా ఇష్టం లేకపోయినా మిత్రుల వ్యవహారాల్లో జోక్యం చేసికొనవలసి వస్తుంది. భాగస్వాములతో భేదాభిప్రాయాలు కలగడం వలన కొన్ని వ్యవహారాలు నిలిచి పోవచ్చును. వృత్తిలో కొంతమంది వ్యక్తులు మీమీద నిందా ప్రచారానికి పూనుకొనవచ్చును. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. సంవత్సరాంతంలో సాహసముతో కూడిన వ్యవహారాలు కూడా లాభిస్తాయి. సాహిత్య కళారంగాల్లో అభివృద్ధిని సాధించగలరు. ఆరోగ్యం ఇదివరకటి కంటే బాగా ఉంటుంది. విద్యార్థులు సామాన్యంగా కృతార్థులు కాగలరు.

స్త్రీలకు—సంవత్సరం మధ్యలో ఆరోగ్యం

అంత బాగా ఉండదు. కుటుంబ కార్యక్రమాలు కొంచెం శ్రమమీద నెరవేరుతాయి. బంధువుల వ్యవహారాల్లో మీరు శ్రమపడినా నిష్ఫారం తప్పక పోవచ్చును. విలాస వస్తువులు కొంటారు.

**ధనుస్సు :**

**(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)**

గ్రహబలం బాగా ఉంది. వృత్తి వ్యాపారాల్లో మీకు ఇంతవరకు ఆందోళన కలిగించిన వ్యవహారాలు మీకు అనుకూలంగా పరిష్కారం కావడం వలన నూతన వ్యవహారాల్లో మీ దృష్టిని కేంద్రీకరించడానికి అవకాశం లభిస్తుంది. వ్యాపారంలో మీకు ముమ్మందు లాభించగల ఒప్పందాల విషయంలో మీకు మిత్రుల సహకారం లభిస్తుంది. వ్యాపారం భారీ ఎత్తున చేయడం వలన ఆర్థికంగా కొంచెం ఒత్తిడి రావచ్చును. వృత్తిలో మీరు ఇదివరకు నిరాశ చెందిన వ్యవహారాలు కూడా ఇప్పుడు ఫలిస్తాయి. ఉద్యోగంలో కొంతమంది వ్యక్తులు మిమ్మల్ని మోసం చేయడానికి ప్రయత్నిస్తారు. ఉద్యోగంలో అనుకూలమైన స్థానమునకు మార్పు జరగల సూచనలు ఉన్నాయి. కోర్టు వ్యవహారాల్లో అనుకూలత లభిస్తుంది. ఆరోగ్యం బాగా ఉంటుంది. విద్యార్థులు మంచి మార్కులతో కృతార్థులు కాగలరు.

స్త్రీలకు—ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది కుటుంబ వ్యవహారాలు బాగానే ఉంటాయి. బంధువులతో భేదాభిప్రాయాలు రాగల సూచనలు ఉన్నాయి. శుభకార్యాల విషయంలో కొంత ఆలస్యం మీద అనుకూలత లభిస్తుంది.

**మకరం :**

**(ఉషా 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1,2 పా.)**

ఈ సంవత్సరం గత సంవత్సరం కంటే కొంచెం బాగా ఉన్నా విశేషమైన అనుకూలతను ఆశించడానికి అవకాశంలేదు. మీరు కొన్ని అనవసరమైన వ్యవహారాల్లో చిక్కుకోవడంవలన వృత్తి వ్యాపారాల్లో ప్రయోజనకరమైన వ్యవహారాలను కూడా సరిగా చూడలేని పరిస్థితి ఏర్పడుతుంది. మీరు స్వంతంగాచేసే వ్యాపారాలకంటే భాగస్వాములతో కలిసిచేసే వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. వ్యాపార విస్తరణ ప్రయత్నాల్లో ప్రయాసకు తగిన ప్రతిఫలం ఉండదు. వృత్తిలో పోటీవారితో మాట పట్టింపులు రావచ్చును. ఉద్యోగంలో మీ పరిస్థితి సామాన్యంగా ఉంటుంది. ఇతరులు చేసిన పొరబాటులకు కూడా మీరే బాధ్యత వహించవలసి వస్తుంది. ఆరోగ్యం బాగానే ఉంటుంది. కాని శరీర శ్రమతో కూడిన కార్యక్రమాలు పనికిరావు. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి. విద్యార్థులు చాలా శ్రమమీద కృతార్థులు కావచ్చును.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. సాహిత్య కళారంగాల్లో మీ కృషి రాణించడానికి అవకాశాలు లభిస్తాయి. ప్రయాణాలకు ఆటంకాలు వస్తాయి. సంఘ సేవికలకు యోగవంతమైన సమయం.

**కుంభం :**

**(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భా. 1, 2, 3 పా)**

ఈ సంవత్సరం అన్ని వ్యవహారాల్లోను చాలా జాగ్రత్తగా వ్యవహరించడం అవసరం. వ్యాపారంలో

# సంవత్సర ఫలం

ఏమాత్రం అశ్రద్ధగాఉన్నా అవస్థమీది, అనుభవం మరొకరిది కాగల పరిస్థితి ఏర్పడుతుంది. భారీ ఎత్తున చేసే వ్యాపారాల్లో మీరు ఇదివరకు జరిపిన వ్యవహారాలవల్ల ఇప్పుడు చికాకులు రావచ్చును. వృత్తిలో ప్రయోజనంకంటే ప్రయాస అధికంగా ఉంటుంది. సంవత్సరం మధ్యలోచేసే ప్రయాణాలు లాభదాయకంగా ఉంటాయి. ఉద్యోగంలో స్థాన చలనము కలగవచ్చును కాని మారబోయే స్థానం కూడా అనుకూలంగానే ఉంటుంది. రాజకీయ వ్యవహారాల్లో మీ పక్షంలోనే చీలికలు రావచ్చును గాని మీ స్థానానికి భంగం కలగదు ఆరోగ్యం బాగానే ఉన్నా, కాలడం, జారిపడడం వంటి ప్రమాదాలు కలగవచ్చును. విద్యార్థులు మొదటనుంచీ శ్రద్ధగా చదవడం మంచిది. వైద్యులకు కంట్రాక్టర్లకు యోగవంతమైన సమయం.

స్త్రీలకు— అప్పుడప్పుడు స్వల్ప అనారోగ్యం చేయవచ్చును కుటుంబ కార్యక్రమాలు బాగానే ఉంటాయి. పోటీవారిలో గౌరవం బాగా ఉంటుంది. సంవత్సరం మధ్యలో అనుకూల వార్తలను వింటారు. పుణ్యకార్యాలు చేస్తారు.

**మీనం :**

**(పూ. భాద్ర, 4 పా, ఉ. భా, రేవతి.)**

ఈ సంవత్సరం అంత బాగా ఉంటుందని ఆశించడానికి అవకాశంలేదు. వృత్తి వ్యాపారాల్ల సామాన్య వ్యవహారాలకు కూడా వ్యయ ప్రయాసలకు గురి కావలసి వస్తుంది. వ్యాపారంలో కొంతమంది వ్యక్తులు తమ స్వార్థానికి మిమ్మల్ని వినియోగించుకొనడానికి ప్రయత్నిస్తారు. సాహసముతో కూడిన వ్యవహారాలకు పూనుకోవడం మంచిది కాదు. వృత్తిలో కొంచెం శ్రమమీద యథాతథ స్థితిని కాపాడుకొంటారు. మీరు ఎంత జాగ్రత్తగా ఉన్నా కొన్ని వ్యవహారాల్లో అధిక వ్యయం జరగడం వలన ఆర్థికంగా ఇబ్బంది కలుగుతుంది. ఉద్యోగంలో అధికారులతో భేదాభిప్రాయాలు వచ్చినా, తరువాత మీ అభిప్రాయాలే సరియైనవని రుజువు కావడంవలన యితోధిక గౌరవాన్ని పొందగలరు. సాంఘిక వ్యవహారాల్లో ప్రయోజనం లేని బాధ్యతను వహిస్తారు. అనారోగ్య సూచనలు ఉన్నాయి. విద్యార్థులు చాలా శ్రమమీద కృతార్థులు కావచ్చును.

స్త్రీలకు—ఆరోగ్య విషయంలో జాగ్రత్త అవసరం. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి. దగ్గర బంధువులకు చికాకులు కలగడం వలన మానసికాందోళన కలుగుతుంది. తీర్థయాత్రలు చేస్తారు.



# జన్మదిన ఫలం

## ఏప్రిల్-2

ఈ సంవత్సరం మీరు ఆర్థికంగా ఘన విజయాల్ని సాధించలేక పోవచ్చునుగాని అన్ని వ్యవహారాల్లోను క్రమాభివృద్ధిని పొందగలరు. ఇంతవరకు కేవలం ఆశయాలుగా మీ వూహాపథంలో ఉన్న వ్యవహారాలు ఇప్పుడు కార్యరూపం ధరిస్తాయి. వ్యాపారంలో పోటీవారిలో గౌరవం బాగా ఉంటుంది. వృత్తిలో మీ అభిప్రాయాలకు తగిన అవకాశాలు లభిస్తాయి. ఆర్థిక వ్యవహారాలు బాగానే ఉన్నా వ్యాపారం భారీ ఎత్తున చేయడంవలన ఆర్థికంగా ఒత్తిడి వస్తుంది. ఉద్యోగంలో అనుకూలమైన మార్పులు వస్తాయి. సాంఘిక వ్యవహారాల్లో బాధ్యతతో కూడిన పదవిని నిర్వహించగల సూచనలు ఉన్నాయి. ఆరోగ్యం ప్రస్తుతం బాగా ఉన్నా నిర్లక్ష్యం చేయుతగదు. కుటుంబ వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి విద్యార్థులు మంచి మార్కులతో కృతార్థులు కాగలరు

## ఏప్రిల్-3

ఈ సంవత్సరం చిత్రంగా ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో ఏ క్షణం ఏమి జరుగుతుందో అనే ఆందోళన కలుగుతుంది కాని చివరకు అన్ని వ్యవహారాలూ అనుకూలంగానే నెరవేరతాయి. వృత్తిలో నూతన మార్గాల ద్వారా ఆదాయం వస్తుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు సంవత్సరం మధ్యలో లాభించగల సూచనలు ఉన్నాయి. వ్యాపార విస్తరణ ప్రయత్నాలకు ఇదివరకు ఏర్పడిన అవరోధాలు తొలగిపోతాయి. ఉద్యోగంలో అనుకూలమైన స్థానమునకు మార్పు జరుగుతుంది. స్థిరాస్థి వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. శుభమూలంగా ధన వ్యయం జరుగుతుంది. కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. దూర ప్రయాణాలు చేస్తారు. విద్యార్థులు కొంచెం శ్రమమీద కృతార్థులు కాగలరు.

## ఏప్రిల్-4

ఆర్థికంగా బాగానే ఉన్నా, వృత్తి వ్యాపారాల్లో మీరు అనుకొనేది ఒకటి, జరిగేది మరొకటిగా ఉండడం వలన ఈ సంవత్సరం అంత సంతృప్తికరంగా ఉండకపోవచ్చును. మీరు స్వంతంగాచేసే వ్యాపారాలకంటే భాగస్వాములతో కలసిచేసే వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. వృత్తిలో పోటీవారితో పోటీ పెరగడంవలన తరచుగా మీ కార్యక్రమాలకు మార్పులు వస్తూ ఉంటాయి. ఆదాయం బాగానే ఉంటుంది గాని రావలసిన డబ్బు సమయానికి అందకపోవడంవలన కొన్ని వ్యవహారాలను వదలుకోవలసిన పరిస్థితి ఏర్పడుతుంది ఉద్యోగంలో మార్పులుకోసం సంవత్సరాంతంలో చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. ఆరోగ్యం బాగా ఉంటుంది. బంధువుల వ్యవహారాల్లో కొత్త సమస్యలు తలఎత్తవచ్చును. అలంకార వస్తువులు కొంటారు. విద్యార్థులు సామాన్యంగా కృతార్థులు కాగలరు.

## ఏప్రిల్-5

ఈ సంవత్సరం ఇతరుల దృష్టిలో మీకు యోగవంతమైనదే కావచ్చునుకాని మీకుమాత్రం

సంతృప్తికరంగా ఉండదు. ఎప్పుడూ పదిమందితో తిరగడం, అందరూ మీ మాటకు వాహ్ అనడం జరుగుతుంది కాని దానివల్ల మీకు ఒరిగేదేమీఉండదు. మీరు ఇతరులకోసం ఏ ప్రయత్నం చేసినా సులువుగా నెరవేరుతుందికాని మీ స్వంత వ్యవహారాల్లో చాలా శ్రమకు గురి కావలసి వస్తుంది. వృత్తి వ్యాపారాల్లో కొంచెం కష్టంమీద యథాతథస్థితిని కాపాడుకొంటారు. కొంతమంది వ్యక్తులు మీకు ఆశలు చూపించి మోసం చేయడానికి ప్రయత్నిస్తారు. ఉద్యోగంలో ఎవరినీ విశేషంగా నమ్మి వ్యవహరించడం తగదు. ఆరోగ్యం బాగానే ఉన్నా బలహీనత కన్పిస్తుంది. కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. విద్యార్థులు కొంచెం శ్రమమీద కృతార్థులు కావచ్చును.

## ఏప్రిల్-6

జీవితంలో ఇటువంటి సంవత్సరాలు చాలా అరుదుగా ఉంటాయి. మీరు ఈ సంవత్సరం జరిపే వ్యవహారాల ప్రభావం భవిష్యజ్జీవితంపై చాల వరకు ఉంటుంది కాబట్టి ప్రతి వ్యవహారంలోను చాలా జాగ్రత్తగా వ్యవహరించడం అవసరం. వ్యాపారంలో మీకు ముమ్మందు బాగా లాభించగల మార్పులు వాటంతట అవే రాగల సూచనలున్నాయి. వృత్తిలో మీకు అనుకూలమైన ఒప్పందాలు మొదలైన వాటిలో మీకు మిత్రుల తోడ్పాటు లభిస్తుంది. ఉద్యోగంలో ఉన్నతస్థానం కోసం మీరుచేసే ప్రయత్నాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. ఆరోగ్యం బాగానే ఉంటుంది. కుటుంబ వ్యవహారాల్లో అధిక వ్యయం జరుగుతుంది. శుభ కార్యాల విషయంలో స్వల్పాభివృద్ధి ఉంటుంది. విద్యార్థులకు కొంచెం శ్రమమీద క్లాసు రావచ్చును.

## ఏప్రిల్-7

వృత్తి వ్యాపారాల్లో సామాన్యమైన వ్యవహారాలకు కూడా విశేషమైన ప్రయత్నం చేయవలసిన పరిస్థితి తరచుగా ఏర్పడవచ్చును గాని తగిన ప్రతిఫలం లభించడంవలన ఈ సంవత్సరం సంతృప్తికరంగానే ఉంటుంది. భాగస్వాములతో కలిసిచేసే వ్యాపారాల్లో నూతనావకాశాలు లభిస్తాయి. వృత్తిలో సంవత్సరం మధ్యలో పాటివారి పోటీని ఎదుర్కొని విజయాన్ని సాధించగలరు. ఉద్యోగంలో మీ పరిస్థితి సామాన్యంగా ఉంటుంది. సంవత్సరాంతంలో మీరు జరిపే వ్యవహారాల్లో కొంత డబ్బు చిక్కుబడిపోయే ప్రమాదం ఉంది. ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి. విద్యార్థులకు సెప్టెంబరు పరీక్షలు బాగా ఉంటాయి. సాహిత్య కళా రంగాల్లో కృషి చేసే వారికి మంచి సమయం.

## ఏప్రిల్-8

గత సంవత్సరంకంటే ఈ సంవత్సరం బాగా ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో మీరు ఇదివరకు ప్రారంభించిన వ్యవహారాలను ఇప్పుడు పూర్తి చేయడంవలన ఆదాయం పెరుగుతుంది. మీకు అంతగా ఇష్టం లేకపోయినా కొన్ని వ్యవహారాల్లో మధ్యవర్తిత్వంవంటి పాత్రను నిర్వహించవలసి వస్తుంది. అధికారుల వలన జరుగవలసిన వ్యవహారాలు సంవత్సరం మధ్యలో అనుకూలంగా ఉంటాయి. వృత్తిలో ప్రయాణం ద్వారా కార్యసాధన చేయగలరు. ఉద్యోగంలో అనుకూలమైన మార్పులు వస్తాయి. రాజకీయ వ్యవహారాల్లో నూతనోద్యమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. స్థిరాస్థి వ్యవహారాల్లో ఇదివరకు ఏర్పడిన చికాకులు తొలగిపోతాయి. కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. విద్యార్థులు సాధారణంగా కృతార్థులు కాగలరు. 




నాట్యం వినోదిస్తున్న వీరబాహునికి హరిశ్చంద్రుడు సేవ చేయుట

విజయావారి అద్వితీయ పౌరాణిక చిత్రం "సత్య హరిశ్చంద్ర"

నిర్మాత-దర్శకత్వం:
K. V. రెడ్డి, B. Sc. Hons

# అవీ - ఇవీ - అన్నీ

## విజ్ఞాన వాహిని

మానవజీవితానికి వెలుగును ప్రసాదించి అజ్ఞానాంధకారంలో నుంచి వెలికితెచ్చేది విజ్ఞానశాస్త్ర పరిజ్ఞానమేనని ఘంటాపథంగా చెప్పవచ్చు తన అవిరళమైన కృషితో మానవుడు అభేద్యమైన సృష్టి రహస్యాలనెన్నింటినో భేదించి అనేక విషయాలను అవగతం చేసుకొంటున్నాడు ఆధునిక ప్రపంచంలో విజ్ఞానశాస్త్రం ఆవశ్యకత నానాటికీ అధికమై మానవాళికి ప్రయోజనాత్మకమైన విషయాలనెన్నింటినో వెలుగులోకి తీసుకొని వస్తున్నది సామాన్య మానవునకు కూడా నేడు శాస్త్ర విజ్ఞానం ఎంతో అవసరం వందల సంవత్సరాలుగా మేధావులు కృషిచేసి సాధించిన ప్రయోజాలనెన్నింటినో నేటి సమాజం పొందుతున్నది దినదినాభివృద్ధి చెందే ఈ శాస్త్ర విజ్ఞాన విషయాలను సామాన్య మానవుని కందుబాటులోకి తేవటానికి తెలుగుభాషా సమితి (మద్రాసు) వారు 'విజ్ఞాన వాహిని' అనే త్రైమాసిక సంచికను అందమైన ముఖచిత్రంతో చక్కని ముద్రణ, చిత్రాలతో వెలువరించారు సంవత్సరానికి సుమారు నాలుగుసంచికలు వెలువడతాయి అందులో 1,2,3 సంచికలు మాకార్యలయం చేరాయి దీనికి సంవత్సరచందా ఆరు రూపాయిలు విడిప్రతి రూపాయిన్నర ప్రతులకు విజ్ఞానవాహిని తెలుగుభాషా సమితి, 27, యూనివర్సిటీ బిల్డింగ్స్ మద్రాసు-5

## పంచాంగం

శ్రీ పోతూరి సుబ్బరాయశాస్త్రి రూపొందించిన విశ్వావసు సంవత్సర పంచాంగం మా కార్యాలయం చేరింది ఇందులో గ్రహ నాయకత్వము, గ్రహ సంచార ఫలములు, సౌఖ్యములు, కర్తరి, గ్రహణములు, శుభకార్యములకు సంతనములు, పండుగలు, గ్రహకాల హోర, సూర్యోదయాస్తమయములు, విశ్వావసు పంచాంగం, నక్షత్ర దశాభుక్తుల వివరాలు ఉన్నాయి దీని వెల బుక్‌పోస్టు ద్వారా 60 పైసలు కాపీలకు శ్రీ పోతూరి సుబ్బరాయశాస్త్రి, 147—11 ఏ, బాలాజీ నగర్, మదరాసు—14

* * *

అలీఘర్ విశ్వ విద్యాలయములోని ఆంధ్ర అధ్యాపక విద్యార్థి బృందము, చిన్న సంఘాన్ని స్థాపించిరి వీరి ఆరంభ సమావేశములో సంఘము యొక్క ముఖ్యోద్దేశ్యముగ ఆంధ్ర విద్యార్థులయొక్క కష్ట సుఖములను చూచుట, మరియు తెలుగు సాంస్కృతిక గోష్ఠి[illegible] సభలు సమావేశములు ఏర్పాటుకు గాను నిశ్చయించిరి సంఘాధ్యక్షులుగా శ్రీ యస్ దురానీగారిని, ఉపాధ్యక్షులుగా శ్రీ అయాచితుల హనుమత్ శాస్త్రి గారిని, కోశాధికారిగా శ్రీ మహమ్మద్ అమీర్‌జానీ గారిని కార్యదర్శిగా శ్రీ కడియాల రాధాకృష్ణ గారిని సహాయకార్యదర్శిగా శ్రీ మహమ్మద్ అలీ కిషోర్‌గారిని ఎన్నుకొనడమైనది

సభ్యుల జాతీయ గీతముతో సభ ముగిసినది



Edited, Printed and Published by S Radhakrishna at the Andhra Patrika Press, 6&7 Thambuchetty Str
Madras 1. Phone, 29766 & 23713. Chief Editor S. Sambhu Prasad.



తారసరోజాదేవి ప్రత్యేక చిత్రం ఫొటో: ప్రభాకర్.

